







జులై 4

కీరవాణి పుట్టిన రోజు

సందర్భంగా

సంగీత ప్రియులందరి

తరపున

శుభాకాంక్షలతో....

హాసం

ఇదీ సంగతులు

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం





సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
**'అల్లరిరాముడు'**
**'రోజాపూలు'**
సినిమా పాటల పుస్తకాలు
**'సెంటర్‌స్ప్రెడ్'లో**



**అనుబంధంగా కీరవాణి, బాలమురళీకృష్ణ, మణిశర్మ, మదన్‌మోహన్ పాటలు...32,73,72,44,74,71 పేజీలలో**

ముఖచిత్రం:'అల్లరి రాముడు' సినిమాలో ఆర్తీఅగర్వాల్

'హాసం' పత్రిక బావుంటుంది.
ఉత్తిపుణ్యానికే పత్రిక తీసుకోవటం
సబబుగా తోచట్లేదు.
సంవత్సర చందా పంపిస్తున్నాను.
అన్యథా భావించక స్వీకరించండి,
ప్రతి యేడూ ఇలాగే పంపిస్తాను.
-శ్రీధర్, "ఈనాడు" కార్టూనిస్టు,
హైదరాబాద్




చదవడం, వ్రాయడం మరచిపోయి టి.వి. అతుక్కుపోయి 'కళ' అనే పదానికి అర్థాన్ని మరచిపోయి, ఎంత సేపు 'సినిమా'కి సంబంధించిన గెంతులు చూసే వాళ్ళకి మా (మీ) 'హాసం' పూర్తిగా చదవాలనే జిజ్ఞాస కలిగించ డం మా అదృష్టం.

ఇకపోతే చిత్తరంజన్‌గారు అందిస్తున్న లలిత గీతాలు అన్ని ఒక క్యాసెట్‌గా వెలువరిస్తే (ఆ పాత గాయకులు పాడినవే) వినాలని చాలా కోరికగా ఉన్నది.

-ఎ.వెంకటేశ్వర్లు, అనంతపూర్

"హాసం" 1-15 జూన్, 2002 సంచిక "మీ పద సంపద"లో పొరబాటు దొర్లింది. 'భోజ్యం' అంటే (ఎ) భుజింపతగినది కరక్టు. (బి) భోగింప తగినది అని కాదు.

-ఆర్.వి.రాఘవరావు, అద్దంకి

(మీరు కరక్టు. అది అచ్చు తప్పు - సం॥)

'హాసం' 15-30 జూన్ సంచికలో జంధ్యాల గారి గురించి శ్రీ ఆదివిష్ణుగారు, మల్లాది గురించి రావి కొండలరావు, (మల్లాది వారి జన్మదినమైన జూన్ 16 సందర్భంగా ఈ వ్యాసం వెలువడడం సముచితంగా ఉంది) మామ (మహదేవన్) గురించి మురారి ఎన్నో సంగతులు బాగా వివరించారు. తన అసిస్టెంటు పుహళేందిని రైలులో రమ్మంటే తాను ప్రయాణాన్ని మాను కొన్న 'మామ' లాంటి వ్యక్తిత్వమున్న వారు అరుదు కాదు... అసలుండరేమో! ఆ విధంగా ముగ్గురు మహిమాన్వితుల గురించి ఈ పక్షపు 'హాసం' ప్రచురించటం అభినందనీయం.

-జి.ప్రభాకర్‌రావు, హైదరాబాద్

మీ (మా) 'హాసం' పత్రికను చాలా బాగా ముస్తాబు చేస్తున్నందుకు అభినందనలు. ముఖ్యంగా ఈ పత్రికలో 'క్లాసిక్ రిటోల్డ్' లో కాళ్ళకూరి వారి 'వరవిక్రయం' నాటకం మొదలు పెట్టటం నాలాంటి వారికి ఆనందం కలిగించింది. ఎందుకంటే అది ఒక మణిపూస.

గురజాడ వారి 'కన్యాశుల్కం'లో సందేశ మున్నా చాలా పాత్రలు, నాటకం చాలా పెద్దది. 'గణపతి'లాంటి రచనల్లో మోటు హాస్యం. కానీ 'వరవిక్రయం' నాటకంలో మంచి సందేశం, పాత్రలు తక్కువ, నాటకం సూటిగా, చిన్నగా వుంటుంది. ముఖ్యంగా ఈ నాటకంలో పద్యాలు చాలా సరళంగా, ఈ తరం పిల్లలు గూడా తేలిగ్గా అర్థం చేసుకునేలా వున్నాయి. లక్ష్మీ దండకంగా పద్యాలు ప్రచురిస్తే బాగుంటుందని నా అభిమతం. అసలు నాటకమంతా ప్రచురించినా నాలుగు సంచికల్లో ముగించవచ్చు. ఎందుకో ఈ నాటకానికి రావలసినంత పేరు రాలేదు. ఎవ్వరూ ప్రదర్శించటానికి ఉత్సాహపడటల్లేదు. మీ ప్రచురణ వల్ల ఈ నాటకం మళ్ళీ వెలుగులోకి వచ్చి, నాటకోత్సాహికులు ప్రదర్శిస్తారని ఆశిస్తున్నాను.

-ఎం.ఎల్.వి.కృష్ణమాచార్యులు, హైదరాబాద్

16-30 జూన్ సంచికలో శ్రీ మురారి గారు శ్రీ కెవి.మహదేవన్ గారి గురించి వ్రాసిన వ్యాసంలో "మంచి మనసులు" చిత్రం 1972-73 నాటిదన్నట్టు వ్రాశారు. 'మంచి మనసులు' చిత్రం 1962లో విడుదలయింది. యువచిత్ర బేనర్‌లో వచ్చిన "నారీ నారీ నడుమ మురారీ", 'జానకీ రాముడు' చిత్రాల ప్రసక్తి లేదు. అందులోని పాటలు అన్నీ హిట్లే.

-ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూరు

(ఫుల్‌స్టాప్ బదులు కామా పడడంతో ఆ అర్థం స్ఫురించింది. మీరు కరక్టు. -సం॥)

"హాసం"లో మురారిగారి వ్యాసం చూశా. ఆయన 'మామ'గారిని మనముందుంచారు. శెభాస్ 'హాసం' సంచికలు చదువుతున్నా. బాగానే వుంటున్నాయి. సంపాదకుడికి మంచి మ్యూజిక్ సెన్స్ వుంది.

-చలసాని ప్రసాద్, విశాఖపట్టణం

'హాసం 'లాంటి పత్రిక ఇదివరకెన్నడు రాలేదనడంలో అతిశయోక్తి కాదేమో. పాత సినిమా పాటలు ఎక్కడా దొరకని రోజుల్లో వాటి సాహిత్యం ప్రచురించి, వాటి విశ్లేషణ చేయడంలో 'హాసం' వారు ఎంతైనా అభినందనీయులు.

-పి.పాపారావు, విశాఖపట్నం

ప్రింట్‌మీడియా అధోగతిపాలవుతున్న నేటి సమాజంలో పత్రికల పట్ల అలనాటి సినీ జీవిత విశేషాలను పాఠకులకి అందజేస్తూ ఆరోగ్యకర వాతావరణాన్ని అన్ని వర్గాలకు అందిస్తున్న 'హాసం' నిర్వాహకులు అభినందనీయులు. అధిక సంఖ్యలో పాఠకులు పాల్గొనడానికి మంచి శీర్షికలు ప్రవేశపెట్టగలరు.

-కోనే సతీష్‌కుమార్, శ్రీకాకుళం

పత్రికల పొడగిట్టని వారు సైతం 'హాసం'కు మినహాయింపు యివ్వటం గర్వించదగ్గ విషయం. మా ప్రాంతంలో, మా స్నేహ బృందంకు సంబంధించి వేరే ప్రాంతాలు, ప్రవాసాంధ్రులకు సయితం 'హాసం'ను పరిచయం చేసి, వారిని 'హాస్య' ప్రియులుగా చేయటంలో చందాదార్లుగా చేర్పించటంలో కృతకృత్యులయ్యారని చెప్పటానికి గర్విస్తున్నాను. 'హాసం' క్లబ్ ఏర్పాటు చేయాలి. జూన్ 15 శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా 'హాసం' ప్రత్యేక వ్యాసం వేస్తుందనుకొని ఎదురు చూశాం.

-ఇ.చక్రపాణి, అనకాపల్లి,

(ఒక సంచికను రూపొందించినప్పుడు ఆ పక్షంలో పుట్టిన, గిట్టిన వివిధ రంగాల, వివిధ దేశాల మహనీయులందరిపై వ్యాసాలు రాయించడానికి స్థలం రీత్యా పరిమితు లుంటాయి. అందుకే జూన్ 1-15 సంచికలో ఉత్తరాల శీర్షికలోనే జనవరిలో శ్రీశ్రీ జయంతి సందర్భంగా ఆయనను స్మరించుకుంటామని తెలపడం జరిగింది. - సం॥)

సంపుటి :1 సంచిక: 19

1-15 జులై 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200



మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక 19

కళ తీగలాటిది; ఆలంబన కావాలి. అది అందరికీ తెలిసున్న విషయమే. కళను ప్రోత్సహించవలసినది, పోషించవలసినది ఆ నాడు రాజులూ, ఈనాడు ప్రజాప్రభుత్వమూ అనుకోవడం సరికాదు. రాజ్యమేలే వారికి వారి వారి వ్యక్తిగత ఇష్టాయిష్టాలు, రాగద్వేషాలు ఉంటాయి. వాటిని బట్టే ఆయా కళాకారులకు లభించే మన్నన, గుర్తింపు ఉంటుంది.

కళాకారుడు జీవించేది ప్రజల మధ్య, అతని ప్రథమ లక్ష్యం ఆత్మానందమే అయినా రసికుల, రసజ్ఞుల ఆమోదాన్నీ, హర్షధ్వానాల్నీ అతడు ఆశిస్తాడు. అవి లభించినప్పుడు పులకిస్తాడు. కళకు మరింత అంకితమవుతాడు. తమ అనుభూతిని వ్యక్తీకరించడానికి సభికులు ఫలం, పుష్పం, తోయం - కానుకగా ఇచ్చినప్పుడు అమితానందంగా స్వీకరిస్తాడు. వాటిని అమృత సమానంగా భావిస్తాడు. అతడు శ్రీమంతుడు కావచ్చు. వీటిని వేరేరకంగా సంపాదించుకునే ఉపాధి కలవాడు కావచ్చు. కానీ ఈ ప్రోత్సాహం అతనికి ఉత్సాహోన్నిస్తుంది. కొత్తశక్తిని నింపుతుంది. తను సరైన బాటలోనే నడుస్తున్నానని, ప్రజలకు, రసజ్ఞులకు దగ్గరవుతున్నానని, వారి హృదయం తెలిసి మసలుతున్నానని తెలియజెపుతుంది.

ఒక కళను ఆదరించడం ద్వారా, పోషించడం ద్వారా ఒక శ్రోత, ఒక పాఠకుడు, ఒక ప్రేక్షకుడు తన అభిరుచిని బాహాటంగా చాటుకుంటున్నాడు. తనకు నచ్చినది పదిమందితో పంచుకోవాలని ఉబలాట పడుతున్నాడు. ఇటువంటి అభిరుచి మరింతమందిలో పాదుకొనేటట్లు కృషి చేస్తున్నాడు. కళాకారుడికి వెన్నుదట్టి, అతడు ఆ కళపట్ల మరింత శ్రద్ధ చూపేటట్లు చేస్తున్నాడు. తద్వారా మరి కొందరు కళాకారులు ఆ బాట పట్టడానికి, మరికొందరు పాఠకులు తన వంటి రసజ్ఞుల వర్గంలో చేరి సంఖ్యాబలం పెంచడానికి దోహదపడుతున్నాడు.

"హాసం" విషయానికి వస్తే "ఆపాత(ట)మధురం" శీర్షికను ఒక సంచికకు తను స్పాన్సర్ చేస్తానంటూ శ్రీ ఎం.వి.యస్.హరనాథరావు ముందుకు రావడం మమ్మల్ని హర్షాశ్చర్యాలలో ముంచెత్తింది. ఒక వాణిజ్య సంస్థ తన ఉత్పాదనల అమ్మకానికి పాప్యులర్ శీర్షికనో, ప్రోగ్రామునో స్పాన్సర్ చేయడం సహజం. ఇక్కడ హరనాథరావు గారు "హాసం" పాఠకులకు అమ్మదలచిన ఉత్పాదన ఏదీ లేదు. కేవలం తన అభిరుచిని పదిమందితో పంచుకోవడానికి ఆయన గత సంచికలోని "ఆపాత(ట) మధురం"ను స్పాన్సర్ చేశారు.

అదే స్ఫూర్తితో ఈ సంచిక నుండి ఆరు సంచికలపాటు ఆ శీర్షికను స్పాన్సర్ చేస్తానంటూ శ్రీ మణిశర్మ ముందుకు వచ్చారు. అదీ.... తన మిత్రుడు, దివంగత దర్శకుడు, తిరుపతిస్వామి స్మృత్యర్థం చేస్తానన్నారు. ఇది మరింత చక్కని ఆలోచన. తల్లితండ్రులనో, గురువులనో, బంధుమిత్రులనో స్మరిస్తూ వారి పేర మనకు నచ్చిన ఒక సత్కార్యం చేయడం అభిలషణీయం, ఆదరణీయం. ఇక్కడ మనం వెచ్చించే ధనం ఎంత అన్నది చర్చనీయం కాదు, మన అభిరుచిని, మనం ప్రేమించే వారిపై అభిమానాన్ని చాటుకొనడమే ముఖ్యం. శీర్షిక ఏదైనా కావచ్చు.

ఈ స్పాన్సర్‌షిప్‌లో వేర్వేరు రూపాలు కూడా మా అనుభవంలోకి వచ్చాయి. జంగారెడ్డిగూడెం నుండి జి.రంగనాయకమ్మ అనే ఒక అధ్యాపకురాలు తణుకులోని వృద్ధాశ్రమం పేర చందా కట్టారు. ఇంకొక పాఠకుడు తన స్నేహితుల పుట్టిన రోజు కానుకగా ఒక సంవత్సరం పాటు 'హాసం' పంపమంటూ వారిపేర చందాలు కట్టారు.



మానవీయ సంబంధాలు పెంపొందడానికి సమాజం పట్ల ప్రేమతో కృషిచేసే వారికి ఈ విధంగా ఉపయోగ పడుతున్నందుకు 'హాసం' గర్విస్తోంది.



# మాస్టర్ పీచు...

## చలసాని ప్రసాదరావు

**రచయిత, జర్నలిస్టు, అనువాదకుడు, సాహిత్యవిమర్శకుడు, చిత్రకళా నిపుణుడు, 'విపుల', 'చతుర' ల సంపాదకుడు చలసాని ప్రసాదరావు జూన్ 12న కీర్తిశేషులయ్యారు. 1939 అక్టోబరు 27 న కృష్ణాజిల్లాలో జన్మించిన ప్రసాదరావు తన 10 వ యేటనే శాశ్వత బధిరత్వానికి గురయ్యారు. అయినా బహుముఖ ప్రజ్ఞ కనబరచడానికి, ఉన్నత పదవులు నిర్వహించడానికి అదేమీ అవరోధం కాలేదు. ఆయన సాధించిన విజయాలు ఎన్నో ఉన్నాయి. నిర్మొగమాటంగా మాట్లాడుతూనే అన్ని వర్గాల వారితోనూ, అన్ని వయస్సుల వారితోనూ స్నేహం నెరపగల నేర్పు ఆయనకే స్వంతం. హాస్యం, వ్యంగ్యం ఆయన అభిమాన విషయాలు. తను సంపాదకత్వం వహించే పత్రికలలో హాస్య, వ్యంగ్య రచనలను ప్రత్యేకంగా ఆహ్వానించేవారు. 'హాసం' పత్రిక రూపు దిద్దుకుంటున్న రోజులనుండీ ఆయన 'హాసం' అభిమాని. ఈ మధ్యనే 'ఈ పత్రిక నాబోటివాడు బేవార్స్‌గా కాపీని కొట్టేయడం క్షంతవ్యం కాదు కనుక..' అంటూ రెండేళ్లకు చందా కట్టారు. "ఈనాడు"లో 'కబుర్లు' శీర్షికలో ఆయన గుప్పించే వ్యంగ్యాస్త్రాల రుచి చూసేవారికి ఈ ఆత్మవిమర్శ కొత్త అనిపించదు. కాలమిస్టుగా సుప్రసిద్ధులయినా చలసాని ప్రసాదరావు కొన్ని కథలు రాసారు. వాటిలో కళావిమర్శకుల ధోరణిని ఎండగట్టే "మాస్టర్ పీచు"(1973) అనే ఈ కథను వారి కుటుంబసభ్యుల సౌజన్యంతో పునర్ముద్రిస్తున్నాము. -సం॥**

---

"మన సుబ్రావ్‌గాడు ఈ కళాఖండం ద్వారా మన మట్టి బుర్రల్లోకి ఎక్కించదలచిన మహత్తర సందేశం ఏమిటంటావు?'' రావు నుద్దేశించి అడిగాడు దాసు.

రావు బుర్ర గోక్కోలేదు, కళ్ళజోడు సవరించలేదు, ఎదురుగా ఉన్న పెయింటింగును గానీ, పై కప్పునుగానీ పరిశీలించటం లాంటి వేవీ చేయలేదు. అతని చూపులు అల్లంత దూరాన్న ఓ శిల్పం ముందున్న ఇద్దరమ్మాయిల మీద నున్నాయి. ఆ చూపులు నిశితంగా వారి సౌందర్యాన్ని ఎక్స్‌రే తీస్తున్నట్లున్నాయి.

ఆర్ట్ గ్యాలరీలో డజన్లకొద్దీ ట్యూబ్‌లైట్లు వెలిగిపోతూన్నయ్! వాటి క్రింద ఓ నలభైదాకా రంగురంగుల పెయింటింగులు మెరిసిపోతూన్నయ్!

ఆ నలభైలోనూ మూడు సుబ్బారావువి. అతను ఎంతో కొంత పేరున్న చిత్రకారుడే! ఆ మూడింట్లోనూ ఒకదానికి వెయ్యి రూపాయల 'అవార్డ్' వచ్చింది. ఆ పెయింటింగ్ గురించే అడిగాడు దాసు. ఎగ్జిబిషన్లో ఆ అవార్డ్ రావటం అంటే "ఈ దేశంలోని ఈ సంవత్సరపు ఆర్టులో కెల్లా అత్యుత్తమ కళాఖండం ఇది!'' అని చాటి చెప్పటమే. ఓ మంత్రిగారు "తృతీయ పంచవర్ష ప్రణాళిక - కళాభివృద్ధి - అది ఎటుల జరుగగలదు'' అనే అంశంపై అనర్గళంగా ఉపన్యసించి స్వహస్తాలతో సుబ్బారావుకు వెయ్యి రూపాయల చెక్కు అందించి, బరువైన దండొకటి వేసి, షేక్ హ్యాండిచ్చి ఇంకా రెండు గంటలన్నా కాలేదు.

ఆ చిత్రాన్నుద్దేశించే అడిగాడు దాసు. కానీ, రావు పలుకలేదు. కనీసం ఇటు చూడనన్నా లేదు.

"మన వాడికి ఈ పెయింటింగులకన్నా ఆ ఆడపిల్లలే కళాత్మకంగా ఉన్నట్లున్నారు'' అన్నాడు మూర్తి.

"మంత్రిగారు తెగ పొగిడిన వెయ్యి రూపాయల కళాఖండం కళ్ళెదుట ఉండగా రావుగాడు ఇలా ఆ ముసలమ్మాయిల్ని చూస్తూ గుటకలు మింగుతూండడం కళారంగానికే ఇన్సల్ట్!'' అన్నాడు రాజు.

రావు ఉడుక్కోలేదు. "ఎదురుగా సజీవ శిల్పాలు కదలాడుతూండగా చూసి సంతోషించలేని మీ కళాభిమానం తగలెయ్య! ఏముందోయ్, ఈ సుబ్రావ్‌గాడి పెయింటింగులో?'' అన్నాడు నిర్లక్ష్యంగా.

'అక్షర లక్షలు చేసే మాట సెలవిస్తివిరా రావూ? నువ్వో ఎగ్జిబిషన్ పెట్టి అందులో ఇలాంటి అమ్మాయిల్ని కళాత్మకంగా వేలాడదీయరాదురా! చూసి తరిద్దుము గదా'' అన్నాడు దాసు.







"నా సంగతికేం గానీ, పోనీ నువ్వు చెప్పరాదురా మూర్తీ! ఈ కళాఖండం లోతుపాతులు, రోజా సాయంత్రం సుబ్రావ్ గాడితో కలిసి ఒన్ బై టూ కాఫీ త్రాగి పేవ్‌మెంటు మీద ఆర్టును గురించి ఉపన్యాసాలిస్తుంటావు గదా" అన్నాడు రావు.

సుబ్బారావు ఈ నలుగురికీ కూడా పరిచయస్తుడే! మూర్తికి మాత్రం మంచి మిత్రుడు.

"ఏమైనా సుబ్రావ్‌లో ఈ మధ్య కొంత ప్రోగ్రెస్ కనిపిస్తోందిలే" అన్నాడు మూర్తి.

"అవునవును! ఈ మధ్య వాడి గడ్డం, మీసాల్లో చాలా అభివృద్ధి కనిపిస్తోంది సుమా! ఆ మధ్య దూరాన్నుంచి చూసి పోల్చుకోలేకనే పోయాను" అన్నాడు దాసు.

"వాడి వేషంలాగే వాడి కళాఖండాలూ గుర్తు పట్టడం కష్టమయి పోతోందిలే! ఇంతకీ ఈ మాస్టర్ పీస్ మనకిచ్చే మహత్తర సందేశం ఏమిటంటారు?" ప్రశ్నించేడు రావు.

ఎదురుగా సుబ్బారావు పెయింటింగ్ ట్యూబ్‌లైట్ల పాల వెలుగులో కాంతులు విరజిమ్ముతోన్నట్లున్నది. ఆ నలుగుర్లోనూ మూర్తి ఒక్కడే కాస్త ఆర్టును గురించి ధాటీగా మాట్లాడగలవాడు.

"ఏముంటుంది. మీరూ ఇలాగే రంగులు ఖర్చు పెట్టి కాన్వాసులు ఖరాబు చేసి అవార్డులూ, వెయ్యేసి రూపాయలూ సంపాదించండి అని కావచ్చు" అన్నాడు రాజు.

"వెయ్యి కాదు. రెండు వేలు అను. ఇందాకే మ్యూజియం వాళ్ళు వచ్చి కొనేందుకు సెలక్టు చేసిన వాటిలో ఈ పెయింటింగ్ కూడా ఉంది. దీని ధర వెయ్యి రూపాయలు" అన్నాడు దాసు.

"వారేవా! ఈ రాత్రికి సుబ్రావ్‌గాడి చేత వాట్ బుడ్డీ ఖాళీచేయించకుండా కదలగూడదు" అన్నాడు మూర్తి.

"నాన్సెన్స్ మా స్కూల్ పిల్లకాయలు కళ్ళు మూసుకొని రుద్దగలరు ఈ మాత్రం కళాఖండాలు" అన్నాడు రావు.

"తగ్గరా నాయనా పిల్లగాళ్ళు కళ్ళు మూసుకుని వెయ్యగల కళాఖండాల్ని ఆర్టు కాలేజీల్లో అయిదారేళ్ళు తల క్రిందులుగా తపస్సు చేసిన కళాకారులు వేయగలగటం అంత తేలికేం కాదు" అన్నాడు మూర్తి.

"అసలు ఏ ఆర్టిస్టయినా చిత్రాలు ఎందుకు వేస్తాడంటారూ?" ప్రశ్నించాడు దాసు.

"తిన్నది అరక్క" అన్నాడు రావు.

"ఇంకెందుకు? అత్మ సంతృప్తికే" అన్నాడు రాజు.

"ఈ ఎగ్జిబిషన్లతో, అవార్డుల్తో మన ఆర్టిస్టుల ఆత్మలు శాంతించి నిద్రపోతున్నాయనా?"

"ఏమైనా గానీ, అసలు ఆత్మశాంతికనీ గీసేవాడు, రాసేవాడూ అదేదో వాడి ఆత్మలోనే ఏడవక ఇలా ఇంత డబ్బు తగలేసి రంగులూ, కాన్వాసులూ, ఫ్రేములూ పాడు చెయ్యటం..."

"ఆ తర్వాత ఎగ్జిబిషన్లకు పంపి ప్రైజు కోసం పైరవీలు చెయ్యటం, జడ్జీలకు టైర్లు కొడుతూ తిరగటం.."

"రాకపోతే ఏడవటం... ఎందుకూ...." రెట్టించేడు రావు.

"మరి ఎగ్జిబిషన్లలో కాకుంటే మీరంతా చూసేదెలాగోయ్?" ప్రశ్నించాడు మూర్తి.

"చూసి?"

"తరించటం... లేకుంటే ఆస్రో కంపెనీ వాడి లాభాలు పెంచటం".

"మరీ అంత తేలిగ్గా నోరుజారేయకండోయ్! కళల్ని ఆస్వాదించాలంటే కొంతన్నా అనుభవం కావాలి, కళాదృష్టి అలవరచుకోవాలి" అన్నాడు మూర్తి.

"అవును సుమా! రోజూ మా బామ్మ తెల్లారే చన్నీళ్ళు స్నానం చేసి చాలా సేపు గొణుగుతూ కూర్చుంటుంది. ఎంతవిన్నా నాకది అర్థం గాక మా అమ్మ నడిగితే 'ఆవిడ శివస్తోత్రం చదువుతుందిరా' అంది. నిజమే అనుభవం ఉంటే గానీ ఏదీ అర్థం అయిచావదు. ఆ దేవుడికి కూడా ఈ అనుభవం ఉన్నట్టు లేదు. మా బామ్మకు ఇంతవరకూ ప్రత్యక్షం కానేలేదు" అన్నాడు రావు.

"అయితే ఈ ప్రైజులిచ్చేవాళ్ళూ, వాటిని ఇప్పించే జడ్జీలూ, వాటిని వంచిపెట్టిన మంత్రులూ వీళ్ళంతా ఆస్రో కంపెనీ ఏజంట్లంటా వేమిట్రా?"

"అబ్బెబ్బే! ఏదో ఓ చిన్న ఏన్జీవోగాడిని. అంత పచ్చి నిజాలు నేనెలా ప్రవచించ గలను?"

"అంత తేలిగ్గా కొట్టెయ్యకండోయ్: ఈసారి వచ్చిన జడ్జీలు సామాన్యులేం గారు. తల నెరిసిన, పండ్లూడిన ఆర్ట్ క్రిటిక్కులు, కలకత్తా, ఢిల్లీ, బాంబేల్నుంచి తలా ఒకరు వచ్చారు".

"రైల్లో కూడా కాదు: విమానాల్లో" అందించాడు రాజు.

"అయితే విమానాల్లో తిరిగే వాళ్ళు మహా మేధావులన్న మాట"

"అక్షరాలా, ఈ మధ్య చాలా విమానాల్లో దార్లోనే చతికిలపడుతున్నది ఈ విజ్ఞానాన్ని మొయ్యిలేకనే".

"మన రావుగాడికి ఈ ఆర్టంటే గిట్టదనీ తెలిసి కూడా వాడితో పోట్లాటెందుకురా" వారించాడు దాసు.

"మీకున్నంత కళాహృదయం నాకు లేదుగానీ నన్ను వదిలేసి మీరంతా ఈ కళాఖండాల్ని మేసి సంస్కృతిని ఉద్ధరించండిరా నాయనలారా" అని తప్పుకున్నాడు రావు.

మూర్తి కాలర్ సర్దుకుని కళ్ళజోడు సవరించుకున్నాడు. "మనకు అర్థం కానంత మాత్రాన ఈ ఆర్టునంతా చెత్తక్రింద జమ కట్టటం..." అంటూ ప్రారంభించాడు.

"కాస్త చదువుకున్న అజ్ఞానులం! పైగా సుబ్రావ్‌గాడి దోస్తులం! మనకే అర్థంగాకుంటే మరింకెవరి కోసంరా బాబూ ఈ బొమ్మలు?" అడ్డు వచ్చాడు దాసు.

"ఏం ఎందుకు అర్థం గావు? సుబ్రావ్ ఈ పెయింటింగ్స్‌లో కొన్ని సింబల్స్ వాడాడు. అవేమిటో ముందు తెలుసుకుంటే సరి!" అన్నాడు మూర్తి.

ఎవరూ మాట్లాడలేదు. ఉత్సాహంతో విజృంభించాడు మూర్తి.

"మీరింకా గుర్తించటం లేదుగానీ, సుబ్రావ్‌గాడు ఈ మధ్య చాలా ఎదిగాడు! మొన్న ఆదివారం సత్యజిత్‌రాయ్ సిన్మాకు కూడా వచ్చేడు".







"అలాగా! మొన్న మా బామ్మ చేతుల్లో సినిమా పుస్తకం చూసాను" అందించాడు రావు.

"నువ్వుండరా నాయనా" విసుక్కున్నాడు మూర్తి. "ఈ మధ్య సుబ్రావ్ చాలా చదివేడు! వాంగో జీవితం చదివి, అతని చిత్రాలు ఆల్బంలో చూసీ మనవాడో వారం రోజుల పాటీ లోకంలోనే లేడు!".

"కొంపదీసి వాంగోలాగే చెవి కోసుకుని కట్లు కట్టుకుని పడుకోలేదు గదా?"

"నాన్సెన్స్ మాట్లాడకు: ఆమాటకొస్తే చెవిగానీ, ముక్కుగానీ కోసుకోగల దమ్ములు ఒక్క కళాకారులకే ఉంటాయి" గద్దించేడు దాసు.

"సరే! మరి సుబ్రావ్‌గాడు చెవి కోసుకోకుండా ఏం చేసినట్టు?" ఉత్సాహం చూపించేడు రావు.

"వేస్తే వీళ్ళందర్నీ మించిపోవాలి! లేదా తిని నిద్రపోవాలి అని తేల్చుకున్నాట్ట" వివరించాడు మూర్తి.

"శభాష్! మరి తిని నిద్రబోక ఇవన్నీ వేసి మన దుంపలెందుకు తెంపుతున్నట్టు?"

"ఎందుకా! వాడెంతగా ఎదిగాడో నీకెలా తెలియటం? వాడి ఆలోచనలే మారిపోయాయి. విప్లవ భావాలు ఎక్కువయ్యేయి."

ఎదురుగా ఉన్న సుబ్రావ్ పెయింటింగ్ అకస్మాత్తుగా ఓ బాంబుగా మారి పేలినంతగా ఉలిక్కి పడ్డారు ఆ ముగ్గురూ! నమ్మలేనట్లుగా మూర్తి వంక సంభ్రమంతో చూసేరు.

మూర్తి మందహాసం చేశాడు. "ఈ పెయింటింగులో రంగుల ముద్దలు తప్ప మరేం లేవనేగదా మీ గోల. నిజమే. కానీ, అంతా ఆ రంగుల్లోనే ఉంది. కాస్త పరికించి చూడండి. పైభాగంలో ముద్దముద్దగా చిక్కగా ఉన్న ఆ ఎర్రరంగు ప్రగతికి, విప్లవ భావాలకు సంకేతం, తెలుసుగా...?"

"అ... ఆ... అవును" నసిగేడు దాసు.

"మధ్యలో పసుపురంగులో కలగాపులగంగా, పెంటకుప్పలా కనుపిస్తున్నదే... అది మన చుట్టూ ఉన్న ఈ సమాజానికి సింబల్".

"ని...న్ని... న్నిజమే?"

"కాకేం! సుబ్రావ్‌గాడేమన్నా నీబోటి ఎన్జీవో గాడనుకున్నావా? వాడీ మధ్య చాలా సీరియస్‌గా, తెగింపుగా ఆలోచిస్తున్నాడులే."

"తర్వాత....?"

"ఇహ ఈ చిత్రం క్రిందిభాగంలో ఉబ్బెత్తుగా కనపడే నల్లరంగు ఓ బలిసిన పందికి సింబల్".

"పందా?... అంటే...."

"పంది దేనికి సింబల్ అయిందీ కూడా తెలీదూ?" గద్దించేడు మూర్తి.

"పంది పరిశుభ్రతకు చిహ్నం. అవే లేకుంటే మా బెజవాడ ఈ మాత్రం శుభ్రంగానన్నా ఉండేది గాదు" అందించాడు రాజు.

"నీ జోకులకేం గానీ, విను" ఉపక్రమించాడు మూర్తి. "స్వార్థం కోసం సమాజాన్ని ఛండాలంగా రూపొందనిచ్చి అందు మూలంగా లాభపడాలని చూసే దుష్టవర్గాలకు సింబల్ ఈ పంది."

"అవునవును" అడ్డం వచ్చాడు దాసు.

"మా ఆఫీసులో ఓ లావాటి ఆఫీసరుగాడున్నాడు. ఎవరికీ దక్కకుండా మామూళ్లన్నీ వాడే మింగుతుంటాడు. అందుకని అందరూ కలసి వాడికి 'సీమపంది' అని బిరుదిచ్చేరు".

"అదలా ఉండనీ" విసుకున్నాడు మూర్తి. "ఆ నల్లపంది ఈ పసుపు సమాజాన్ని లడ్డుండలా మింగేయాలని చూస్తోంది. ఈ సందర్భంలో ఆ నలుపుకూ ఈ ఎరుపుకూ జరిగే సంఘర్షణను ప్రదర్శించటమే ఈ చిత్రంలో సుబ్రావ్ చేసింది".

రాజు, దాసు తృప్తిగా తలూపేరు.




"నువ్వన్నట్లు కళల్ని అర్థం జేసుకోవాలంటే కాస్త అనుభవం ఉండాల్సిందే" అన్నాడు రాజు.

"సరేగానీ, ఇదంతా సుబ్రావ్ గాడే చెప్పాడా? లేక నీకేతట్టిందా" అనడిగేడు దాసు.

కళ్ళజోడు సవరించుకున్నాడు మూర్తి. "ఈ మాత్రానికి వాడిని అడగాలా? వాడీ పెయింటింగ్‌కు పెట్టిన పేరు చూస్తే తెలీటంలా?"

"మాకు తట్టనేలేదు సుమా? 'సంఘర్షణ' అంటే ఇదన్నమాట. మొత్తం మీద ఈ పెయింటింగ్‌తో బాగానే సంఘర్షించావులే".

అందరూ రాజీ కుదిరినట్టుగా, బరువు తగ్గినట్టుగా కదిలేరు.

రావుకు ఇందాకటి సజీవ కళాఖండాలెక్కడా కనుపించలేదు.

వాళ్ళు కళాస్వాదనతో కడుపు నింపుకుని ఎప్పుడో బయటకు పోయినట్లున్నారు హాల్లో జనం దాదాపు లేరు.

అటుగా వరండాలోకి చూసిన రావుకు అటే వస్తూన్న సుబ్రావ్ కనుపించేడు.

"నూరేళ్ళాయుష్షు. రావోయ్!" కేకేశాడు మూర్తి.

ముసిముసి నవ్వుల్తో వెయ్యి రూపాయల వాయినం ముట్టిన పెళ్లి కొడుకులా లోపలికొచ్చేడు సుబ్బారావు".

"నీ పెయింటింగ్‌ను వీళ్ళకు అర్థమయ్యేలా చెప్పలేక చచ్చాననుకో. మొత్తం మీద చాలా ఎదిగావోయ్" అన్నాడు మూర్తి.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నారందరూ ఏకగ్రీవంగా.

"థాంక్స్" అంటూ అందరికీ షేక్‌హ్యాండిచ్చేడు సుబ్బారావు. "ఆ ప్రైజు వచ్చిన పెయింటింగునే మ్యూజియం వాళ్ళు వెయ్యి రూపాయలకు కొనేశారు. ఇంతసేపూ వాళ్ళతోనే మాట్లాడుతున్నాను" అంటూ తృప్తిగా, గర్వంగా ఆ పెయింటింగుకేసి యధాలావంగా చూసుకొని ఉలిక్కిపడ్డాడు.

"పదండి కాఫీ త్రాగుదాం, ఎగ్జిబిషన్ మూసేసే టైమయింది" అంటూ బయటికి దారితీశాడు.

"కాఫీ ఏమిటి? నాన్సెన్స్! రెండు వేలు కొట్టేసి కనీసం బీరు బుడ్డీ అన్నా ఇప్పించవురా" ఎగిరేడు మూర్తి.

"ఓ! అలాగే!" అంటూ వాళ్ళతో కలిసి బయటికొచ్చి, మళ్ళీ అంతలోనే ఏదో గుర్తొచ్చిన వాడిలా "ఇప్పుడే వస్తా" నంటూ ఆర్ట్ గ్యాలరీలోకి నడిచాడు సుబ్బారావు.

ఎగ్జిబిషన్ ఇన్చార్జిని లాక్కుని తన పెయింటింగ్ వద్ద కొచ్చాడు సుబ్బారావు.

"కనీసం అవార్డు వచ్చిన పెయింటింగులనన్నా సరిగా వ్రేలాడదీయ వద్దటండీ! ఇంకా నయం! ఎవరూ గుర్తించలేదు గానీ, మీ పరువు గంగలో కలిసి ఉండును" అంటూ ఆ పెయింటింగును తలక్రిందులు చేసి, సరిగా సర్ది చేతులు దులుపుకుంటూ బయటకొచ్చాడు సుబ్బారావు.

ఎరుపు నలుపుల కళాత్మకత, కళాకారుల సింబాలిజంలను గురించి తీవ్రంగా చర్చించుకుంటున్న ఆ నలుగుర్నీ తోలుకుని తేలికైన హృదయంతో బరువుగా ముందుకు నడిచాడు సుబ్బారావు.


చదువులావు
సత్యమూర్తి
ఎందుకు చదువుకు రాలేదో- నువ్వు చెప్పిన కారణాలు మన లెక్చరర్ గారు నమ్మేరంటావా?
ఏమో
ఈసారి బుద్ధొచ్చింది.
రేపట్నించి బాగా ప్రిపేరయి రావాలి
రేపట్నించి బుద్ధిగా పాఠాలు ప్రిపేరయి వస్తావన్నమాట
పాఠాలు కాదు. మన లెక్చరర్కి చెప్పే కారణాలు.
సత్యమూర్తి

జులై 7, 2002న పరుచూరి బ్రదర్స్ తమ సినీ జీవిత రజతోత్సవాన్ని పూర్తి చేసుకుంటున్న సందర్భంగా.....



# అరిచేకుక్క కరిచింది



**(నాటిక)**

**రచన: పరుచూరి బ్రదర్స్**

**1995 జులై నెలలో జరిగిన తానా సభలలో ప్రదర్శించటం కోసం రాసిన నాటిక యిది. చికాగో, డెట్రాయిట్‌లలో ఆ నాడు ప్రదర్శించిన నాటికలో**

| | | |
|---|---|---|
| ప్రకాశరావు | పాత్రను | పరుచూరి వెంకటేశ్వరరావు |
| వరలక్ష్మి | పాత్రను | రంజిత |
| బాలు | పాత్రను | శ్రీహరి |
| అప్పలస్వామి | పాత్రను | కోట శ్రీనివాసరావు |
| ఏడుకొండలు | పాత్రను | బాబూమోహన్ |
| సూర్యం | పాత్రను | పరుచూరి గోపాలకృష్ణ |
| ఎస్.ఐ. | పాత్రను | కృష్ణారావు |

**పోషించారు. - ఎడిటర్**

(గత సంచిక తరువాయి)

(లైట్స్ ఆఫ్)

లైట్స్ ఆఫ్‌తో గద్దర్ పాట వస్తోంది. కొన్ని స్లొగన్స్ జిందాబాద్‌లు. డౌన్‌డౌన్‌లు వచ్చి... మెల్లగా ఫేడవుట్ అయ్యాయి.)

లైట్స్ ఆన్

అప్ప : (నెత్తిన గుడ్డేసుకుని వస్తూ) అయిపోయింది బాబోయ్. అంతా అయిపోయింది. కొంప కొల్లేరయిపోయింది.

ప్రకా : ఏవిటయ్యా... వ్యాపారంలో లాసొచ్చిందా?

అప్ప : లాసుకాదు... లాసేంజల్సు...! లాస్‌క్రూసిస్ కనిసిస్తున్నాయి...

వర : నాకేం అర్థం కాలేదు

అప్ప : ఎలక్షన్స్‌లో ఏం జరక్కూడదనుకున్నావో అదే జరిగింది.

ప్రకా : కొంపదీసి నీ ఓటు ఇంకొకడేసేశాడా!

అప్ప : కష్టపడి పోలింగ్ బూత్‌కెళ్తే ఆల్‌రెడీ నీ ఓటు గుద్దేశారన్నా బాధపడే వాణ్ణి కాదు... కట్టుకున్న భార్య కాపురం చెయ్యనన్నా ఫీలయ్యే వాణ్ణి కాదు...

వర : కాస్తర్థమయ్యేట్టు చెప్పు...




అప్ప : వాళ్ళు గెలిచేశారమ్మా....

ప్రకా : యుద్ధమన్నాక ఒకడు ఓడితేనేగా ఇంకొకడు గెలిచేది.

అప్ప : అర్జునుడు గెలిస్తే ఆనంద పడుండే వాణ్ణి. కానీ, దుర్యోధనుడు గెలిచాడు.... దుమ్మురేగ్గొడుతున్నారు.

ప్రకా : దుర్యోధనుడేంటి... దుమ్మేంటి

అప్ప : మీ తమ్ముడి పార్టీ గెలిచిందయ్యా....

బాలు : కమ్యూనిస్టు పార్టీ పవర్‌లో కొచ్చిందా?

అప్ప : కాదు నాకొంప మీదికొచ్చింది. రేపోమాపో ఆస్తులన్నీ లాగేసుకుంటారట... ఏవయ్యా ప్రకాశం పంతులూ.... కొంచెం మీ తమ్ముడితో చెప్పి... ప్రాంసరీ నోట్లు తప్ప నా దగ్గర కరెన్సీ నోట్లు లేవని రెకమెండేషన్ చెయ్‌మను.

వర : చేస్తే మాకేంటి లాభం.

అప్ప : ఆళ్ళకా పని చేసినందుకు లంచం ఇస్తా.... మీ బాకీ రద్దు చేసుకుంటా....

బాలు : బాబాయ్ నరికేస్తాడు.

అప్ప : ఎవర్ని

బాలు : తమర్నే

ఏడు : కొచ్చినేలేదు.

వర : ఈ కొచ్చిన్లు ఆన్సర్లు మనకెందుకుగానీ, ఏవండీ.... ఓ పది రూపాయలుంటే ఇవ్వండి... కూరగాయలు తేవాలి.

ప్రకా : వెయ్యిరూపాల నోటుందే; చిల్లర్లేదు.

వర : మీకెప్పుడు వేళాకోళమే.... ఏమయ్యో అప్పలస్వామీ... ఒక పాతికవేలు అప్పివ్వు....

అప్ప : అప్పా... ఇచ్చిన బాకీలన్నీ బ్లాక్ అయి నే నేడుస్తుంటే మళ్ళీ అప్పివ్వాలా? అయినా, ఇప్పుడే చెప్పానుగా నా దగ్గర ప్రాంసరీ నోట్లు తప్ప... కరెన్సీ నోట్లు లేవు.

వర : ఒరే బాలూ.... వీళ్ళతో లాభం లేదుగానీ... అలా బజార్లోకెళ్ళి....

ప్రకా : కూలిచేసి డబ్బు తెమ్మంటావా?

వర : కూలి చేసి బతకాల్సిన ఖర్మేంటి... దర్జాగా వెళ్ళి ఖూనీ చేసొస్తాడు.

ప్రకా : ఏమిటే నువు మాట్లాడేది... వాణ్ని వెళ్ళి మళ్ళీ హత్య చేసి రమ్మంటావా?

వర : ఒకసారి చేస్తేలేంది ఎన్నిసార్లు చేస్తే ఏంటట.... నువ్వెళ్ళరా నాయనా (అంటూ కత్తిచ్చింది)

బాలు : బైటికెళ్ళాల్సిన పన్లేదే... ఇంట్లోనే ఫినిష్ అయిపోతుంది.

కమ్యూనిస్టు ప్రభుత్వంలో వడ్డీ వ్యాపారం చెయ్యడం నేరం. అప్పుడు ఒక నేరస్తుణ్ణి చంపితేనే లక్ష రూపాయిలిచ్చింది. ఇప్పుడు కూడా నేరస్తుణ్ణే చంపుతా...

అప్ప : ఎవర్ని గురించిరా అతను మాట్లాడేది... నా

గురించేనా?

ఏడు : కొచ్చినే లేదు.
(బాలు వెంటబడ్డాడు. అప్పలస్వామి తప్పించుకుంటున్నాడు. ఒక చోట సోఫా చాటు దాకున్నాడు బాలు. అప్పలస్వామి సోఫా చుట్టూ తిరుగుతూ ఆగి చూశాడు. బాలు కనిపించలేదు "అమ్మయ్య" అనుకుని సోఫాలో కూర్చోబోతుంటే - సోఫా చాటు నుంచి బాలు లేచాడు. "బేర్"మని అరుస్తూ పరుగెత్తాడు అప్పలస్వామి. 'ఒరే బాలూ! 'ఆగరా' అంటున్నాడు ప్రకాశం... "వాణ్ణి ఆపొద్దూ..." అంటోంది వరలక్ష్మి తిరుగుతున్నారు. - బయట్నించి ఎస్.ఐ. వచ్చాడు.)

ఎస్.ఐ. : స్టాప్... స్టాప్ దేర్...

వర : సమయానికి ఎస్.ఐ. గారు కూడా వచ్చేశారూ.. ఎస్.ఐ. గారూ కాసేపాగండి పనైపోతుందీ...

ఎస్.ఐ. : ఆగకపోతే మీ అందరి పనైపోతుంది... ఆగండి (అని గట్టిగా అరిచాడు)

వర : మధ్యలో ఆపేశారేంటీ..... హెడ్డు రేటు పెరిగిందా?

ఎస్.ఐ. : లేదు... మీ అబ్బాయికి అరెస్టు వారెంటు జారీ అయింది.

ప్రకా : అరెస్టా... ఎందుకు?

ఎస్.ఐ. : హత్య చేసినందుకు

ప్రకా : హత్య చేసినందుకు అప్పుడే గవర్నమెంటు అవార్డు కూడా ఇచ్చిందే.

ఎస్.ఐ. : ఇప్పుడు ప్రభుత్వం మారిపోయింది.

సూర్యం: (వస్తూ) ఎస్... పాలసీ మారుతుంది. పాలించే విధానం మారుతుంది.

అప్ప : మారితే మాత్రం గవర్నమెంటు గవర్నమెంటు కొక రూలా?

సూర్యం: ఎస్... బాలూ చంపిన "సత్యం" పాత ప్రభుత్వానికి దేశద్రోహి. మా ప్రభుత్వానికి దేశ భక్తుడు. మా ప్రభుత్వం దృష్టిలో సత్యం దేశభక్తుడు. నీ కొడుకు దేశ ద్రోహి....

వర : అప్పుడు సత్యాన్ని నేరస్తుడన్నారుగా.... తెల్లవాడి ప్రభుత్వానికి దేశద్రోహి అయిన అల్లూరి సీతారామరాజుకు జోహార్లెందుకు చెబుతున్నారు?

సూర్యం: తెల్లవాడు నేరస్తుడని జైల్లో పెట్టించిన మహాత్ముడి విగ్రహాలు ఎందుకు సెంటర్లో పెట్టిస్తున్నారు?

అప్ప : వాళ్లు స్వరాజ్యం కోసం పోరాడారు గనక.

సూర్యం: వీళ్లు రేపటి స్వరాజ్యం కోసం పోరాడారుగనకే.

అప్ప : ఏం ప్రభుత్వమో ఏంటో... దున్నేవాడిదే భూమంట. తిరిగే వాడిదే కారంట... పడుకున్నోడిదే మంచం అంట... తిన్నోడిదే కంచం అంట... మన చేతుల్లో మట్టి మషాణం అంట....

సూర్యం: నోర్ముయ్... వందకి పది రూపాయలు వడ్డీ వసూలు



చేసే నీకేం తెలుసురా అభ్యుదయం విలువ. మా సిద్ధాంతాల్ని గురించి విమర్శిస్తావా?

అప్ప : ఓ... ఏవిటయ్యా సిద్ధాంతం... ఎవుడికీ సొంతిల్లు ఉండకూడదు. సొంత భూమి వుండకూడదు... ఇదెక్కడి సిద్ధాంతమయ్యా దిక్కుమాలిన సిద్ధాంతం.

సూర్యం: దిక్కుమాలిన సిద్ధాంతం కాదయ్యా పంచభూతాల సాక్షిగా ఏదో ఒక రోజు ఈ ప్రపంచానికి దిక్సూచిలా నిలిచే సిద్ధాంతం. మనిషి శరీరంలో పంచభూతాలుంటాయి... నీరు, నిప్పు, గాలి, ఆకాశం,



భూమి-

ఏడు : ఏటేటి.... బయటున్నట్టే మన బాడీలో కూడా పంచ భూతా లుంటాయా?

సూర్యం: ఉంటాయి.

ఏడు : కొంచెనే లేదు - ఎట్టుంటాయి?

సూర్యం: నీకు ఆకలెప్పుడేస్తుంది?

ఏడు : కడుపు కాలినప్పుడు.

సూర్యం: కాలడం అంటే అక్కడ నిప్పున్నట్టేగా-
నీకు దప్పికెప్పుడేస్తుంది?

ఏడు : గొంతెండిపోయినప్పుడు.

సూర్యం: అప్పుడు నువ్వేం చేస్తావ్?

ఏడు : నీళ్ళు తాగుతా-

సూర్యం: అంటే మనబాడీలో నిప్పుతో పాటు నీరూ వున్నట్టేగా - ఎవరికైనా శ్వాస ఎప్పుడాగిపోతుంది?

ఏడు : గాలి ఆడనప్పుడు.

సూర్యం: అంటే ఊపిరితిత్తుల్లో వుండేది గాలేగా - ఇప్పుడొప్పుకుంటావా మనిషి శరీరంలో పంచభూతాలుంటాయని -

ఏడు : కొంచెనేలేదు ఒప్పుకుంటాను.

సూర్యం: స్వేచ్ఛగా గాలిపీలిస్తే ఎవరైనా అడుగుతారా?

ఏడు : అడిగితే తంతా!

సూర్యం: నిప్పును పుట్టిస్తే నిలదీస్తారా?

ఏడు : నిలువునా పాతేస్తా-

సూర్యం: ఆకాశంలోని సూర్యచంద్రుల వేడినీ చల్లదనాన్నీ వాడుకుంటే ఎవరైనా కాదంటారా?

ఏడు : కాదంటే కాళ్ళిరిగిపోతాయ్.

సూర్యం: మరి మీ అప్పలస్వామి భూమిలో ఎవరైనా కాలుపెడితే వాళ్ళ కాళ్ళెందుకు విరగ్గొడతారు?

ఏడు : ఆ భూమికి ఆయన హక్కుదారుడు కాబట్టి...

సూర్యం: ఎందుకయ్యాడు?

ఏడు : దాన్ని ఆయనకొన్నాడు కాబట్టి.

సూర్యం: నీళ్ళు మనం కొంటున్నామా?

ఏడు : పట్టణాల్లో కొంటున్నాం గానీ - పల్లెటూళ్ళో ఫ్రీగానే దొరుకు తుందండి.

సూర్యం: నిప్పు

ఏడు : అగ్గిపెట్టె కొనాల్సొస్తుందిగానీ, వద్దనుకుంటే రాయితోరాయిని కొడితే నిప్పదే పుట్టుద్ది - ఫ్రీగా వాడుకోవచ్చు -

సూర్యం: మరి భూమి ఎందుకని ఫ్రీగా దొరకట్లేదు-

ఏడు : అదే అర్థం కావట్లేదు -

సూర్యం: ఎందుకంటే రోజురోజుకీ జనాభా పెరుగుతోంది గానీ దానికి తగ్గట్టు భూమి వైశాల్యం పెరగట్లేదు - అందుకే భూమికి డిమాండు పెరిగింది. దాంతో పెట్టుబడిదారులు, లక్షాధికారులు కరెన్సీ నోట్లు వెదజల్లి భూమిని కొని హక్కుదారులయ్యారు - పేదవాళ్ళు భూముల్లేక పేదవాళ్ళుగానే మిగిలిపోయారు.
అంటే - ఈ ప్రపంచంలో నీరు ఫ్రీగా దొరుకుతుంది - నిప్పు ఫ్రీగా దొరుకుతుంది. ఆకాశం ఫ్రీగా దొరుకుతుంది. దొరకనిది భూమి ఒకటే - ఈ పంచమ భూతమే మనల్ని పట్టి పీడిస్తోంది. ఈ భూమికోసమే మహాభారత యుద్ధం జరిగింది. ఈ భూమి కోసమే రాజకీయాలు, మర్డర్లు, మానభంగాలు, కుళ్ళు కుతంత్రాలు రావణకాష్టాల్లా మండుతున్నాయి. ఏనాడైతే మిగిలిన నాలుగు భూతాల్లాగే ఈ భూమి అనే పంచమభూతం కూడా ఫ్రీగా దొరుకుతుందో, ఎప్పుడైతే దానిమీద ఎవరికీ హక్కులేకుండా పోతుందో అప్పుడే మానవాళికి శాంతి, సుఖం. ఆ రోజు యిప్పుడొచ్చింది.
ఎస్.ఐ.గారు హంతకుణ్ణి అరెస్టు చేయండి.
(అనగానే ఎస్.ఐ. బాలును అరెస్టు చేసి తీసుకెళ్తుండగా-)

వర : మా ప్రభుత్వం వస్తుంది - మా ప్రభుత్వం వస్తుంది అంటే ఏమో అనుకున్నా - మీ ప్రభుత్వంలో తప్పుచేసిన ఎవర్నయినా వదిలి పెట్టరా.

ప్రకా : ఆ ప్రభుత్వానికి ఈ ప్రభుత్వానికీ అదే తేడా - ఆ ప్రభుత్వం తప్పుచేసిన వాళ్ళని మంత్రుల్ని, ముఖ్యమంత్రుల్ని చేస్తే ఈ ప్రభుత్వం తప్పుచేసిన వాళ్ళని అరెస్టు చేస్తోంది.

ఏడు : తప్పుచేసిన వాళ్ళని అరెస్టు చెయ్యడమే కాదు - ఇలాంటి తప్పుడు నాకొడుకుల నడ్డికూడా విరగ్గొడుతుంది - కొంచెనే లేదు - అరిచే కుక్క కరిచింది.

(అంటూ శ్రామిక వర్గ నియంతృత్వానికి ప్రతిబింబంగా అప్పలస్వామి మీదకు కర్రెత్తాడు)

(అయిపోయింది)




1993లో ముళ్లపూడి వెంకటరమణ గారి జన్మదిన సందర్భంగా ఆరుద్ర 'ముళ్లపూడికి మల్లెపూలు' అనే పేరుతో ఒక ప్రశంసా వ్యాసం రాసారు. తరువాతి వారం సంచికలో రమణ తనదైన శైలిలో ఇచ్చిన జవాబు ఇదిగో. ఆంధ్రజ్యోతి వీక్లీ సౌజన్యంతో పునర్ముద్రిస్తున్నాం.

# ధన్యవాదాలూ - అన్యవాదాలూ



సహస్ర శీర్షపురుషః
సహస్రాక్ష స్సహస్రపాత్
సభూమిం విశ్వతో వృత్వా!
అత్యతిష్ఠత్ దశాంగులం!!

తా. ఈ భూమీ గీమీ అన్నీ కలిపి కొలిస్తే ఎంత ఎత్తో విష్ణుమూర్తి అంతకన్న పదంగుళాల ఎత్తు.

ఆర్యా,

శ్రీ 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రిక వారికి నమః! మీ టేస్టు యమః! ఇవాళ మీ పత్రిక జెండా ఎవరెస్టు కన్న ఏడడుగుల ఎత్తుకెదిగిపోయింది. ముఖ్యంగా సంపుటి 27 సంచిక 17 అయినట్టి 1993 జూన్ 25వ తేదీ గల పత్రిక. అన్నట్టు అందులో ప్రసిద్ధ కవి, మహాజ్ఞానీ, నిష్పక్షపాత విమర్శకుడూ, రసహృదయుడూ అయిన డా. శ్రీ ఆరుద్రగారు నా గురించి వ్రాసిన ప్రత్యేక వ్యాసం అచ్చువేశారు. బొమ్మలతో... అదీ. శ్రీ ఆంధ్రజ్యోతి సంస్థ వారికి నా అభినందనలు, ధన్యవాదాలు...

అన్నట్టు - కేవలం నా గురించి వ్రాసినందువల్ల ఇలా అంటున్నానని మీరుగాని, ఉత్తమాభిరుచి గల మీ పాఠకులు గాని అపోహ పడరాదు. నాతో ఏకీభవిస్తూ ముక్కోటి దేవతలూ ఆరుకోట్ల ఆంధ్రులూ ముక్తకంఠంతో ఘోషిస్తూ అసంఖ్యాకంగా నాకు ఉత్తరాలు రాశారు. వాటిలో కొన్ని జతపరుస్తున్నాను.

ఇట్లు
రమణ






ఆర్యా,

శ్రీ ముళ్లపూడి వారిపై వ్యాసం అద్భుతం! వారం వారం ఇలాటివే వెయ్యండి. వారి గురించి... ఇంకా చాలా రాయచ్చును.

ఇట్లు

పి.దక్షిణామూర్తి

(ఇది రమణ కలం పేరని గిట్టని వాళ్ళంటే నమ్మకండి)

ఎడిటర్జీ!

శ్రీ మూర్తిగారు చెప్పినట్లు అలాటివే మళ్లీమళ్లీ రాయడం కష్టమైతే అవే పేజీల్ని మళ్లీ మళ్లీ వెయ్యండి.

ఇట్లు

సి.వి.విజయలక్ష్మి

(ఇది కూడా పెన్నేమేనేమో అంటే కాబోసేమో అనుకోకండి)






మహారాజశ్రీ ఆంధ్రజ్యోతి సంపాదకుల దివ్య సముఖమునకు,

ఉభయ కుశలోపరి,

మా వాడి మీద రాయించిన కబుర్లు చదివించుకు విన్నాము... మా వాడు - మీరన్నట్లు గొప్పవాడేస్మండీ!

ఇట్లు

మా వాడి నాయనమ్మ మరియు అమ్మమ్మ

డియర్ సర్స్,

రమణ గార్ని గురించి వ్రాసి ఈ పత్రిక తనను తానే సన్మానించుకున్నదని నా భావము.

ఇట్లు

ఆర్జీకే

(ఆర్జీకే గారు విమర్శకాగ్రేసరుడు. ఆయన చచ్చినా ఎవ్వరి గురించి ఓఖ మంచిమాట అనడు వినడు... ఆయనే ఇలా అన్నాడంటే.... ఛ్ ఎందరో మహానుభావులు).

ఇట్లు

నేనే



సర్,

రమణగారి రచనలను ఇండియాలోని అన్ని భాషలలోనే గాక ప్రపంచంలోని అన్ని భాషలలోకి అనువదించి కాపీలు ఉచితంగా గాని, చవగ్గాగాని సప్లయి చెయ్యాలి. ఈనగారు ఏ దేశపు ఏ భాషల్లోంచి ఏవేం కొట్టేశారో అనే నగ్నసత్యం తప్పక బైట పడగలదు.

నిత్యాసత్యాన్వేషి
గిరీశం






మహాప్రభో!

శ్రీ రమణగారి గురించి (శ్రీరమణ కాదుస్మండీ - నేను వేరే) నూటొక్క వ్యాసాలు వారం వారం మీ/మా అభిమాన పత్రిక - (ఇంకేది... ఆం. జ్యోలో పడితే నూటొక్క కొబ్బరికాయలు కొడతామని మొక్కుకున్నాము. మా నోము చెడకుండా జాగర్తపడగలరని హెచ్చెరుక.

ఇట్లు
కంట్రీవైడ్ యండ్ వరల్డ్‌వైడ్ రమణా ఫాన్ క్లబ్

ఆర్యా,

పాదాభివందనములు. గిరీశం గాడు గారి వుత్తరాన్ని ఖాతరు చేయవద్దు. వాడు సత్యద్వేషి. సత్యదేవతని నగ్నంగా చూపిస్తానంటున్నాడు. మీ/మా పత్రికలో అలాంటివి పడవు గదా. తప్పు.... పాపం! సెన్సార్ చేసిపారెయ్యండి.

ఇట్లు
మళ్లీ నేనే





ఆంధ్రజ్యోతి కొని ఆరుద్రగారి ఆర్టికల్ అర్జంటుగా చదవాలి. ఓ ఫైవప్పిస్తారా? వాట్ దాని ఖరీదు నాలుగు రూ..లేనా! ఓఖే అలాక్కానీయండి. మూడే వున్నాయా?! మరీ మంచిది. నాలుగో రూపాయి భర్తీ పేరిట ఇంకోడి దగ్గర మరో నాలుగు లాగించేస్తాను - తంతే బూర్లె బుట్టలో పడ్డట్టు.

ఇట్లు
అప్పారావు

ఆంధ్రజ్యోతి గారూ

మరేమో ఈ రవణగాడు నే చెప్పిన ముక్కలు రాసి పెట్టాడంతే. ఇందులో వాడిదేం లేదు. అయినా వాడి గురించి రాసి వాడి బొమ్మలే వేశారు. ఇదేం బాలేదు.... ఇలా ఇంకో నాలుగు వారాలు తప్పు చేస్తే గారిగా ప్రైవేటు చెప్పేస్తా...

ఇట్లు,
బుడుగు





ఏవండీ,

నిర్ఘుం. బుడుగు ప్రైవేటు చెప్తే లెక్కల మాస్టారుకన్నా గారిగా వుంటాయి. జాగర్త.

ఇట్లు
సీగాన పెసూనాంబ
(సిగ్గుపడుతూ)

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : ప్యాసా (1957) |
| సంగీతం | : సచిన్ దేవ్ బర్మన్ |
| రచన | : సాహిర్ లుధియాన్వి |
| గానం | : మహమ్మద్ రఫీ |
| అభినయం | : గురుదత్, ఇతర ముఖ్య తారాగణం |

# యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యాహై...

యే మహలోఁ యే తఖ్తోఁ యే తాజోం కీ దునియా
యే ఇన్సాఁకే దుష్మ
న్ సమాజోం కీ దునియా
యే దౌలత్ కే భూఖే రివాజోం కీ దునియా

యే దునియా అగర్ మిల్‌భీ జాయే తో క్యాహౌ
హర్ ఏక్ జిస్మ్ ఘాయల్, హర్ ఏక్ రూహ్ ప్యాసీ
నిగాహోఁ మేఁ ఉల్‌ఝున్, దిలోఁ మేఁ ఉదాసీ
యే దునియా హై యా ఆలమ్-ఎ-బద్‌హవాసీ

యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యాహై
యహాఁ ఏక్ ఖిలోనా హై ఇన్సాఁకీ హస్తీ
యే బస్తీ హై ముర్దాపరస్తోంకీ బస్తీ
యహాఁ పర్ తో జీవన్ సే హై మౌత్ సస్తీ

యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యాహై
జవానీ భటక్‌తీ హై బేజార్ బన్‌కర్
జవాఁ జిస్మ్ సజ్‌తే హైఁ బాజార్ బన్‌కర్
జహాఁ ప్యార్ హోతాహై వ్యాపార్ బన్‌కర్

యే దునియా అగర్ మిల్ భీ జాయేతో క్యా హై
యే దునియా జహాఁ ఆద్మీకుఛ్ నహీఁ హౌ
వఫా కుఛ్ నహీఁ దోస్తీ కుఛ్ నహీఁ హై
జహాఁ ప్యార్‌కీ కద్ర్ హీ కుఛ్ నహీఁ హై

యే దునియా అగర్ మిల్ భీ జాయేతో క్యా హై
జలాదో... జలాదో ఇసే ఫూంక్ డాలో యే దునియా
మేరే సామ్నేసే హటాలో యే దునియా
తుమ్హారీ హై తుమ్ హీ సంభాలో యే దునియా
యే దునియా అగర్ మిల్ భీ జాయేతో క్యా హై





గురుదత్ దర్శకత్వం వహించిన చిత్రాల గురించి ప్రస్తావించేటప్పుడు ఎవరైనా 'ప్యాసా' చిత్రానికే ప్రాధాన్యత ఇస్తారు. 1957లో వచ్చిన ఈ చిత్రం అప్పటివరకు వచ్చిన హిందీ చిత్రాలకు భిన్నమైన కొత్త తరహా చిత్రం. అంతెందుకు-గురుదత్ అంతకు ముందు తీసిన 'ఆర్‌పార్', 'మిస్టర్ అండ్ మిసెస్ '55' ' లాంటి సరదా చిత్రాలకు ఈ చిత్రానికి పోలికే ఉండదు. సమాజంలోని స్వార్థం, ద్వంద్వ ప్రమాణాలు, ధనదాహాలను ఎత్తి



చూపుతుంది ఈ చిత్రం.

విజయ్ అనే యువకుడు మంచి కవిత్వం వ్రాస్తున్నా పబ్లిషర్లు ఎవరూ ముద్రించటానికి ఒప్పుకోరు. అతని అన్నలు కూడా అతణ్ణి పనికిరానివాడిగా తిడుతూ అతని కవిత్వాన్ని చిత్తు కాగితాలలా అమ్ముతూ ఉంటారు. వారి వేదింపులు తట్టుకోలేని అతడు ఇంటికి దూరంగా కాలం గడుపుతూ ఉంటాడు. గులాబో అనే వేశ్య అతని కవిత్వమంటే ఇష్టపడి అతణ్ణి ప్రేమిస్తుంది.

అతడు చదువుకునే రోజుల్లో ప్రేమించిన మీనా డబ్బుంటేనే జీవితంలో భద్రత ఉంటుందనే భావంతో ఘోష్ అనే ఒక పబ్లిషర్‌ని పెళ్ళాడుతుంది. మీనా, విజయ్‌ల గురించి అనుమానం వచ్చిన ఘోష్ వారి గురించి మరింత తెలుసుకోవటానికి విజయ్‌ని పనివాడిగా పెట్టుకుంటాడు. తన కవిత్వాన్ని ఘోష్ అచ్చువేస్తాడని ఆశించిన విజయ్ రాజీనామా చేసి ఆత్మహత్య చేసుకోబోతాడు. రైలుకింద పడటానికి వెళుతూ ఓ బిచ్చగాడికి తన కోటు ఇస్తాడు. ఆ బిచ్చగాడు సిగ్నల్‌లోకాలు ఇరుక్కుని రైలు కింద పడి చనిపోతాడు. అతణ్ణి రక్షించబోయిన విజయ్ గాయపడి ఆసుపత్రిపాలౌతాడు. బిచ్చగాడి కోటులో ఉత్తరం చూసి రైలుకిందపడి చనిపోయినది విజయ్ అని అనుకుంటారు అందరూ. గులాబో విజయ్ కవితలను అచ్చువేయటానికి ఘోష్ దగ్గరకు తీసుకెళుతుంది. చనిపోయిన గొప్ప కవి కవితలుగా ప్రచారం చేసి డబ్బు సంపాదించవచ్చనే ఉద్దేశంతో ఘోష్ వాటిని ప్రచురిస్తాడు. అదే ఉద్దేశంతో ఆసుపత్రి నుంచి తిరిగి వచ్చిన విజయ్‌ని గుర్తించటానికి నిరాకరిస్తాడు ఘోష్. ఘోష్‌తో చేతులు కలిపిన విజయ్ స్నేహితుడు శ్యామ్ కూడా అతనికి వంత పాడతాడు. వీరిద్దరు కలిసి విజయ్ అన్నల చేత కూడా విజయ్‌ని విజయ్ కాదని చెప్పించి పిచ్చాసుపత్రిలో చేర్పిస్తారు. విజయ్ సంస్మరణార్థం ఒక సభ ఏర్పాటు చేస్తారు. ఒక మిత్రుడి సహాయంతో పిచ్చాసుపత్రి నుంచి తప్పించుకున్న విజయ్ ఆ సభకు వచ్చి లోకంతీరు పట్ల నిరసన వ్యక్తం చేస్తాడు. ఘోష్ మనుషులు అతణ్ణి గెంటివేస్తారు. తర్వాత ఘోష్‌తో తగాదాలొచ్చి విజయ్ అన్నలు, శ్యామ్ మరో పబ్లిషర్ దగ్గరకు వెళ్ళి విజయ్ బతికే ఉన్నాడని చెప్తారు. వారు విజయ్‌ని సత్కరించేందుకు ఏర్పాటు చేసిన సభలో విజయ్ తాను విజయ్‌ని కానని చెప్పి వచ్చేస్తాడు. గులాబోతో కలిసి దూరంగా వెళ్ళిపోయి కొత్త జీవితం ప్రారంభిస్తాడు.

'ప్యాసా' అంటే 'దాహంతో ఉన్నవాడు' అని అర్థం. చిత్ర కథానాయకుడు సమాజంలో ఒక స్థానం సంపాదించుకోవటానికి ప్రయత్నించినట్టే దర్శకుడు గురుదత్ కూడా మూస చిత్రాల మధ్య తనదైన ముద్ర వేసుకోవటానికి ప్రయత్నించారు. ఆయన ఈ చిత్రానికి విషాదాంతం ఇవ్వాలనుకున్నారు. కానీ అలా చేస్తే చిత్రం ఫ్లాప్ అవుతుందని మిత్రులు చెప్పటంతో సుఖాంతం చేశారు. అయితే సమాజం నుంచి వెలివేయబడ్డ ఒక వేశ్యతో కలిసి జీవితం పంచుకోవడం ద్వారా సమాజ ధిక్కారంతోనే చిత్రాన్ని ముగించారు. ఈ ముగింపును విమర్శించిన వారు కూడా ఉన్నారు. సమాజాన్ని కాదని ఎక్కడికి పోతాడనేది వారి వాదన. కానీ అది చిత్రం కాబట్టి దానికి ముగింపు అవసరం. చిత్రంలో లేవనెత్తిన ప్రశ్నలు ఇప్పటికీ ప్రశ్నలుగానే ఉన్నాయి. ఆ ఆవేదన నుంచి ఆయన ఎప్పటికీ బయటపడలేకపోయారనే చెప్పవచ్చు.

ఈ చిత్రాన్ని దిలీప్ కుమార్, నర్గిస్, మధుబాల కాంబినేషన్‌లో రూపొందించాలని గురుదత్ అనుకున్నారు. కానీ చివరికి విజయ్‌గా గురుదత్, గులాబోగా వహీదా రెహమాన్, మీనాగా మాలాసిన్హా, ఘోష్‌గా రెహమాన్ నటించారు. ఇక సాహిర్ లుధియాన్వి కవిత్వం ఈ చిత్రానికి వెన్నెముక వంటిది అంటే అతిశయోక్తి కాదు. గురుదత్‌లోని ఆవేదనకు అక్షరరూపమే ఆయన కవిత్వం.

విజయ్ చనిపోయాడని అతని సంస్మరణార్థం ఏర్పాటు చేసిన సభలో, విజయ్ పాడే పాట 'యే దునియా అగర్ మిల్ భీ జాయే తో క్యా హై', 'ఈ లోకం దొరికితే మాత్రం ఏమిటి' అని అర్థం. కుత్సితత్వం నిండిన ఈ లోకం తనకు వద్దని అతను ఏవగించుకుంటాడు. స్వతహాగా కొరియోగ్రాఫర్ అయిన గురుదత్ పాటల చిత్రీకరణలో తీసుకునే శ్రద్ధ, కనబరిచే సృజనాత్మకత ఈ పాటలో కూడా కనిపిస్తుంది. సభ జరిగే హాలు గుమ్మంలో విజయ్ నిలబడే తీరు శిలువ వేసిన ఏసు క్రీస్తును పోలి ఉంటుంది. ఆయన కూడా ప్రపంచంలో ఎదురుదెబ్బలు తిని తనవారి చేతిలో మోసపోయినవాడే కదా.

'మహల్' అంటే భవనం, మిద్దె. 'తఖ్త్' అంటే సింహాసనం, గద్దె,. 'తాజ్' అంటే కిరీటం. 'దునియా' అంటే లోకం. 'ఇన్సాన్' అంటే మనిషి. 'దుష్మన్' అంటే శత్రువు. 'భూఖే' అంటే ఆకలిగొన్నవారు. తెలుగులో ధనదాహం అన్నట్లే హిందీలో 'ధనమంటే ఆకలి' అని అంటారు. 'రివాజ్' అంటే రివాజు, అలవాటు.

మిద్దెలను, గద్దెలను, పదవులనెంచే ఈ లోకం
మనిషికి శత్రువులైన సమాజాల ఈ లోకం
ధనదాహానికి అలవాటుపడిన ఈ లోకం
ఈ లోకం లభిస్తే మాత్రం ఏం లాభం?

భవనాలు, పదవులు ఉంటేనే గౌరవాన్ని ఇస్తుంది ఈ లోకం. వాటికే విలువనిస్తుంది. సొసైటీ పేరుతో మానవత్వాన్ని నిర్లక్ష్యం చేసే వాళ్ళెందరో ఈ లోకంలో ధనార్జనే ధ్యేయంగా బ్రతుకుతుంటారు. ఇలాంటి లోకం నాకు వద్దు.

'జిస్మ్' అంటే దేహం. 'ఘాయల్' అంటే గాయపడినది. 'రూహ్' అంటే







ఆత్మ. 'నిగాహే' అంటే చూపులు. 'ఉల్‌ఝన్' అంటే కలవరం, చిక్కు. ఇక్కడ 'కలవరం' సరైన అర్థం.

'బద్‌హవాసీ' అంటే గందరగోళం, తికమక. 'ఆలమ్-ఎ-బద్‌హవాసీ' అంటే గందరగోళం నిండిన వాతావరణం.

ప్రతిదేహం గాయాలమయం, ప్రతి ఆత్మకు దాహం
చూపులతో కలవరం, మనసుల్లో విచారం
ఇది లోకమా లేక గందరగోళమా
ఈ లోకం దొరికితే మాత్రం ఏమిటి?

తాము పైకి రావాలని ఇతరులనెందరినో అణగదొక్కుతారు. ఈ పోటీని తెలియజేయడానికే 'ప్రతిదేహం గాయాలమయం' అనే ప్రయోగం చేశారేమో అనిపిస్తుంది. ఈ లోకంలోని మనుషులకి ఎంత సాధించినా ఆత్మతృప్తి ఉండదు. చూపుల్లో తెలియని కలవరం. ఎప్పుడేం జరుగుతుందో అని మనసుల్లో గుబులు, విచారం. ఇలాంటి మనుషులతో లోకమంతా గందరగోళంగా ఉంది. ఈ లోకం నాకు వద్దు.

'ఖిలోనా' అంటే ఆటబొమ్మ. 'హస్తీ' అంటే ఉనికి, అస్థిత్వం. 'ముర్దా' అంటే మృతులు. 'ముర్దాపరస్త్' అంటే మృతులను పూజించేవారు. 'మౌత్' అంటే మృత్యువు. 'సస్తీ' అంటే చౌక.

ఇక్కడ మనిషి ఉనికి ఒక ఆటబొమ్మ
ఇక్కడ మృతులకే దక్కెను జోహార్లు
ఇక్కడ జీవితంకన్నా మృత్యువే చౌక
ఈ లోకం దొరికితే మాత్రం ఏమిటి?

తమ ప్రయోజనాల కోసం తోటి మనిషి ఉనికితో ఆటలాడుకుంటారు. తమకు లాభం ఉంటేనే తోటిమనిషిని గుర్తిస్తారు. అవసరం తీరిపోతే అతన్ని పట్టించుకోరు. బతికి ఉన్నప్పుడు పట్టించుకోకపోయినా చనిపోయాక అతని పేరు చెప్పుకుని ఇతరుల సానుభూతి సంపాదించి లాభపడాలని చూస్తారు. చనిపోయిన తర్వాత పేరు వచ్చినంత తేలికగా బతికి ఉన్నప్పుడు రాదు. చనిపోయిన తర్వాత గుర్తుచేసుకుంటారు గానీ బతికి ఉన్నప్పుడు పట్టించుకోరు. ఇలాంటి లోకం నాకు వద్దు.

'జవానీ' అంటే యవ్వనం, కుర్రతనం. 'భటక్‌నా' అంటే దారి తప్పి తిరగడం. 'బేజార్' అంటే నీరసించడం. 'సజ్‌నా' అంటే అలంకరించుకోవడం. 'బాజార్' అంటే బజారు.

కుర్రతనం దారితప్పి నీరసించి ఉంది
తనువునలంకరించుకుని ప్రదర్శిస్తుంది
ఇక్కడ ప్రేమ వ్యాపారమయింది
ఈ లోకం దొరికితే మాత్రం ఏమిటి

ఉత్సాహంతో ఉరకలు వేయాల్సిన కుర్రవాళ్ళు లక్ష్యం ఏమీ లేక నీరసంగా కాలం గడుపుతున్నారు. ఏమి చేయాలన్నా సమాజంలోని అవినీతి అడ్డువస్తుంది. ఆ అవినీతికి అలవాటు పడుతున్నారు. యువతీయువకులు అలంకరణలు చేసుకుని పైపై అందాలను ప్రదర్శిస్తుంటారు. ప్రేమించడం కూడా లాభాపేక్షతోనే చేస్తున్నారు. ఇలాంటి లోకం నాకు వద్దు.

'ఆద్మీ' అంటే మనిషి, 'కుఛ్ నహీం హై' అంటే 'ఏమీ కాదు' అని. 'వఫా' అంటే విశ్వాసం. 'దోస్తీ' అంటే స్నేహం. 'కద్ర్' అంటే గౌరవం.

ఈ లోకంలో మనిషికి విలువ లేదు
విశ్వాసం, స్నేహమనేవి లేవు
ఇక్కడ ప్రేమకి గౌరవమే లేదు
ఈ లోకం దొరికితే మాత్రం ఏమిటి

మనిషిని మనిషిగా చూడరు. అతను ఏం సాధించాడనేదే ముఖ్యం. స్నేహితులే నమ్మించి మోసం చేస్తారు. ప్రేమకు గౌరవమే లేదు. ఇలాంటి లోకం నాకు వద్దు.



'జలాదో' అంటే 'తగలబెట్టేయండి' అని. 'ఫూంక్ డాలో' అంటే ఊది పారేయండి అని. 'హటాలో' అంటే 'తొలగించేయండి' అని. 'సంభాలో' అంటే 'జాగ్రత్త చేసుకోండి' అని.

తగలబెట్టేయండి ఈ లోకాన్ని
నా ముందు నుంచి తొలగించేయండి ఈ లోకాన్ని
మీదే ఇది, మీరే నడుపుకోండి ఈ లోకాన్ని
ఈ లోకం దొరికితే మాత్రం ఏమిటి

ప్రపంచం పట్ల అతని ద్వేషం ఎలాంటిదంటే లోకాన్ని తగలబెట్టేయమంటున్నాడు. తన కళ్ళముందు నుంచి లోకాన్ని తొలగించేయమంటున్నాడు. 'మీరు ఈ లోకాన్ని ఎలా నడుపుకుంటారో మీ ఇష్టం. నాకీ లోకం వద్దు'. అని అంటున్నాడు.

ఈ చిత్రాన్ని తెలుగులో 'మల్లెపూవు' పేరుతో రీమేక్ చేశారు. ఇందులో శోభన్‌బాబు, లక్ష్మి, జయసుధ, శ్రీధర్ నటించారు. అయితే ఇందులో విజయ్‌ని సంస్మరణ సభ నుంచి గెంటి వేశాక అతన్ని విజయ్ అని గుర్తించి సన్మానసభ ఏర్పాటు చేయడం, అతను తాను విజయ్‌ని కానని చెప్పడం లేవు. తనను తాను కాదని చెప్పుకునేంత ద్వేషం చూపించడం గురుదత్‌కే చెల్లింది. 'మల్లెపూవు' చిత్రంలో చక్రవర్తి అందించిన సంగీతం కూడా ఎంతో ప్రజాదరణ పొందింది.

\- పి.వి.సత్యనారాయణ రాజు

# సంగీతం, సాహిత్యం సమపాళ్లలో పండిన కళాఖండం - 'ప్యాసా'

గురుదత్ అంతకుముందు ఎన్ని చిత్రాలు తీసినా 'ప్యాసా'(1957) తో ఒక్కసారిగా ఎన్నో మెట్లు ఎక్కేశాడు. అనేకమంది మేధావులు గురుదత్ సారథ్యంలో కలిసి నిర్మించిన ఉత్కృష్టమైన కళాసృష్టిగా 'ప్యాసా' నిలిచిపోయింది. ఆ చిత్రానికి సంబంధించిన ప్రతీ అంశం గురించి ఎన్నో వ్యాసాలు వెలువడ్డాయి. సాహిర్ సాహిత్యం, బర్మన్ సంగీతం, వి.కె.మూర్తి ఫోటోగ్రఫీ, గురుదత్ పిక్చరైజేషన్ అన్నీ కలిసి 'ప్యాసా'ను ఎవరూ అందుకోలేని స్థాయిలో నిలబెట్టాయి.

కథకు సంబంధించి చెప్పాలంటే గురుదత్ 1947-48లలో 'కశ్మకష్' అనే పేరుతో రాసుకున్న కథను అతని మిత్రుడు, రచయిత అబ్రార్ అల్వీ 'ప్యాసా'గా డెవలప్ చేశాడు. ఒరిజినల్ కథలో హీరో ఓ పెయింటర్. దాన్ని కవిగా మార్చారు.

అలా కవిగా మార్చడంతోనే సాహిర్ లుధియాన్వీ తన విశ్వరూపాన్ని ప్రదర్శించే అవకాశం వచ్చింది. 1921లో లుధియానాలో ఓ జమీందారీ కుటుంబంలో జన్మించిన సాహిర్ అసలుపేరు అబ్దుల్ హై. ఉర్దూ, పర్షియన్ భాషలు అభ్యసించిన సాహిర్ తన బి.ఏ. చదువును పక్కనబెట్టి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. వామపక్షాలకు చెందిన ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్‌లో కార్యకర్త. మోహన్ సెహగల్ ద్వారా సచిన్‌దేవ్ బర్మన్‌ను కలవడంతో సాహిర్‌కు సినీరంగంలో మంచి పట్టు దొరికింది. ఇద్దరూ కలిసి గురుదత్ 'జాల్'(1952), 'ప్యాసా'లకు పనిచేశారు. 'ప్యాసా'లో ఉపయోగించిన కవితలు సాహిర్ అంతకుముందే రాసుకున్న కవితాసంకలనాల లోనివి. 'యే కూచే యే నీలామ్ ఘర్' గీతం 'చక్లే' (వేశ్యలు) అనే మకుటంతో రాసిన 'సనా ఖ్వానే తక్‌దిస్-ఎ-మష్రిఖ్ కహా హై?' అనే కవితే! 1962లో 'ఫిలింఫేర్' కై రాసిన ఒక వ్యాసంలో సాహిర్ ఇలా అన్నారు - 'నా కవితాశక్తికి పూర్తి అవకాశం ఇచ్చినది గురుదత్తే! 'ప్యాసా' హిట్ కావడంతో సినిమాలలో కవిత్వపరమైన పాటలు



పెట్టినా ఫర్వాలేదన్న ధైర్యం నిర్మాతలకు కలిగింది."

'ప్యాసా' విజయంలో సచిన్ దేవ్ బర్మన్ పాత్ర విస్మరింపరానిది. సబ్జక్ట్ బట్టి దానికి బర్మనే న్యాయం చేయగలడని గురుదత్ అనుకున్నాడు. వారిద్దరూ కలిసి 'బాజీ'(1951) 'జాల్' (1952) లకు కలిసిపనిచేశారు. తర్వాత తీసిన 'బాజ్'(1953), 'ఆర్ పార్' (1954) 'మిస్టర్ అండ్ మిసెస్ 55' (1955), 'సి.ఐ.డి.(1956) లకు గురుదత్ ఓ.పి.నయ్యర్‌ను సంగీతదర్శకుడిగా పెట్టుకున్నాడు. కానీ 'ప్యాసా' వచ్చేసరికి బర్మన్‌నే ఎంచుకున్నాడు. త్రిపురలోని కొమిల్లాలో రాచకుటుంబంలో జన్మించిన సచిన్ దేవ్ బర్మన్ కలకత్తాలోని న్యూ థియేటర్స్‌లో గాయకుడిగా కెరియర్ ఆరంభించారు. ఎస్.ముఖర్జీ ఫిల్మిస్తాన్ పతాకంలో "షికారీ"(1946) తీస్తూ బర్మన్‌ను సంగీతదర్శకుడిగా చేశాడు. దేవ్ ఆనంద్ తన నవ్‌కేతన్ సంస్థ బ్యానర్ క్రింద "బాజీ' తీస్తూ బర్మన్‌ను మ్యూజిక్ డైరక్టర్‌గా, గురుదత్‌ని దర్శకుడిగా పెట్టుకున్నాడు.

'జాల్'లో 'యే రాత్ యే చాంద్‌నీ' పాటను బర్మన్ హేమంత్‌కుమార్ చే పాడించారు. గురుదత్ రఫీ చేత మళ్లీ పాడిద్దామంటే 'టట్, కుదరదు' అన్నారు బర్మన్. గురుదత్ శిరసావహించాడు. 'ప్యాసా'లో జానీవాకర్ పాట 'సర్ జో తేరా చకరాయే' పాటకు లాటిన్ అమెరికన్ ట్యూన్ కట్టినది రాహుల్ దేవ్ బర్మన్. ఆ ట్యూన్‌కి ముగ్ధుడయిన గురుదత్ రాహుల్‌కి ఓ ప్రామిస్ చేశాడు -'నేను నా అసిస్టెంట్ నిరంజన్ దర్శకత్వంలో తీయబోయే 'రాజ్' సినిమాకు సంగీతం ఇచ్చే ఛాన్సు నీకే ఇస్తున్నాను' అని. కానీ ఆ సినిమా తయారు కాలేదు. దానికై తయారు చేసుకున్న ట్యూన్‌లను రాహుల్ తన తొలి చిత్రం 'ఛోటే నవాబ్'(1961) కు ఉపయోగించుకున్నాడు.

'ప్యాసా' కథానేపథ్యం కూడా కలకత్తా కాబట్టి బర్మన్ ఇచ్చిన బెంగాలీ ఫ్లేవర్ 'ప్యాసా'కు క్లాసిక్ టచ్ ఇచ్చింది. ముఖ్యంగా సిగ్నేచర్ ట్యూన్ మనను వెంటాడుతుంది. అతి తక్కువ వాయిద్యాలతో సంగీతం సమకూర్చి రఫీ కంఠంలోని అందాలను పూర్తిగా ఆస్వాదించే భాగ్యం మనకు కలిగించిన బర్మన్ స్మరణీయుడు. ఈ సినిమా తర్వాత 'కాగజ్ కే ఫూల్' (1959)కు సాహిర్-బర్మన్ టీము విడిపోయింది. కైఫీ ఆజ్మీ గీతరచన చేశారు. బర్మన్ సంగీతం బాగున్నా 'ప్యాసా'లా అన్ని పాటలు హిట్ కాలేదు. ఆ తర్వాత బర్మన్, గురుదత్ కలిసి పనిచేయలేదు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్




# రాంపండు - బుద్ధిమంతుడూ

పల్లిగూడెంలో రాంపండుని చూసి అనంత్ ఉలిక్కిపడ్డాడు. "ఒరేయ్, ఇక్కడికి ఎప్పుడొచ్చావ్‌రా? నీ జీవితంలోంచి నువ్వు ఎప్పటికీ ఫేడవుట్ కావా?" అని సూటిగా అడిగేశాడు కూడా. "గత మూడు నెలలుగా నీ కబురూ, కాకరకాయా తెలియకుండా హాయిగా ఉన్నాను. ఎక్కడో ప్రైవేట్లు చెప్పుకుంటూ బుద్ధిగా ఉన్నావనుకుంటే ఇక్కడే తేలేవేమిటి?" అన్నాడు.

రాంపండుకి కోపం వచ్చింది. "బుద్ధిగా ప్రైవేట్లు చెప్పుకుంటున్నాను కాబట్టే ఇక్కడ తేలేను. నువ్వు ఇక్కడ కెందుకు వచ్చావ్ అది చెప్పు" అని దబాయించాడు.

"ఇక్కడి కెందుకు వచ్చావంటే ఇది మా అత్తయ్యగారి ఊరు కాబట్టి వచ్చాను. మా చిన్నత్తయ్య - ఉష - అదే మేమంతా ఉషారత్తయ్య అంటాం ఆవిడే, తను ఫోన్ చేసింది వెంటనే రమ్మనమని. అచలపతి వాళ్ల కజిన్ పెళ్లికని వెళ్లాడు. ఒంటరిగా అక్కడ ఉండడం మెందుకని అత్తయ్య రమ్మనమంది కదాని ఇందాకనే రెక్కలు కట్టుకుని వాలేను. తీరా చూస్తే అచలపతిని వెంట బెట్టుకు రాలేదేమిట్రా అని మొహం ముడుచుకుంది. లోకం తీరు చూడు. అత్తయ్యలను అస్సలు నమ్మకూడదు."

"ఓహో రంగనాథం గారి మిసెస్ ఉష అంటే మీ ఉషారత్తయ్యేనా? మేం ఇప్పుడు వాళ్ల ఇంట్లోనే గెస్టులుగా ఉంటున్నాం."

"గెస్టులుగానా? అంటే మా అత్తయ్య ఫ్రెండు పేరిందేవి గారు నీకు తెలుసా?"

"వాళ్ల అబ్బాయికేగా నేనిప్పుడు ట్యూషన్ చెబుతున్నది. ఇక్కడికి ఏభై మైళ్ల దూరంలో వాళ్ల ఊరు. స్కూళ్లకు సెలవులే కదా. పిల్లాణ్ని తీసుకుని రా అని ఉష గారు అంటే పేరిందేవి గారు, భర్తా, పిల్లాడితో బాటూ నన్నూ రమ్మన్నారు, తోడు పెళ్లికొడుకులా..." అని రాంపండు ఏదో చెప్పబోతుండగానే అనంత్ ఉలిక్కిపడ్డాడు.

"ఆగాగు. పేరిందేవి గారి కొడుకు... అంటే బంటీ గాడు. ఇంతప్పణ్నించి నాకు తెలుసు. పిల్లాడి వేషంలో ఉన్న బ్రహ్మరాక్షసుడు. బాబోయ్, వాడికి ట్యూషన్ మేష్టరువా నువ్వు. ఎలా బతుకుతున్నావ్‌రా? వాడిపాటికీ నిన్ను నమిలి తినేసి వుండాలే!"

జవాబుగా రాంపండు విషాదంగా నవ్వేడు. "హుఁ, పెద్దలు సంపాదించి పెట్టినది హాయిగా తిని కూచునే వాడివి నీకేం ఎన్నైనా చెబుతావ్, నాకు మాత్రం పొట్ట గడవద్దూ..." అన్న అర్థం ఆ



నవ్వులో గోచరించి అనంత్ టాపిక్ మార్చబోయాడు.

"బజారుకెళ్లాలిరా. పోయి వచ్చేటప్పటికి లేటవుతుంది. రాత్రి డిన్నర్‌టైములో కలుద్దాంలే. నువ్వెక్కడంటున్నావ్? గెస్టు హౌస్‌లోనా? నేను మూడో అంతస్తులో రైట్ సైడ్ రూమ్‌లో ఉంటున్నాను. వీలు చూసుకుని రా. ఇవాళ వద్దులే. ఇవాళేగా వచ్చాను. అత్తయ్య ఏదో ముఖ్యమైన విషయం చెబుతానంది" అని వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయాడు.

***

ఉషారత్తయ్య ముఖ్యమైన విషయం చెప్పబోయే ముందు అనంతానికి నాలుగు అక్షింతలు మళ్లీ వేసింది, అచలపతిని తీసుకురానందుకు. ఆ తర్వాత పిచ్చాపాటీ మాట్లాడుతున్నట్టు మాట్లాడి అసలు సంగతి దగ్గరకు వద్దామనుకుంది. ఈ లోపునే అనంత్ తొందరపడి ఓ ప్రశ్న అడిగేశాడు.

"ఇవన్నీ సరే గానీ వల్లభరావు గారు ఎప్పణ్నించి తిష్ఠ వేశాడిక్కడ?" అని అనంత్ అడగ్గానే ఉషారత్తయ్య "ఆయనతోనే కదరా చిక్కు మొదలయ్యింది" అంటూ నెత్తి కొట్టుకుంది.

"అయ్యో, ఆయనేం చేశాడు? పాపం ఓ మూల ప్రశాంతంగా కూచుని తన పనేదో తాను చూసుకునే ముసలాయన"

"... అదిగో ఆ ప్రశాంతంగా కూచోవాలనుకోవడమే ముప్పు తెచ్చి పెట్టింది" అంటూ అత్తయ్య చెప్పుకొచ్చింది.

వల్లభరావుగారు ఫ్యామిలీ ఫ్రెండు. ఎనభై యేళ్లు పైబడ్డాయి. పురాణాల మీద ఏవో పుస్తకాలు రాస్తూంటాడు. ఉషారత్తయ్య ఇంట్లో ఉంటూ ఆధ్యాత్మిక రామాయణం గురించి ఓ పుస్తకం రాద్దామన్న సదుద్దేశ్యంతో వచ్చాడు. అంటే అక్కడ ఆధ్యాత్మిక వాతావరణం వెల్లివిరుస్తోందని కాదు. ఉషారత్తయ్య ఇంట్లో మెయిన్ అట్రాక్షన్ - వాళ్ల వంటవాడు భీమారావు చేతి నలభీమపాకం, ఏ వయస్సు వారికైనా నోరూరించ గలిగే వంటకాలు చేయగల అతని నేర్పు. అదే ఎట్రాక్షన్ పేరిందేవిని

కూడా పల్లిగూడెం లాక్కొచ్చింది. ఆవిడతోబాటు బంటీ కూడా వచ్చిపడ్డాడు. పన్నెండేళ్ల బంటీ అల్లరి గురించి దశాబ్దాలుగా కథలు విన్న వల్లభరావు ఉలిక్కిపడ్డాడు. ఇప్పటికే ఇంట్లో ఉషారత్తయ్య కొడుకు చంటి, అదే వయసువాడు, ఉన్నాడు. ఇక ఇద్దరూ తోడయ్యే నరికి అహిరావణ, మహిరావణుల్లా అల్లరి చేసి తన బతుకు దుర్భరం చేసేస్తారని భయం వేసిందాయనకు. రాయబోయే పుస్తకం మాట రాముడెరుగు, భీమారావు వంట తిని హాయిగా మధ్యాహ్నం ఓ కునుకు తీసే భాగ్యం కూడా కరువవుతుందనిపించింది.

అందువల్ల తన తెలివితేటలుపయోగించి, ఓ ఐడియా వేశాడు. ఓ రోజు కుర్రాళ్లిద్దర్నీ పిలిచాడు. "మీలో ఎవరు బుద్ధిమంతులో తేల్చుకోవడానికి ఓ పోటీ పెడుతున్నాను. మంచి పనులు చేస్తే మార్కులు వేస్తాను. తుంటరి పనులు చేస్తే మైనస్ మార్కులు! తెలిసిందా? అలా నేను వెళ్లే టైముకి ఎవరికి ఎక్కువ మార్కులు వస్తే వాళ్లకు వెయ్యి రూపాయిలు ఇస్తాను. సరేనా?" అని ఆశపెట్టాడు. ఇక అక్కణ్నుంచి కుర్రాళ్లిద్దరూ తెగబుద్ధిగా ఉండడం మొదలు పెట్టారు.

కథ వింటున్న అనంత్ తన సంతోషం బాహాటంగా ప్రకటించాడు. "అమ్మయ్య! ఇంగ్లీషు వాళ్ల హయాంలో పని చేసిన వల్లభరావుగారి తెలివి తేటలు అమోఘం. అనకూడదు గానీ అత్తయ్యా, భీమారావు వంటకాల మీద ఆశతో నువ్వు పిలవగానే వచ్చేశాను కానీ, మన చంటిగాడి అల్లరి తలచుకుంటే మాత్రం భయం వేసింది."

"మా చంటిగాడు గౌతమబుద్ధుడని నేను చెప్పటం లేదు. ఉయ్యాల రోజులనుండీ వాడు నా ప్రాణం తీయని రోజు లేదు. కానీ బంటీ గాడి సంగతి కూడా నీకు తెలుసు కదా, అల్లరిలో వాణ్ని మించిన వాడు మనవాళ్లలో ఎవడూ లేడు కదా.."

"..ముమ్మాటికీ లేడు. వాడితో పోలిస్తే చంటిగాడు పరమసాధువు, గంగిగోవు."

"..ఔనా, మరి చంటిగాడి మీద పందెం కాయడంలో తప్పేమిటి చెప్పు.."

అనంతం ఉలిక్కిపడ్డాడు. "..పందెమా? ఏ విషయంలో? ఎవరితో? ఎంత?"

ఉషారత్తయ్య కొంత మొహం వేలాడేసుకునే చెప్పింది. "అసలేం జరిగిందంటే..వల్లభరావు ఇలా పోటీపెట్టిన విషయం వినగానే పేరిందేవికి హుషారు పుట్టింది. 'ఈ పోటీలో ఎవరు నెగ్గుతారో పందెం వేద్దామా?' అంది. 'ఈ పాటిదానికి పందెం ఎందుకు, మీ బంటీ గాడికి అల్లరిలో సాటి వచ్చేదెవరు? మా చంటిగాడికే ఆ వెయ్యి



రూపాయలూను' అనేశాను. 'మా అబ్బాయి మీద నీకంత నమ్మకం ఉంటే మీ వాడి మీద నాకు డబుల్ నమ్మకం ఉంది. మా వాడే ప్రైజ్ కొట్టేస్తాడు చూడు. లేకపోతే మా పనిమనిషి సావాలమ్మను నీ దగ్గర వదిలేసి వెళతాను' అంది. దాంతో నేనూ ఊరుకోకుండా పందానికి సై అన్నాను."

అనంత్ అడ్డువచ్చాడు. "పనిమనిషికి అంత గిరాకీనా? ఏదో రాజ్యం ఒడ్డినట్టు పనిమనిషిని పణంగా పెడతారా?"

"పనిమనిషి విలువ నీకేం తెలును, కుర్రకాకివి. ఏ ఇంటావిడనైనా అడుగు, మొగుడు పారిపోయినా ఫర్వాలేదు గానీ మంచి పనిమనిషి పారిపోతే మాత్రం మళ్లీ దొరకదని చెబుతుంది. నేను పందానికి సరేననగానే 'అయితే నువ్వు ఓడిపోతే మీ భీమారావును ఇచ్చేయాలి' అంది. ఆ ఊపులో సరేననేశాను."

"ఎంత పని చేశావ్ అత్తయ్యా.. భీమారావు వెళ్లిపోయాక ఈ మేడలెందుకు, మిద్దెలెందుకు? నేనైతే అసలు పల్లిగూడెమే రావడం మానేస్తాను."

'ఒరే నువ్వు వచ్చినా రాకపోయినా నాకేం ఫర్వాలేదు గానీ ఖర్మకాలి నేను భీమారావుని ఓడిపోతే ఊర్నించి వచ్చాక మీ మావయ్య నా పని బడతారు. ఇంట్లోంచి పొమ్మంటారు. అప్పుడు వచ్చి నీ దగ్గరే ఉండాలో ఏమో.. ఇటు చూస్తే బంటీగాడు అల్లరి మానేసి చెడ మంచిపనులు చేసేస్తున్నాడు. ఈ వారమో, పై వారమో వాడి రెండు భుజాల నుండీ దేవదూతల్లకు మల్లె రెక్కలు మొలుస్తాయేమోనని డౌటుగా ఉంది.'"

"..నువ్వు అంత దూరం ఆలోచించ నక్కరలేదత్తయ్యా..నాకు బంటీగాడి సంగతి బాగా తెలుసు. వాడి విశ్వరూపం ఒక్కసారి చూపిస్తే



భాలు వల్లభరావు దడిసిపోతాడు. మన చంటిగాడిని కాస్త శృతిమించనీయకుండా చూసుకుంటే చాలు."

"ఏ మాట కా మాట చెప్పుకోవాలి. ఓ రెండు నెలలుగా వాడు పాపం అదోలా ఉంటున్నాడు. అల్లరీ అదీ మానేశాడు. ఒంట్లో బాగోలేదేమోనని డాటొచ్చి టెస్టులు చేయించాను. కోతిపనులు చేయాలన్న ఇంట్రస్టే పోయినట్టుంది. కానీ జనాలు వాణ్ని చెడగొడదామని చూస్తుంటే ఎంతకాలం అలా వుంటాడో తెలియదు."

"చెడగొడదామని ఎవరు చూస్తారత్తయ్యా?" అనంత్ ఆశ్చర్యపోయాడు.

ఉషారత్తయ్య నుదురు కొట్టుకుంది. "అదే కదరా సమస్య! ఇక్కడ పెద్ద కుట్ర జరుగుతోంది. పేరిందేవి, మొగుడు కలిసి చంటిగాణ్ని రెచ్చగొడుతున్నారు. ఎలాగైనా వాడికి మైనస్ మార్కులు వేయించాలని వాళ్ల తాపత్రయం. వాళ్ల కుయుక్తులు ఎదుర్కోవాలంటే అచలపతి ఉండి తీరాలి. నువ్వేమో అతను లేకుండా దిగడ్డావ్..."

"ఆవేశపడకు. సంగతి సరిగ్గా చెప్పు." అత్తయ్య కోపం తన మీద మళ్లకుండా అనంత్ జాగ్రత్తపడుతూ టాపిక్ మార్చబోయాడు.

"అవునురా. వాళ్లకి సహాయంగా బంటూ గాడి కొత్త ట్యూషన్ టీచరు ఉన్నాడు. దుర్మార్గుడు. నా ఇంట్లో పడి తింటూ, మా అబ్బాయికి వెధవ బుద్ధులు నేర్పుతున్నాడు. వల్లభరావు గది గవాక్షం ఎక్కి అక్కణ్నుంచి 'బౌయ్' అనమని చంటికి నేర్పి పెడుతున్నాడు."

"రాంపండు గాడు అంతకు తెగించాడా? ఇంతకీ మనవాడు ఏమన్నాడు? బౌయ్ అన్నాడా? మరోటి అన్నాడా?"

ఉషారత్తయ్యలో తల్లి గర్వం మేల్కొంది. "ఛ, ఛ. వాడు బౌయ్ అనలేదు, కుయ్ అనలేదు. అతన్ని అదోలా చూసి వదిలేశాడు. కానీ నేను మాత్రం వదిలిపెడతానా? దెబ్బకు దెబ్బ! బంటూ గాడి చేత ఎలాగైనా అల్లరి చేయించి భీమారావు ఈ గడప దాటకుండా చూస్తాను." మంగమ్మ శపథం చేసింది ఉషారత్తయ్య.

"అత్తయ్యా, ఈ పోరాటంలో నీకు తోడుగా నీ మేనల్లుడు అనంత్ ఉన్నాడు. గెలుపు మనదే! అచలపతి లేకపోయినా ఫర్వాలేదు. ముందుగా నేను పోటీ రూల్సు తెలుసుకోవాలి. ఇప్పుడు పోటీదారులు వల్లభరావుని బాధపెడితేనే మైనస్ మార్కులా? నా బోటి వాణ్ని ఏడిపిస్తే.. ?"

అత్తయ్య కళ్లు మెరిసాయి. "ఒరేయ్, నీకేదో ఐడియా వస్తున్నట్టుందిరోయ్, ఆ రూల్సేమిటో ఆయన్నే అడిగి కనుక్కో. దాన్ని బట్టి స్ట్రేటజీ వర్కవుట్ చేద్దాం." అంది.

***

ఇంకాస్సేపటికి అనంత్ వల్లభరావు గదిలో ఉన్నాడు. కుశలప్రశ్నలయ్యాక, అనంత్ వల్లభరావును రూల్సు గురించి అడిగాడు. "నీ దాకా వచ్చిందీ..?" అంటూ వల్లభరావు చెప్పుకొచ్చాడు - "రోజూ పొద్దున్నే ఇద్దరికీ ఇరవయ్యేసి మార్కులు ఇస్తానన్నమాట. పొద్దున్నే నా బెడ్‌రూమ్ దగ్గర గట్టిగా అరిచారనుకో, మూడు మార్కులు కట్. విజిల్ వేసుకుంటూ తిరిగితే రెండు. రోజూ రాత్రి పడుక్కునే టైముకు లెక్కేసి చూస్తానన్నమాట. ఈ సిస్టమ్ వల్ల డబ్బు పోతే పోయింది కానీ ప్రాణానికి హాయిగా ఉంది. కుర్రాళ్లిద్దరికీ ఒక్క మైనస్ మార్కు కూడా పడలేదు."

"మీరెంత సేపూ మీ గురించే ఆలోచిస్తున్నారు. సపోజింగ్ నా బోటివాడి మీద ఈ కుర్రాళ్లలో ఎవరైనా ఓ కప్ప పట్టుకొచ్చి పడేశారనుకోండి, లేదా నా పరుపు మీద నీళ్లు పోసి తడిపేశారనుకోండి. అప్పుడేం చేస్తారు?"

వల్లభరావుకి తలలో బల్బు వెలిగినట్టయింది. "ఇది నేను ఊహించలేదు. నిజమే, అలాటి పరిస్థితుల్లో తప్పకుండా శిక్షించాల్సిందే! అప్పుడు పదిమార్కులు తీసేస్తాను."

"కప్ప - బతికున్న కప్ప మనిషి మీద పడేస్తే కేవలం పదిమార్కులేనా?"

"పోనీ పదిహేను. పదిహేను మార్కులు కట్."

"ఇరవై అయితే చక్కగా రౌండ్ ఫిగరనుకుంటాను."

"నిజమే. ప్రాక్టికల్ జోక్స్ అంటే నాకు మహా అసహ్యం. ఇరవై మార్కులు తీసేయాల్సిందే! మీకు గానీ, వేరెవరికి గానీ అటువంటి అనుభవం ఎదురయితే తప్పకుండా నా దృష్టికి తీసుకొస్తావు కదూ!"

"పరిగెట్టుకుంటూ వచ్చి చెబుతా" అన్నాడు అనంత్ హుషారుగా.

***

అక్కణ్నుంచి అనంత్ సరాసరి వెళ్లింది బంటూ దగ్గరికే. అదృష్టవశాత్తూ రాంపండు దగ్గర్లో లేడు. "ఏరా బంటూ, రోజు రోజుకీ మరీ ఊరిపోతున్నావ్, ఊరపందిలా. కాస్త తిండి తగ్గించరా బాబూ" అన్నాడు రెచ్చగొట్టే సెషన్ ప్రారంభిస్తూ. ఈ పాటి దానికి బంటూగాడు బండబూతులు వినిపించేవాడు. రోజు బాగుండకపోతే ఓ కంకర్రాయి విసిరేవాడు. కానీ అది గతం. ఇప్పుడు మాత్రం ఒక స్వాములార్లా చిన్న చిరునవ్వు చిందించాడు.

"ఈ మధ్య బాగా ఒళ్లు చేశాను అంకుల్. ఎక్సర్‌సైజు చేస్తే మంచిదనుకుంటాను. కూచో అంకుల్. బాగా అలిసిపోయి వచ్చినట్టున్నారు. మంచినీళ్లు తెమ్మంటారా?"

దెబ్బకి అనంత్ మంచినీళ్లు అడక్కుండానే మూర్ఛపోయాడు. లేచి తనకు తెలిసిన ట్రిక్కులన్నీ ఉపయోగించి ఆ కుర్రాణ్ని కవ్వించాడు. కానీ బంటూ తన స్వాములారి అవతారం చాలించలేదు. ఇక లాభం లేదనుకుని అనంత్ చంటి దగ్గరకి వెళ్లాడు. వాడు అనంత్‌ను చూసి మర్యాదలేమీ చేయలేదు కానీ తన మామూలు కోతివేషాలు కూడా వేయలేదు. ఓ పత్రిక ముఖచిత్రం మీద వేసిన గజాలా బొమ్మను చూస్తూ కూచున్నాడు. గజాలా మాతృభాష ఏమిటనీ, అది నేర్చుకోవడానికి ఎంతకాలం పడుతుందనీ మాత్రం అడిగి ఊరుకున్నాడు. రాంపండు ఎంత రెచ్చగొట్టినా ఇలాటి కాండిడేట్ మైనస్ మార్కులు తెచ్చుకునే ప్రమాదం ఎంతమాత్రం లేదన్న తృప్తితో అనంత్ లేచి వచ్చేశాడు. అదే ముక్క రాంపండుకి చెప్పాడు. అతను చాలా బాధపడ్డాడు. "ఈ పందెంలో గెలిపిస్తే నా జీతం రెట్టింపు చేస్తానందిరా పేరిందేవి గారు. నాకు డబ్బు చాలా అవసరం. అవతల రేసుల సీజను స్టార్టయిపోతోంది" అని ఇదయిపోయాడు.

రెండు రోజుల తర్వాత వల్లభరావు అనంత్‌ని పిలిపించాడు. "ఈ బుద్ధిమంతుల పోటీ గురించి నువ్వు చాలా ఇంట్రస్టు తీసుకుంటున్నావని నీకో విషయం చెబుదామని పిలిచాను. నువ్వు అవాళ అన్న తర్వాత ఆలోచించాను. నాకే కాదు వేరెవరికి ఉపకారం చేసినా మార్కులు వేయాలనీ, అపకారం చేస్తే తీసేయాలనీ నిర్ణయించుకున్నాను. ఇవాళ



పొద్దున్నే ఓ గమ్మత్తు జరిగింది. బంటూ లేడూ, పొద్దున్నే రైల్వే స్టేషన్ నుండి నడిచివస్తూ కనబడ్డాడు. ఎందుకు వెళ్లావన్నాను. నిన్న సాయంత్రం నువ్వేదో పత్రిక కోసం వెతుకుతున్నాననీ, అది రైల్వే స్టాల్ లో మాత్రమే దొరుకుతుందని అన్నావుట. నీకా పత్రిక అంటే చాలా ఇష్టమని, తెచ్చి ఇస్తే సంతోషిస్తావనీ రాంపండు సలహా ఇచ్చాడట. ఆ మాట పట్టుకుని... నీకోసం..మూడుమైళ్లు దూరాన ఉన్న స్టేషన్‌కి..పొద్దున్నే...సైకిల్ పంచరయిందని కాలి నడకన..వెళ్లి వచ్చాడంటే - వాటే వండ్రఫుల్ బాయ్ హీ ఈజ్! అందుకే పదిహేను బోనస్ మార్కులు ఇచ్చాను. ఇతరుల పట్ల ప్రవర్తించిన తీరును కూడా లెక్కల్లోకి తీసుకోవాలన్న ఐడియా ఇచ్చినందుకు నీకు థ్యాంక్స్!"

అనంత్ గొంతు పొడారిపోయింది. "పదిహేను మార్కులా?" అని దాదాపు అరిచాడు.

వల్లభరావు మరోలా అర్థం చేసుకున్నాడు. "ఓ, నీకు రౌండింగ్ ఆఫ్ సెంటిమెంటొకటి కదూ, ఓకే! ఇరవై మార్కులు."

***

విషయం విని అత్తయ్య మండిపడింది. నీ బోడి ఐడియా వల్లనే నేను పందెం ఓడిపోయే స్థితికి వచ్చానంది. తక్షణం, ఎక్కడున్నా సరే, అచలపతిని రప్పించమంది. లేకపోతే భీమారావు వంటకాలు పెట్టనంది.

మర్నాటికల్లా అచలపతి సిద్ధం. విషయం వినగానే ఓ ఐడియా చెప్పాడు. "సర్, మీ బంధువర్గంలో ఓ ఉంగరాల దుబ్బు జుట్టు అబ్బాయి - పదేళ్లకుర్రాడు - అతని పేరు అబ్బీసో ఏదో ఉండాలి. అతన్ని ఇక్కడకు రప్పించగలరా?"

"మధ్యలో వాడెందుకయ్యా?"

"సర్, అలాటి జుట్టు ఉన్న కుర్రాడు - అందునా తన కంటె వయసులో రెండేళ్లు తక్కువ ఉన్నవాడు కళ్ల ఎదురుగా ఉంటే రెసిస్ట్ చేసుకోవడం చాలా కష్టం. గుప్పిట్లో ఆ జుట్టు పట్టుకుని తలకాయ అటూ ఇటూ ఊపుతూ పోట్లాడాలని ఎవడికైనా - ముఖ్యంగా బంటూ లాటి పన్నెండేళ్ల కుర్రాడికి - తప్పకుండా అనిపిస్తుంది. మైనస్ మార్కులు పడక తప్పవు."

"అచలపతీ, నీ ఐడియా బాగానే ఉంది కానీ నువ్వో మాట మర్చిపోతున్నావ్. ఇక్కడ పన్నెండేళ్ల అల్లరి కుర్రాడు బంటూ ఒకడే కాదు, చంటి కూడా ఉన్నాడు. అదే టెంప్టేషన్ చంటికి కూడా కలిగితే?"

"సర్, చంటితో ఆ ప్రమాదం లేదు. అతను ప్రస్తుతం ప్రేమలో ఉన్నాడు. లోకంలో ఎవరినీ పట్టించుకునే స్థితిలో లేడు. అబ్బీసు మరి గుప్పెడు జుట్టు పెంచుకుని వచ్చినా వేలయినా వేయడు. తన ఊహాలోకంలోనే విహరిస్తూ వుంటాడు."

అనంత్ ఉలిక్కిపడ్డాడు. "ప్రేమలో పడ్డాడా? ఎవరితో?"

"సినీమా నటి గజాలాతో సర్"

అనంత్ ఫెళ్లున నవ్వాడు - "చంపేవ్ కదయ్యా! పన్నెండేళ్లకుర్రాడికి ప్రేమేటిమిట్రా అని నేను హడిలిపోతూ ఉంటే..?"

"సర్, ఆ ఎడోలసెంట్ వయసులో అటువంటి ఇన్‌ఫాట్యుయేషన్ చాలా బలంగా ఉంటుంది. దాన్ని మీరు కొట్టిపారేయడానికి వీల్లేదు."

అబ్బీసు వాళ్లమ్మతో మాట్లాడి తక్షణం రప్పించడానికి అత్తయ్య ఒప్పుకుంది. మర్నాటికల్లా వాడు వచ్చేశాడు కూడా. ఆ కుర్రాడిని చూస్తూనే బంటూ చేతులు దురదపెట్టినట్టు రుద్దుకోవడం అనంత్ దృష్టిని దాటిపోలేదు. అంతే కాదు, డేగ కళ్లేసుకుని అబ్బీసు జుట్టు కేసి చూడడం కూడా! కానీ బంటూ నిబ్బరించుకున్నాడు. వాళ్లిద్దరూ ఏదో ఒక రోజున ఇసకలో పడి కుమ్ముకుంటారని ఎదురుచూస్తూండగానే వల్లభరావు మళ్లీ పిలిచాడు.

ఆ రోజు అబ్బీసు కాల్లో ముల్లు గుచ్చుకుంటే బంటూ గాడు - బాలరూప బ్రహ్మారాక్షసుడయిన బంటూ గాడు - వాణ్ని భుజాన ఉప్పుమూటలా వేసుకొని కిలోమీటరు దూరం నడుచుకుని వచ్చాడట. - అదీ మండుటెండలో - అందుకు మురిసిపోయిన వల్లభరావు ఇంకో ఇరవయి మార్కులు బోనస్‌గా కలిపేడు. ఇవతల చంటిని చూస్తే గజాలా తపస్సులోంచి బయటకు వచ్చే సూచనలు కనబడటం లేదు. మైనస్ మార్కులు లేవు గానీ బోనస్ మార్కులూ లేవు.

లంచ్‌టైములో "నీకు పందెం ఓడిపోక తప్పని పరిస్థితి వచ్చిందిరా అనంతూ, పాపం బంటూ నేను చెప్పిన మాటవిని, బోల్డు బోల్డు మంచిపనులు చేస్తున్నాడు సుమా!" అన్నాడు రాంపండు విలన్‌లా నవ్వుతూ.

రూముకి వస్తూనే అనంత్ హడావుడిగా అచలపతిని పిలిచాడు. - "త్వరగా బట్టలు సర్దేయ్. మనం గుడారం లేపేద్దాం. వెధవ వెయ్యి రూపాయల గురించి కక్కుర్తిపడి ఈ నాటి కుర్రకారు ఇంతలా దిగజారి పోతుందని నేనెన్నడూ అనుకోలేదు. మరీ ఇంత బుద్ధిమంతుడితనమా? ఛ, ఛ"

అచలపతి అడ్డువచ్చాడు - "సర్, డబ్బు గురించే ఈ కుర్రాళ్లు ఇలా మారిపోయారని అనుకోవడం చాలా అసమంజసంగా ఉంది." అంటూ.

"కాకపోతే ఇంకేమిటయ్యా, అల్లరి చేయడం కూడా మర్చిపోయిన ఈ యూజ్‌లెస్ కుర్రాళ్ల గోల మన కొద్దు. ఈ బోనస్ మార్కుల ఐడియా వల్లభరావుకి కలిగించినందుకు అత్తయ్య నన్ను క్షమించదు. భీమారావు వంటకీ, అత్తయ్యకీ ఋణం తీరిపోయింది మనమేమి చేస్తాం? పద, పద."

అచలపతి ఖంగారు పడలేదు. "సర్, పరిస్థితి గంభీరంగా ఉందన్నమాట నిజమే కానీ, నాకు చీకట్లో ఓ ఆశారేఖ కనబడుతోంది. నిన్న బంటూ కాగితాలు తనిఖీ చేశాను. ఎక్కడ చూసినా ఆర్తీ, ఆర్తీ అని రాసి ఉంది. కొన్ని ప్రేమలేఖలు సగం సగం రాసి కనబడ్డాయి. ఆ ఆర్తీ క్లాసుమేటు అయివుండదని, సినీ నటి ఆర్తీ అగర్వాలే అయివుంటుందనీ నాకో చిన్న అనుమానం. అతని కళ్లల్లో మెరుపులు కనిపెట్టాను. రేపే ఓ ప్రయత్నం చేసి చూస్తాను." అన్నాడు.

మర్నాడు మధ్యాహ్నం లాన్‌లో పడక్కుర్చీలో పడుక్కుని వల్లభరావు భోజనానంతరం తీసే కునుకు తీస్తూ ఉండగా గాలిలోంచి ఓ చావుకేక వినబడింది. అనంత్, అచలపతీ, ఉషారత్తయ్యలతో బాటు నిద్రలోంచి మేలుకున్న వల్లభరావు కూడా ఉలిక్కిపడ్డాడు. ఆ చావుకేక వినబడిన కొన్ని సెకన్లలోనే కాబోయే మృతుడు అబ్బీసు, కాబోయే హంతకుడు బంటూ కూడా దృశ్యంలోకి వచ్చారు. అబ్బీసు శరవేగంగా పరిగెడుతున్నాడు. అతనితో ఇంచుమించు సమాన వేగంతో - చేతులో పేడనీళ్ల బకెట్టు ఉన్నా కూడా - బంటూ పరిగెట్టుకు వచ్చాడు. విసిరితే అందే దూరంలోకి వచ్చేసరికి, అబ్బీసుకి ఏం



దీనానాథ్ మధోక్ వర్ధంతి (జూలై 7) సందర్భంగా...

# "మధోక్ లేకపోతే నౌషద్ లేడు" - నౌషద్

అది నిర్మాత - దర్శకుడు మోహన్ భవనాని "ప్రేమ్‌నగర్"(1940) తీసే రోజులు. కథ, డైలాగ్స్, లిరిక్స్ రాసినది దీనానాథ్ మధోక్ అనే సిల్వర్ జూబ్లీ రైటర్. సంగీత దర్శకుడిగా పని చేయడానికి ఆయన నౌషద్‌ను భవనాని దగ్గరకు తీసుకెళ్ళాడు. నౌషద్‌ను చూసి భవనాని పెదవి విరిచాడు. 'ఈ ఇరవై ఏళ్ళ కుర్రాడు ఇంత భారీ చిత్రానికి సంగీతం ఏం ఈయగలడు? వద్దులే' అన్నాడు. కానీ మధోక్ తన పట్టు వదల్లేదు. ఆయనకు నౌషద్ పై గల అభిమానం అటువంటిది.

నౌషద్ మనోహర్ కపూర్ వద్ద అసిస్టెంటుగా పని చేసే రోజుల్లో మధోక్ కంటబడ్డాడు. 'కంచన్' సినిమాలో నౌషద్‌కి బ్రేక్ వచ్చింది. కానీ అతని కొలీగ్స్‌కి అది అసూయ పుట్టించింది. "బతాదో మోహే" పాట రికార్డింగు చేస్తూండగా అతనికి అనేక ఇబ్బందులు కలిగించారు. నౌషద్‌కి చికాకెత్తి ఆ ఛాన్సు వదిలేసుకుంటూంటే మధోక్ వచ్చి ఆవేశపడవద్దని హితవు చెప్పాడు. 'సినిమా ఛాన్సు కంటె తనకు ఆత్మాభిమానం ముఖ్యమని' నౌషద్ చెప్పిన జవాబు ఆయనకు నచ్చింది.



భవనాని మొండికేయడంతో మధోక్ ఒక్కటే చెప్పాడు - "ఈ కుర్రవాణ్ణి సంగీత దర్శకుడిగా తీసుకో. రైటర్‌గా నాకివ్వవలసినది నీ సొమ్ము నీ దగ్గరే పెట్టుకో. ఇతను సరిగ్గా చేయక నీకు నష్టం వచ్చిందనుకో, ఆ డబ్బు నువ్వే ఉంచేసుకో. నాకొక్క పైసా కుడా ఇవ్వనవసరం లేదు" అన్నాడు. సాటి కళాకారుడి ప్రజ్ఞపై మధోక్‌కున్న నమ్మకం, గౌరవానికి ఇదొక మచ్చుతునక. అందుకే నౌషద్ అంటూ ఉంటారు "దీనానాథ్ మధోక్ లేకపోతే నేనే లేను" అని.

నేటి తరం పూర్తిగా విస్మరించిన మధోక్ ఒకనాటి టాప్‌క్లాసు రచయిత. హీరోల నెల జీతం పదిహేడు వందల రూపాయలుండే రోజుల్లో ఆయన నెల జీతం రెండువేల రూపాయలు. నెల జీతాల పద్ధతి పోయాక హీరో పారితోషికం ఐదువేల రూపాయలు ఉండేటప్పుడు, ఆయన ఒక్కొక్క పాటకు పది వేల రూపాయలు పుచ్చుకునేవాడు. అగ్గిపెట్టె మీద తాళం వేస్తూ ఫోన్ మీదనే పాటలు డిక్టేట్ చేయగలిగేవాడు. కేంద్ర ప్రభుత్వం నుండి 'మహాకవి' బిరుదును పొందిన ఏకైక గీత రచయిత ఆయనే. రంజిత్ మూవీటోన్ వారికి ఆయన పది సంవత్సరాల కాలంలో ఇరవై ఆరు సినిమాలకు రచన చేస్తే అందులో ఇరవై ఐదు హిట్స్! 1942లో ఆ సంస్థ మునిగిపోయే దశకు వచ్చినప్పుడు 'భక్త సూరదాస్', 'తాన్‌సేన్' సినిమాలకు స్క్రిప్టు, పాటలు రాసి ఆ సంస్థను నిలబెట్టినది మధోక్‌యే!



లాహోర్‌లో 1902 అక్టోబరు 27న పుట్టిన మధోక్ సినీరంగానికి వచ్చేదాకా సినిమా పాటల్లో షేర్ - షాయరీ పాలు హెవీ డోస్‌లో ఉండేది. మామూలు జనం ఉపయోగించే మాటలను, పాటలను సినిమాల్లో ప్రవేశపెట్టిన ఘనత ఆయనదే! ఆయన పాటలు ఒకటే కాదు, కథ, మాటలు, పాటలు సమస్తం ఆయనే రాసేవాడు. ఎ.ఆర్. కర్దార్‌కి ఆయన ఏడు సినిమాలు రాసిపెడితే వాటిల్లో ఆరు సినిమాలు సిల్వర్ జూబ్లీ హిట్స్ అయ్యాయి.

"రతన్" (1944) సినిమాతో ఆయన ప్రొడ్యూసర్ కూడా అయ్యాడు. 'అఖియాఁ మిలాకే జియా భర్మాకే చలే నహీఁ జానా" "మిల్‌కే బిఛడ్ గయీ" వంటి అమిత ప్రజాదరణ పొందిన పాటలు ఆయన రాసినవే! భారీ తారాగణం లేకపోయినా పాటల కారణంగా విడుదలయిన ఆర్నెల్లలోనే నాలుగు రెట్లు లాభాలు సంపాదించింది రతన్! ఆ ఊపులోనే 'నాతా', 'ఖామోష్ సిపాహీ', 'గావ్ఁ' వంటి సినిమాలు తీసి చేతులు కాల్చుకున్నాడాయన.

గతంలో ఎన్ని విజయాలు చవి చూసినా, అపజయాల మార్గాన్ని పట్టిన వారిని చిత్ర రంగం ఎలా నిరాదరిస్తుందో కళ్లారా చూసి, బొంబాయి వాతావరణంతో విసిగిన మధోక్ హైదరాబాదు వచ్చి స్థిరపడ్డాడు. "మంచీ, మప్పితం (తెహజీబ్) తెలిసిన నగరం ఇది" అనేవారు హైదరాబాదు గురించి. చివరి మూడు - నాలుగు సంవత్సరాలు తన తనయుడి ఇంట్లో ఉంటూ 1982 జూలై 7న కన్నుమూసారు మధోక్.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

తోచిందో, ఏమో గయుడు అర్జునుణ్ని శరణు చొచ్చినట్టు వల్లభరావు పడక్కుర్చీ కింద నక్కాడు.

అప్పటికే బంటూ బకెట్‌లోంచి పేడనీళ్లు వర్షించాయి. వాటిలో అబ్బీసు తడిసింది తక్కువే. ఎక్కువ నానింది వల్లభరావే!

***

ఆ సాయంత్రం రాంపండు తిట్ల వర్షం, అత్తయ్య ప్రశంసా వాక్యాల జల్లులో తడిశాక అనంత్ అచలపతిని పిలిచాడు - "అచలపతీ, బంటూగాడికి అబ్బీసు మీద అంత కోపం ఎందుకు వచ్చిందో కనుకున్నావా?"

"కనుక్కోవలసిన అవసరం లేదు సర్. నేను అనుకున్నదే జరిగింది. అంటే బంటూ చేతికి పేడనీళ్ల బకెట్టే అందుబాటులో ఉంటుందని అనుకోలేదనుకోండి. కానీ కనీసం ఏ ఇటికరాయైనా ఉండకపోతుందాని ఆశించాను."

"మై గాడ్! దీనిలో నీ హస్తం ఉందా? అంతా దానంతట అదే జరిగిందనుకున్నానే! ఇంతకీ అబ్బీసుగాణ్ని ఎలా రెచ్చగొట్టావ్?"

"ఇందులో నేను పెద్దగా చేసిందేమీ లేదు సర్. పొద్దున్నే అబ్బీసును సినిమాల గురించి కదలేశాను. దూరదర్శన్ సినిమాలు ఎక్కువ చూస్తాట్ట. మాటల్లో చెప్పాడు - "ఈనాడు వచ్చే తారలందరూ కన్నాంబ ముందు దిష్టి తీయడానికి కూడా పనికి రారని అన్నాడు. 'బంటూది కూడా అదే అభిప్రాయం. వెళ్లి చెప్పిరా. సాటి కన్నాంబ అభిమానిని మోసుకొచ్చినందుకు సంతోషిస్తాడు' అని చెప్పాను. కుర్రాళ్ల మధ్య మాటా, మాటా పెరిగి ఉంటుంది. అబ్బీసు ఆర్తీ ముక్కు గురించో, మూతి గురించో ఏదో అని వుంటాడు. బంటూ నిజరూపంలో సాక్షాత్కరించాడు."

"పాపం రాంపండు. పులి తన చారలను ఎప్పటికీ మార్చుకోలేదని తెలియక ఆశలు పెట్టుకున్నాడు.'. అంటూ నిట్టూర్చాడు అనంత్.

-ఎమ్బీయస్ ప్రసాద్

(పి.జి. ఉడ్‌హవుస్ రాసిన 'ది లవ్ దట్ ప్యూరిఫైస్' కథ ఆధారంగా)

జులై 1 రావూరు వెంకట సత్యనారాయణ వర్ధంతి సందర్భంగా

# 'ఆషామాషీ' కబుర్ల రావూరు



**ముట్నూరి వారి 'కృష్ణాపత్రిక' దర్బారులోని ప్రముఖులలో ఒకరైన రావూరు వెంకట సత్యనారాయణరావు డైలీ కాలమిస్టుగా ప్రసిద్ధులు. 1911లో కృష్ణాజిల్లా ముచ్చిలిగుంటలో జన్మించిన రావూరు 1938లో 'కృష్ణాపత్రిక'లో చేరి 'వడగళ్లు' అనే శీర్షిక నడిపేరు. దరిమిలా 1960 ప్రాంతాల్లో ఆంధ్రప్రభ డైలీలో 'టీకా-టిప్పణం' అనే శీర్షిక ప్రారంభించి, దానినే 'ఆషామాషీ' అనే పేరుతో వ్యవహరించారు. దాదాపు 20 సంవత్సరాలు సాగిన ఆ శీర్షిక రావూరు మార్కు సున్నితమైన హాస్యానికి పెట్టింది పేరు. 'చక్రపాణి' వంటి కొన్ని చిత్రాలకు రచన చేసిన రావూరు హాస్య ప్రచారానికి 'నవ్వండి - నవ్వించండి' అని ఒక ఉద్యమ స్థాయి ప్రయత్నం కూడా చేశారు. హాస్య రచనలే కాక ఇతర రచనలు కూడా చేసిన రావూరు 1983 జులై 1న మరణించారు. మచ్చుకు ఆయన ఆషామాషీలలో ఒకటి-**

## రూపాయి - పాపాయి

ధర పెరిగిన తర్వాత, డబ్బు విలువా, దానితో మనుష్యుల విలువా కూడా తగ్గింది. ఏదైనా కొనాలంటే, ఎక్కువ ధర పెట్టడమొక్కటేకాదు - అమ్మే వాళ్ల చేత అనేక మాటలు పడాల్సి వస్తోంది.

ఇదివరలో ఎవరైనా బేరానికివస్తే "అయ్యా బాబు దయచెయ్యండి. తమరికేం కావాలి - పెద్దలు మీరు మళ్లీ మా కొట్టుకు రావద్దూ?" అంటూ వుండేవారు.

ఇప్పుడీ మాటలెక్కడా వినిపించడం లేదు. "ఏమిటయ్యా నీకేం కావాలి".

"తొందరాగా వుంటే వెళ్లు"

- "అంతకు తక్కువ రాదు. వెళ్లు వెళ్లు."

"ధర తగ్గించాలా! కొన్నాళ్లుపోయిన తర్వాతరా-"

"నువ్వు రాకపోతే వందమంది వస్తారు -" ఇలాటి పదజాలం దొర్లుతోంది. సంసారభారం నెత్తిన పెట్టుకొన్నందుకు, ఇవన్నీ భరించి, ఆ దుకాణ దారుని సింహాసనం మీద కూర్చున్న ఒక మహారాజుగా భావించి, చేతనైతే సీసపద్యం చదివో లేకపోతే వచనంలో పొగిడో, ఆ వస్తువు చేత పట్టుకు రావడం తప్పడం లేదు.

కూరల దుకాణాల వద్దకు వెడితే - ఎంత నమ్రత ప్రకటించాలి! కూరలు ఏరుదామంటే

-"అదేం పనికిరాదు. కావలిస్తే ఇంటికి పట్టుకువెళ్లి ఏరుకో, అక్కరలేకపోతే వెళ్లిపో" అంటాడు దుకాణదారు.

మొన్న ఒకసారి వంకాయలు కొంటున్నాను. తూచి ఇవ్వబోతున్నాడు. 'రాళ్లు సరిగా వున్నాయా?' అన్నాను. తక్కెట్లో వంకాయలు గభాలున గ్రుమ్మరించి "తనిఖీకొచ్చారా - తమరు! అసలు నీకు అమ్మను వెళ్లు" అంటూ మొదలు పెట్టాడు. ధరను గురించి మాట్లాడకూడదు. సరిగదా - రాళ్ల విషయం అడక్కూడదు. త్రాసులో వారుంటే అడక్కూడదు. తూకం కొంచెం నిలబెట్టమని అంతకన్నా అడక్కూడదు.

పేరుకి మాత్రం - కొందరిళ్లలో భర్తలున్నట్టు - ఒక పళ్లెంలో ముఖాలు మారీ, శిఖాలుచెరిగీ అలాపడి వుంటాయి రాళ్లు. వాటిని గురించి ఆలోచించక్కరలేదు. రెండో పళ్లెంలో కూరల్ని కుంచెంతో కొలిచినట్లు కొలుస్తాడు గాని, తూచడం కనపడదు. వ్యక్తుల కడగళ్లకు తోడు ఈ రాళ్లు ఒకటి!

మా యింటివద్దకు ఒక ముసలమ్మ కాయగూరలు తెచ్చేది. ఆవిడ దగ్గర ఒకరోజు వున్న రాళ్లు మర్నాడు వుండేవికావు. ప్రతి రోజూ మారుస్తుంటే ఎక్కడ అడిగేది! ఒక రోజైతే పోట్లాడటానికి అవకాశం వుంటుందిగాని.

ఆ రాళ్ళు చాలా విచిత్రంగా వుండేవి. శనివారం అన్నీ శివలింగాల రూపంలో వుండేవి. ఆదివారం అన్నీ - త్రొక్కుడు బిళ్ల ఆటలో పిల్లల ఆడే రాళ్లలాగా గుండ్రంగా వుండేవి. ఒకనాడు అన్నీ నలచదరం - ఒకరోజున మాత్రం ఒక రాతి ముక్క, ఒక ఇనుపముక్కా వేసుకొని వచ్చింది.

శివలింగాలు తెచ్చిననాడు కూరకొనుక్కొని, డబ్బులిచ్చి వాటిని కళ్లకు అద్దుకు రావడం మావంతు అయ్యేది. గుండ్రంగా వున్న రాళ్లు తెచ్చిననాడు - ఇవ్వాళ మనపని సున్నా - అని లోలోపల పాడుకొంటూ ఇంట్లోకి పోవడం జరిగేది.

ఆవిడ దగ్గర భూగర్భ పరిశోధకులకు పనికి వచ్చే రకాలు కూడా కొన్ని వున్నాయేమోనని పిస్తుంది. ఏ రాతితో తూచినా వొప్పుకోవలసిందే! - సరిగా లేవు అంటే-

"కూర తూచి యిస్తా... మీ ఇష్టం వొచ్చిన చోటికి పోయి తూయించుకురండి" అని సవాల్ చేసేది.

మొన్న మా మిత్రుడొకడు కూరల దుకాణానికి వెళ్లి "ఏమిటయ్యా పొట్లకాయ నిండా ఇలా పొడ లున్నాయి?" అన్నాడట "మనుష్యులకే వున్నాయి. పొట్టకాయకు వుండవా? అయినా అవన్నీ దోమకాట్లు. మనం దుప్పటి కప్పుకుంటే దూరి కుడుతున్నాయి. దొడ్లల్లో వుండే కాయల్ని కుట్టడం ఆశ్చర్యమేమిటి" అని దబాయించాడట వాడు.

మొన్న వేసవి కాలంలో మామిడిపళ్లు కొంటూ ఒకాయన "డజను కొన్నాగా, పదమూడో పండేది?" అన్నాడట.

"పదమూడో పండు తలపండే" నని ఆ బేర గాడు, తట్ట ఎత్తుకొని దబదబా వెళ్లి పోయాడట.

మొన్న ఒకావిడ బజారునుంచి వస్తూ పోనీ పిల్లలకేమైనా కొనుక్కుపోదామని మిఠాయి దుకాణానికి వెళ్లి "ఒక బేడ చేగోడిలియ్యి నాయనా" అందిట. ఆ అంగడిదారుడు "బేడ కయితే జీడిలు కొనుక్కోవమ్మా" అని ఇచ్చి వేశాడట.

ఎక్కడికిపోయినా అణాబేరాలు, బేడా బేరాలు వుండటం లేదసలు. పావలా తక్కువ అయితే ఎవరూ పలకరించరు సరిగదా -పైగా విసుక్కొంటారు. వారినేదో అవమానించినట్లుగా.

మొన్న ఒకరోజున మా ఇంటికొచ్చిన బంధువుల పిల్లలు బఠానీలు అమ్మే ఆయన్ని మేడమీదికి పిలిచి - ఒక అణా మరమరాలివ్వ మన్నారట.

అక్కడితో ఆయనకెక్కడలేని కోపం వచ్చింది. "అణాకోసం ఇన్ని మెట్లెక్కిస్తారా? పావలా బేరమన్నాలేదే ఎందుకు పిలవాలి?" అని పోట్లాడాడు.

"మరమరాలిక్కూడా పావలా లెక్కడ పెడతామయ్యా, పిల్లలు అణావి కొనుక్కొంటారు. అంతకంటె ఎక్కువదేనికి?" అని ఆ పిల్లల తల్లి వెళ్లి కల్పించుకు చెప్పింది.

"అణాబేరమని క్రిందవుండగానే చెప్పాలి - లేకపోతే దిగి రావాలి - అంతేగాని, దొరలల్లే కూర్చుని నౌకర్లును పిలిచినట్లు పిలుస్తారు!" అని కేకలు పెడుతూ దిగిపోయాడు. అణా బేరాల పరువు అలా వుంది. వస్తువురాకపోగా, కుస్తీలకు తయారవుతున్నారు.

అందుకని ఏ బేరానికి వెళ్లినా, ఎవరిని పిలిచినా భయం వేస్తోంది. ధరలు తగ్గవు, గృహస్థుల దగ్గిర డబ్బులు పెరగవు. ఈ అసందర్భ పరిస్థితుల్లో పడి, కొట్టుకు పోవలసిందే గాని, నెట్టుకు తిరిగే అవకాశం లేదు.

మొన్న ఒకరింట్లో పెళ్లి కొడుకు యాపిల్ కావాలన్నాడట. మామాగారు సణుక్కుంటూనే సైకిలిచ్చి కొడుకుని బజారు పంపాడు. అతడు తిరిగొచ్చి 'యాపిల్ రూపాయి చిన్న రకంది' అని చెప్పాడట ఆ గృహస్థు "బాబోయి రూపాయే" అని ఉలిక్కిపడ్డాడట.

కొనితేకపోతే అల్లుడికి కోపం వస్తోంది. ఒక రోజు కొంటే ప్రతిరోజూ అడుగుతాడేమో! ఇలా బాధపడి చివరకు - ఒకటి తెప్పించాడట.

ఆయన పెళ్లాన్ని పాపాయి అని పిలుస్తాడు. ఆ రోజంతా పావుగంట కొకసారి పాపాయి అని ఆవిణ్ణి పిలిచి రూపాయి అంటూ కూర్చున్నాడట. ఈ పాపాయి - రూపాయి గొడవ, అల్లుడి మూడు నిద్రలయ్యే దాకా సాగుతూనే వుంది.

# నథింగ్ స్పెషల్... జస్ట్ జోక్స్ & కార్టూన్స్... దట్సాల్!!



"మా మావయ్య మీద నుంచి అమాంతం రోడ్డు రోలరొకటి పోయిందిరా".

"ఏం చేశావ్ మరి?"

"ఇంటికి ఎలాగోలా తీసుకెళ్ళాను రా.. ఇంటికి తాళం వేసుంది. తాళం చెవులేమో నా దగ్గర లేవు. ఇంకేంచేయాలో తోచక ఆయన్ని తలుపు కింద నుంచి తోసేసాను....".



"నాయనమ్మా... ఈ రోజు స్కూల్లో వంద మీటర్ల పరుగు పందెంలో పాల్గొంటున్నాను. నన్ను ఆశీర్వదించవూ." అడిగేడు మనవడు.

"కాస్త ముందూ వెనక చూసుకుని నెమ్మదిగా పరుగెత్తు నాయనా..." అంది నాయనమ్మ.



"మమ్మీ... మమ్మీ.... బయటికి వెళ్ళి ఆడుకోనా?"

"ఏంటి... చిరిగి పోయిన ఆ లాగూతోనేనా?"

"కాదు మమ్మీ.... పక్కింటి పిల్లల్తో..."






"మన టీమ్ బాగుపడాలంటే నాకో మంచి ఆలోచన వచ్చింది సార్ ఆ ప్రకారం చెయ్యదలచుకున్నాను" అన్నాడు క్రికెట్ క్రీడాకారుడు.

"అయితే నీ ఫేర్‌వెల్ పార్టీని ఎప్పుడు అరేంజ్ చెయ్యమంటావ్" వెంటనే అడిగాడు టీమ్ మేనేజర్.



"మీ చెల్లెలు సన్నబడటం కోసం అన్నం తినటం బాగా తగ్గించేసిందట కదా... ఇప్పుడెలా వుంది?"

"చాలా బావుంది... కిందటి వారం నుంచి అసలు కంటికి కనిపించకుండా పోయింది....".



"కొలంబస్ గురించి మీలో ఎవరైనా ఏమైనా చెప్పగలరా".

'అతను అమెరికాను కనిపెట్టెను. అతడు బహుపొదుపరి".

"అమెరికాను కనిపెట్టాడు బాగానే వుంది. మరి పొదుపరి అని ఎందుకు చెబుతున్నావ్?".

"కాకపోతే ముప్పయివేల మైళ్ళ దూరాన్ని నావలో ప్రయాణం చేసిన వాడిని ఏమనాలి టీచర్...?"



"ఏంటయ్యా.... సీటు కింద దూరి అలా వెతుకుతున్నావ్? ఏం పోగొట్టుకున్నావేంటి?"

"చాక్‌లెట్ నోట్లోంచి పడిపోయిందమ్మా....".

"చాక్‌లెట్ కోసం మరీ అంతగా వెతకాలా? సినిమా అయిపోయిన తర్వాత చూసుకోవచ్చుగా?"

"అదికాదమ్మా.... చాక్‌లెట్‌తోబాటు నా పెట్టుడు పళ్ళు కూడా పడిపోయాయి.... అదీ సంగతి...".

# నథింగ్ స్పెషల్... జస్ట్ జోక్స్ & కార్టూన్స్... దట్సాల్!!



ఒక గాడిద మీద ఎక్కి ఫొటో తీయించుకున్న మనవడు ఆ ఫొటోని తాతకి చూపిస్తూ.....

"గాడిద మీద మనిషి... టైటిల్ బాగుందా తాతయ్యా.....?" అని అడిగేడు.

"అఁ((( బావుంది కానీ మరి నీ మీద ఎక్కి కూర్చున్నదెవరో కనిపించడం లేదేంటి?" అన్నాడు తాత.



వంద ఇంటర్వ్యూల కెళ్ళిన సీనియర్ నిరుద్యోగి నిత్యానందంని కొత్తగా డిగ్రీ పాసయిన సదానందం కలిశాడు. ఇంటర్‌వ్యూల గురించి ఎలా ప్రిపేరవ్వాలో తెలుసుకోవాలని అతన్ని సలహా అడిగాడు.

"అలాగే.... మీరు బ్యాంకు ఉద్యోగానికెళితే ఎక్స్‌రే కిరణాల గురించి, తెలుగు పండితుడు పోస్టుకెళితే అంతరిక్ష యాత్రల గురించీ, గుమస్తా ఉద్యోగానికి వెళ్తే ఛందస్సు గురించి బాగా ప్రిపేరవండి" అన్నాడు నిత్యానందం.





అమెరికాలో వున్న అల్లుడికి వుత్తరం రాస్తున్నారు మావగారు. "ఏమండోయ్... మనవడు కోతి బొమ్మ కొనిపెట్టమని అదే పనిగా పేచీ పెడుతున్నాడని ఒక ముక్క రాసి పడేద్దురూ...." చెప్పింది భార్య.

దానికి మావగారు ఉత్తరంలో యిలా రాశాడు-

"అల్లుడు గారూ.... మీ అబ్బాయి కోతి బొమ్మ కొనమని నిత్యం మా ప్రాణాలు తోడేస్తున్నాడు. కోతిబొమ్మ కొనమంటారా? మీరు వచ్చేవరకు ఆగమంటారా?''



రెండు కంప్యూటర్లు ఇలా మాట్లాడుకుంటున్నాయి.

"ఆ నంబరు మంత్రిగారబ్బాయిది. పాస్ చెయ్యి"

"ఎందుకు చెయ్యాలి. మార్కులు రాలేదుగా"

"ఆ నంబరు ఫెయిలయితే మంత్రిగారు గ్రేస్‌మార్కులు ఎలాగూ ప్రకటిస్తారు. అప్పుడు మనకు గొడ్డు చాకిరీ తప్పదు. ఇప్పుడైతే ఒక్క నంబరుతో శని వదిలిపోతుంది."



"మా మావయ్య కప్పని మింగేశాడ్రా"

"మరెలా.... డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళావా?"

"ఎలా తీసుకెళ్ళడం...!?అప్పటికే గెంతుకుంటూ చాలాదూరం పోయాడు."

"ఇన్‌స్పెక్షన్ చేయడానికి ఆఫీసరు గారు వస్తే మీరేం చేయాలి?" అడిగేరు మాస్టారు.

"మీరు ప్రక్కనుండి చేసే సైగలను మేం గమనిస్తూ వుండాలి..." చెప్పాడు ఓ కొంటె విద్యార్థి.



అలనాటి
ఆణిముత్యాల
గురించి నేటి
తరానికి
అనువైన
శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

కాళ్ళకూరి నారాయణరావు గారి

# వరవిక్రయం

నాటకం

## జరిగిన కథ

పురుషోత్తమరావు అనే ఆయనకు ఇద్దరు కూతుళ్లు. పెద్దమ్మాయి కాళిందికి పెళ్లి చేసే ప్రయత్నంలో కట్నం తీసుకోని వరుణ్ణి చూసి పెట్టమని పెళ్లిళ్ల పేరయ్యను కోరుతాడు. అది అసంభవమని పేరయ్య చెబుతాడు. సింగరాజు లింగరాజు అనే ధనికుడి పెంపుడు కొడుకు బసవరాజుకి కాళిందిని చూడమని కోరుతుంది పురుషోత్తమరావు భార్య. లింగరాజు పిసినారి అని, కట్నం బాగా ఆశిస్తాడనీ చెబుతూనే కట్నం రెండు వేలలో కుదిర్చే ప్రయత్నాలు చేస్తానంటాడు. లింగరాజు వద్దకు వచ్చి సంబంధం గురించి చెపితే అతడు ఐదువేలు కట్నం కావాలంటాడు. వివాహాల వీరయ్యను అదే సమయానికి పిలిచి పోటీ పెడితే పురుషోత్తమరావు నుండి ఐదువేలు గుంజవచ్చని ఐడియా చెబుతాడు.

**(గత సంచిక తరువాయి)**

సంతోషంగా యీ వార్త చెబుదామని భార్య దగ్గరికి వెళ్తాడు లింగరాజు. అతను వట్టి అనుమానం మనిషి అనీ, పరమ పిసినారీ అనీ అతని భార్య సుభద్రకి అసహ్యం. లింగరాజు డబ్బు ఖర్చవుతుందని చివరికి క్షవరం గూడా చేయించుకోకుండా వాయిదాలు వేస్తూండడం చూసి ఆమె 'యిప్పుడైనా (పెళ్లి పెత్తనం సందర్భంగా అయినా) క్షవరం చేయించుకోండి' అని గుర్తు చేస్తుంది. "అబ్బబ్బ! ఎప్పుడూ క్షౌరం, క్షౌరం అని గొడవ చేస్తుంటావు. నే పొయ్యాక యీ డబ్బంతా నీ క్షవరాలకే సరిపోయే టట్లుంది" అంటాడు. "మీకంత దిగులెందుకు? మీరు పోయేటప్పుడు మీ యినప్పెట్టె మీ నెత్తికెత్తుతానులెండి" అంటుంది సుభద్ర. లింగరాజు అందులో వ్యంగ్యం పట్టించుకోకుండా, "ఆహా! అంత అదృష్టమా!"

"సంపద మహత్వ మెరుగని చవటబ్రహ్మ
చావులేకుండగా నేని సలుపడయ్యె
చచ్చునప్పుడు వెనువెంట సకల ధనము
తీసికొని పోవు విధమేని తెలుపడయ్యె!"

అని విచారిస్తాడు.

ఆ మరునాడు అంతా వాళ్ల పథకం ప్రకారమే కుట్రచేసి పురుషోత్తమరావుని మోస పుచ్చుతారు. ఆ కుట్రలో పెళ్లిళ్ల పేరయ్య పురుషోత్తమరావు తరపున కూర్చుంటాడు. వివాహాల వీరయ్య మున్నంగి వారి సంబంధం మాట్లాడటానికి వచ్చినట్టు నటించి ఫాల్సు పాటగాడిలా వేలంలో రేటు పెంచుతాడు. ఇద్దరూ కలిసి పెళ్లికొడుకు వేలం పాట పెంచుతారు. దీనితో లాభపడేది లింగరాజు; అతని వద్ద కమిషన్ తినే పేరయ్య, వీరయ్య. బలి పశువు ఆడపిల్ల తండ్రి అయిన పురుషోత్తమరావు. ఆ వేలం సాగేటప్పటి సంభాషణ:

లింగ:- విన్నావా? మున్నంగి వారికిని, మాకును మూడు తరాల నుండి సంబంధ మవిచ్ఛన్నంగా సాగుతోంది. మూర్తి రాజు పంతులు గారు ఆ సంగతులన్నీ నెత్తుకొని మూారెడుత్తరము వ్రాసారు. అందుచేత ఇంత దూరమాలోచించవలసి వచ్చింది.

వీర:- మూడు తరాలనాటి సంబంధ మొకటేనా? మూడు వేల రూపాయల కట్నమో!

పేర:- వీరయ్యా! నీ గొడవ మా విపరీతంగా వుందే! మూడు వేలు మూడువేలని యిక్కడికి ముప్పయిసార్లన్నావు. ముష్టిమూడు వేలు. మీరే కాని మేమివ్వలేమనుకున్నావా? లింగరాజుగారు! ఆ మొత్తం మేమే యిస్తాము. మా కింద ఖాయం!

వీర:- అదేమన్నమాట? మీరధికంగా అన్నదేముంది?

పురు:- అలా అయితే ఇంకొక యైదువందలు అధికంగా ఇస్తాం.

వీర:- మా పంతులుగారు మరియైదువందలు.

పేర:- హొయ్యెయ్? వద్దు సుమా వొద్దు! మా పంతులుగారి సంగతి తెలియక మా జోరుగా వస్తున్నావు! మాట దక్కదు సుమా.

వీర:- పేరయ్యా! నీ బెదిరింపులకు నేను జడిసేవాణ్ని కాను! మా పంతులుగారు పెట్టమన్న మొత్తం వరకూ పెట్టిమరీ తీరుతాను.

పురు:- (రోషంతో) సరే కానీ, నాలుగువేల నాలుగు



వందలు.

వీర:- అయిదువందలు

పురు:- ఆరు; రా యెంతవరకు రాగలవో రా.

వీర:- రాక విడిచి పెడతానా? యేడు వందలు

పురు:- ఎనిమిది

లింగ:- వీరయ్యా! వీరి క్రింద ఖాయపరచవచ్చా?

వీర:- అప్పుడేనా! అయిదు వేలు

పేర:- (లేచి) బాబూ, యీ బేరం మనకు కుదిరేది కాదు లేవండి.

పురు:- అయ్యా! సెలవు తీసుకోమంటారా?

లింగ:- సందర్భాలన్నీ తమరు స్వయంగా చిత్తగిస్తూ నన్ను నెప పెట్టడం న్యాయమా?

పురు:- సరే మీ చిత్తం (అని లేచి పేరయ్యతో బైటకి వచ్చేస్తాడు)

వీర:- కొంపతీసి, బేరం గోవిందా కొట్టదు గదా?

లింగ:- వెర్రివాడా! పేరయ్య అంత పెయ్యమ్మ అనుకొన్నావా?

వీర:- నన్ను మెచ్చుకోరేం? నా పాఠం నేనెల్లా వప్ప గించాను?

లింగ:- నిత్యం కోర్టులలో బ్రతికే ముండాకొడుకువు. నీకిది లెక్కా.

పేర:- (బయట) పంతులుగారూ! బహుదూరం వెళ్లారు. ఇంతదూరం వెళ్ళడం నాకిష్టం లేదు. వెళ్ళక చేసేదీ కనబడలేదు. ఆ ఏల్నాటి శనిముండా కొడుకు లేకపోతే ఎంచక్కా ఫయిసలయ్యేది! చెరపడానికి చేట పెయ్యచాలును! నిజానికి నిలివెడు ధనమిచ్చినా నా యీ పాటి పిల్లవాడు మాత్రం ఇక సందర్భపడడు.

పురు:- పోనిండి. ఇంకా రవంత దూరం పోయి చూదామా?

పేర:- పోడానికేం పోవచ్చును. ఆ సులుపు బలుపు లాలోచించుకో వలసిన వారు మీరు. అమ్మగారితో ఆలోచించమంటే అవకాశం లేదు. మనం మళ్ళీ వచ్చేసరికి కీముండాకొడుకు మంగళం పాడేస్తాడు.

పురు:- అనవసరమైన ఆలస్యమే కాని అది మాత్రమేం చెప్పగలదు? ఇంకొక మాట విని చూదాము రండి.

పేర:- అయితే, ఒక పని చెయ్యండి. ఆ వెధవలతో వేలం పాట పాడినా ఆఖరు మాటని యింకో ఐదువందలమాంతంగా పెట్టండి, దానితో దిమ్మతిరిగిందా తిరుగుతుంది. తిరక్కపోతే, తిన్నగా ఇంటికి చక్కాపోదాం.

పురు:- సరే రండి (అని పేరయ్యతో మరల లోపలికెళ్లి) లింగరాజు గారూ! మరో మాట అనిపోదామని మరల వచ్చాను. ఇంకొక ఐదు వందలిస్తాం. ఇష్టముంటే మా క్రింద స్థిరపరచండి, లేదా యింతటితో మాకు సెలవు.

లింగ:- మూర్తిరాజుగారి క్రింద స్థిరపరచినట్లు ఉత్తరం వ్రాయటానికి మొదలు పెట్టినానే, సరే సమాప్తి కాలేదు కనుక దోషం లేదు. ఏమి వీరయ్యా! వీరి క్రింద స్థిర పరుపవచ్చునా?

వీర:- వారు నాకిచ్చిన వర్దీ యెంతవరకో, అంతవరకూ పాడాను. టెలిగ్రాం యిచ్చి తిరిగి ఆర్డరు తెప్పించుకునే వరకు ఆగండి.

లింగ:- అదేమన్నమాట, అయిదు నిముషాలాగను. పెద్ద మనుష్యుల కడ పేచీలు పనికిరావు! అయ్యా తమ క్రింద ఖాయము.

పేర:- తథాస్తు! పంతులుగారూ! తమ వద్ద పది రూపాయలు ఉంటే ప్రస్తుతము బజానా క్రింద జమకట్టించండి.

పురు:- (రూపాయిలు తీసి యిస్తాడు)

పేర:- తమరు కాస్త రసీదు ముక్క వ్రాసి యిప్పించండి.

లింగ:- అభ్యంతరమేమీ? (అని రసీదు వ్రాసి చదువుతాడు)

"బ్రహ్మశ్రీ పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారికి సింగరాజు లింగరాజు వ్రాసియిచ్చిన రశీదు. మీ కుమార్తె చి॥సౌ॥ కాళిందిని నా కుమారుడు చి॥ బసవరాజునకు చేసుకొనుటకు అందులకై మీరు మాకు కట్నము క్రింద నైదువేల ఐదువందల రూపాయల రొఖ్కము, రవ్వల యుంగరము, వెండి చెంబులు, వెండి కంచమూ, వెండి పావకోళ్ళు, పట్టు తాబితాలు, వియ్యపురాలు, వియ్యంకుల లాంఛనములు యధావిధిగా నిచ్చుటకును, ప్రతిపూట పెళ్లివారిని బ్యాండుతో పిలుచుటకును, రాక పోకలకు బళ్లు, రాత్రులు లైటులు ఏర్పాటు చేయుటకును, రెండుసారులు పిండివంటలతో భోజనములు, మూడుసారులు కాఫీ, సోడా, ఉప్మా, ఇడ్లీ, దోసె, రవ్వలడ్డు, కాజా, మైసూరు పాకలతో ఫలహారములు చొప్పున మా యిష్టానుసారం ఐదు దినములు మమ్ము గౌరవించుటకును, అంపకాల నాడు మాకు పట్టుబట్టలును, మాతో వచ్చువారికి ఉప్పాడ బట్టలు యిచ్చుటకును నిర్ణయించుకొని బజానా క్రింద పది రూపాయలిచ్చినారు గనుక ముట్టినవి.

"సింగరాజు లింగరాజు వ్రాలు" చాలునా?

పేర:- చాలు బాబూ! చాలు! మచ్చుకోసం దాచిపెట్టి తేవలసిన మతలబు! (అని రశీదు తీసుకొని పురుషోత్తమరావుగారి కిస్తాడు).

ఇలా అయిదు వేల అయిదొందలకి బేరం కుదుర్చుకుని, పది రూపాయలు అడ్వాన్సు యిచ్చి లింగరాజు దగ్గర రసీదు తీసుకుంటాడు. ఆ రసీదులో, కట్నం సొమ్ముతో పాటు యివ్వవలసిన లాంఛనాలు, పెద్దకొండవీటి చాంతాడంత జాబితా గూడా రాసి యిచ్చాడు లింగరాజు.

పురుషోత్తమరావుకి ఎక్కడా అప్పుదొరకదు. అందుకని పొలం బేరం పెడతాడు. పేరయ్య ఆయనకి సాయం చేస్తున్నట్టు నటిస్తూ, తన అల్లుడి పేర ఆ పొలం చౌకగా కొట్టేస్తాడు.

తన పెళ్లి కట్నం యిచ్చి చేస్తున్నారని విన్న కాళిందికి యీ పెళ్లి అసలు యిష్టం వుండదు. తల్లిదండ్రులతో ఆ మాటే అంటుంది. పురుషోత్తమరావుకి ఏమీ తోచక పేరయ్యని సలహా అడుగుతాడు. 'లింగరాజుకి ముందే డబ్బిచ్చేస్తే, 'ఇక ఎలాగూ యిచ్చేశారుగదా, డబ్బు గూడా ఎందుకు



నష్టపోవడం?' అని తనే మనసు మార్చుకుంటుంది. కాబట్టి అలా చెయ్యండి" అని సలహా యిస్తాడు పేరయ్య. ఆ సలహా మేరకు అయిదు వేల అయిదు వందల రూపాయలు పేరయ్య ద్వారానే లింగరాజుకు పంపుతాడు పురుషోత్తమరావు.

తన పెళ్లికి కట్నం కోసం పొలం గూడా అమ్మినట్లు కాళిందికి తెలుస్తుంది. దాంతో యీ పెళ్లంటే మరింత విముఖత కలుగుతుంది. దానికి తగ్గట్టు ఆ రోజు దినపత్రికలో 'ఒక యువతి కట్నం కారణంగా ఆత్మహత్య చేసుకుంది' అన్న వార్త తెలిసి కాళింది గూడా ఆత్మహత్య చేసుకుంటుంది.

కాళింది ఆత్మహత్య వార్త దినపత్రికల్లో పడుతుంది. లింగరాజు అది చదివించుకుని వింటూ వుండగా పేరయ్య వస్తాడు.

లింగ:- ఆ చచ్చిన పాపిష్ఠిది మూడు ముళ్లు పడ్డాకైనా చావక పోయింది గదయ్యా!

పేర:- అవును! అలా అయివుంటే యీ డబ్బు దక్కి మళ్లీ యింకో అయిదువేలకి బేరం తగిలేది.

లింగ:-అదే నా బాధాను! చావుదేం వుంది? పుట్టిన ప్రతీ ప్రాణీ గిట్టాల్సిందే! కాని కాస్త సందర్భానుసారంగా చస్తే ఎంత బావుండేది? సరే కానీ, యింతకీ వాళ్లు డబ్బు వెనక్కిచ్చేయమని అడుగుతున్నారా?

పేర:- అడగడమేంటి? అసలు యిప్పుడు నేను వచ్చిందే అందుకోసం!

లింగ:- ఇవ్వకపోతే ఏం చేస్తారట?

పేర:- కోర్టుకి వెళ్తారట! మీరిచ్చిన రసీదు సాక్ష్యం వుందిగా!

లింగ:- నేనంత అమాయకుడి ననుకున్నావా? దస్తూరీ, సంతకం రెండూ మార్చి రాశాను.

పేర:- అంత మాత్రాన సరిపోతుందా? మేమంతా లేమా సాక్ష్యం?

లింగ:- ఏంటయ్యోవ్, హఠాత్తుగా ప్లేటు ఫిరాయిస్తున్నావ్! అలా అయితే నా డబ్బుకే కాదు, నీ కమిషను అయిదొందలకి కూడా ఎసరొస్తుంది. ఆలోచించుకో!

పేర:- వస్తే రానియ్యండి.

లింగ:- పేరయ్యా! ఈ డొంక తిరుగుడు మాని మనిద్దరికీ లాభకరమైన ఆలోచన ఏదైనా చెప్పు!



పేర:- అలా అన్నారు బాగుంది! మనం యీ డబ్బు నష్టపోగూడదనుకుంటే వెంటనే రెండో పిల్ల కమలని చేసుకోడం ఒక్కటే మార్గం.

లింగ:-అలా అయితే ఆ ప్రయత్నంలో వుండు.

పేర:- అలాగే, శలవు!

పేరయ్య వెళ్లి పురుషోత్తమరావుని కలిసి కమలని బసవరాజుకిచ్చి పెళ్లి చెయ్యమని అడుగుతాడు. (బసవరాజు అని పేరు పెట్టడంలో రచయిత ఆంతర్యం బహుశా అతను 'డూడూ బసవన్న' అని కాబోలు. అందుకే 'రైము' కోసం చూడకుండా పాత్రకి ఆ పేరు పెట్టారు. చూడండి! మిగతా పురుష పాత్రల పేర్లన్నీ 'రైము' వున్నవే!) పురుషోత్తమరావు దిగులుతో ఏమీ తోచక కమలని 'నీ కిష్టమేనా?' అని అడుగుతాడు. 'ఇష్టమే!' అంటుంది కమల.

ఆమె ప్రణాళిక వేరు!

పెళ్లి నిశ్చయ మవుతుంది.

-(ఇంకా వుంది)

-నిశాపతి













గురువు కీ॥శే॥ కవిటపు సీతన్న గారితో...



పోలీస్‌శాఖ వారికోసం ప్రత్యేకంగా చిత్రీకరించిన ఓ పాటలో నటుడిగా..



18 నెలల శివదీక్షా సమయంలో...

# కీరవాణి పర్సనల్ ఆల్బమ్ నుండి 'హాసం' పాఠకులకోసం ప్రత్యేకంగా...

## బొంబాయి ప్రియుడు

రచన: చంద్రబోస్ గానం:బాలు, అనురాధాశ్రీరామ్

ప/అ: చందనా చీరనుకట్టి బొమ్మనా బ్లౌజునుచుట్టి
కొత్త పెళ్ళికూతురొచ్చే నేడే
ఆ: రేబాన్ చూపులతోటి రేమాండ్ మెరుపులతోటి
కుర్రవాడు నేడు వరుడైనాడే
అ: ఐటెక్స్ కళ్ళు పలికే కోటి కలలే
డ్యూలక్స్ ఒళ్ళు తెలిపె సొగసు సిరుల కళలే ॥చందన॥
చ/అ: మన పెళ్ళికి మోగెను ఏదో మంగళవాద్యం
ఆ: అది కమ్మని ఎమ్‌టీవీ సంగీతం
అ: కిలకిలమని సాగెను ఏదో మంజుల మంత్రం
ఆ: అది తీయనైన సోనీ స్వరరాగం
అ: పెళ్ళికి మల్లెల పల్లకినంటూ ఎదురే నిలిచే ఆ యమహా
ఆ: తెల్లని కోల్గేట్ అక్షింతలుగా మారే క్రొత్త తరహా
అ: కథలకు తెలియని వెతికిన దొరకని
కనివిని ఎరగని కళ్యాణం
ఆ: భాషా నువ్వంటూ ఊసే నేనంటూ
రాసీ సిమెంటు ఈ బంధము
అ: సింగారు తిలకము దిద్ది (2)
సింధూరు నుదుటన పెట్టి క్రొత్త పెళ్ళికూతురొచ్చే నేడే
ఆ: ఎల్ ఓ వీ ఈ వై ఓ యూ ఐలవ్ యూ...
చ/అ: మరైతే పెళ్ళి తర్వాత
ఆ: తర్వాత
అ: శోభనం గది ఎలా ఉండాలో అనుకుందామా ఒక్కసారి
ఆ: వై నాట్
ఆ: గది నిండా కమ్మేసింది మన్మథ ధూపం
అ: అది అంబికా దర్బార్ ఆహ్వానం
ఆ: నిలువెల్లా అల్లేసింది అల్లరి మైకం
అ: అది చల్లని పోలార్ చలిపవనం
ఆ: తళ తళ మెరిసెను సూపర్ రిన్‌లా అలకే లేని హంసాకల్పం
అ: నవ నవలాడెను జీవన్ టోన్‌లా కులికే కన్నెశిల్పం
ఆ: పొరపడి తరిమెను ఖైతాన్ సమయం
తనువుకు తెలిపెను సందేశం
అ: కనుకే ఆగాలి వణుకే తగ్గాలి కనుకే తాగాలి త్రీరోజెస్ టీ
ఆ: కింగ్‌సైజ్ కండలతోటి
కో: పపప మదపమ గరిగ
ఆ: కింగ్‌సైజ్ కండలతోటి గోద్రేజ్ గుండెలతోటి
కుర్రవాడు నేడు వరుడైనాడే

## లాహిరి లాహిరి లాహిరిలో...

రచన: సీతారామశాస్త్రి గానం: ఉన్నికృష్ణనన్, సునీత

ప/అ: అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఒ ఓ అం అః (2)
అను అక్షరాలే తోడుగా
అ: పడమర ఎరుగని సూర్యుడు నాన్న
పున్నమి జాబిలి మా అమ్మ
ఆ: ముచ్చటతీరా ముగ్గురు అన్నల ముద్దుల చెల్లిగ
పెరిగిన మనకథ
ఇ: లాహిరి లాహిరి లాహిరిలో...
మన అందరి గుండెల సందడిలో ॥లాహిరి॥
చ/అ: చందురుడ్నే దారంకట్టి దించుకుందాం ఎంచక్కా...
దీపమల్లె పెట్టడానికి
అ: ఓ తారలన్నీ హారం కట్టి తెచ్చుకుందాం సరదాగా
బొమ్మరింటి తోరణానికి
ఆ: పండుగ సందెళ్ళే నిండిన మా ఇల్లే రంగుల హరివిల్లే
అ: కోవెల గంటల్లే కోయిల పాటల్లే సరదాల అల్లరే
ఆ: కళ్ళల్లో కాంతులే దీపావళి
అ: కల్లలూ... ఎల్లలూ... కనివిని ఎరుగని
ఇ: లాహిరి లాహిరి లాహిరిలో...
చిరునవ్వుల మువ్వల సవ్వడిలో... ॥లాహిరి॥
చ/అ: ఏం వయస్సో ఏమోగానీ చెప్పకుండా వస్తుంది...
తేనెటీగ ముల్లు మాదిరి....
ఆ: ఏం మనస్సో ఏమోగాని గుర్తుచేస్తూ ఉంటుంది...
నిప్పులాంటి ఈడు అల్లరి
అ: ఒంటరి వేళల్లో తుంటరి ఊహల్తో వేధిస్తూ ఉంటుంది
ఆ: తోచిన దారుల్లో దూసుకుపోతుంటే ఆపేదెలా మరి
అ: ఎవ్వరో ఎక్కడో ఉన్నారని
ఆ: గువ్వలా గాలిలో ఎగిరిన మనకథ
అ: అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఒ ఓ అం అః
అని ఆగనంటూ సాగదా...
ఆ: మనసుని చిలిపిగ పిలిచిన ప్రేమ
వయసుని తరిమిన ఈ ప్రేమ
అ: కోరిన జంటను చేరేదాకా
ఒక క్షణమైనా నిలువని పరుగుల
ఇ: లాహిరి లాహిరి లాహిరిలో...
తొలివలపులు పలికిన సరిగమలో... ॥లాహిరి॥

## రాజహంస

రచన: వేటూరి గానం: బాలు, ఇ. గాయత్రి

ప/అ: గుండెల్లోనే పుట్టిందమ్మా గోదావరి
కన్నుల్లోనే పొంగిందమ్మా గంగాఝరి
నా ఒడిచేరే ఓ లాహిరి
నాలో పాడే నీలాంబరి ॥గుండెల్లోనే॥
ఆ: ఈస్ దిస్ లవ్ ఆర్ ఈస్ దట్ హౌ ఐ ఫీల్
ఈస్ ఇట్ మ్యాజిక్ ఆర్ ఈస్ లవ్ సో రీల్
ఐ వాంట్ టూ ఫైండ్ దిస్ ప్లేస్ అవేక్స్ టు సీ
సో ఈస్ ది ప్లవర్ సంవన్ టెల్ మీ ప్లీజ్
చ/అ: యదనుదాటి ఎదుట నిలిచే ఓ రూపం
నిదురలేచె నిన్నలేని ఓ బంధం
చిగురు తొడిగె సిగ్గు పెదవి పేరంటం
చెలరేగె కలలెన్నో చెలికోసం
నా ఎదలోన ఏ దేవతో
వ్రాసిందిలే ప్రేమాక్షరి ॥గుండెల్లోనే॥
ఆ: లవ్ ఈసే స్పెషల్ థీమ్ ఇట్ నెవర్ బ్రో సో
ఇట్ కెన్ మేక్ యు లాఫ్ ఇట్ కెన్ మేక్ యు సింగ్
బట్ ఇట్ కాన్ట్‌బి బోన్ ఎండ్ కాన్ట్‌బి సోన్
చ: ఋతువుకొక్క రుచిని చూపె ఈ అందం
మదిని జల్లె మల్లె విరుల మకరందం
చిలక పాప లెగసె చదివె శుభమంత్రం
అలరేగె కలగానే తొలిమోహం
ఎన్నటికైనా ఆ దేవతే కావాలిలే ప్రాణేశ్వరి ॥గుండెల్లోనే॥

## అమ్మ

రచన: వేటూరి సుందర్రామ్మూర్తి　గానం: చిత్ర

ప: మమతల మధురిమ తొలి ఉగ్గులే పట్టనా
జననినై జగమునే ఇక ఊయలే ఊపనా
ఒక అమ్మగ నీకిక అంకితమైపోనా
సుహాసినీ సుమాల తోట నీడలో
వసంత గాలి లాగ లాలి పాడనా

చ: కడుపున కదలాడే మోడు ఆశే పూలు పూసే
పురుడెరుగని పువ్వే తోటలోన తొంగి చూసెలే
కలలకు కనులిచ్చే పొద్దులేవో తెల్లవారే
నిరుడెరుగని నీడే పాప తోడై పల్లవించెలే
నాలోని క్షీరసాగరం పొంగిపోయెలే
ఈనాడే జీవితామృతం చిందిపోయెలే ॥నాలోని॥ మమత॥

చ: మనగడ మలుపుల్లో మల్లెపూలే జల్లులాయే
అడవిని పిడిరాయి అమ్మలాగ మారిపోయెలే
అతిథిగ ఇలజేరే జీవితాన పండగాయే
మనసిక ఒడిచేరే బోసినవ్వే వెన్నెలాయెలే
నాలోని మాతృదేవత కోవెలుందిలే
ఏనాడూ ఓడిపోని ఓ అమ్మ వుందిలే ॥నాలోని॥ మమత॥

## సీతారామయ్యగారి మనవరాలు

రచన: వేటూరి సుందర్రామ్మూర్తి　గానం: చిత్ర

ప: కలికి చిలకల కొలికి మాకు మేనత్త
కలవారి కోడలు కనకమాలక్ష్మి (2)
అత్తమామల కొలుచు అందాల అతివ
పుట్టిల్లు ఎరుగని పసి పంకజాక్షి
మేనాలు తేలేని మేనకోడల్ని
అడగ వచ్చామిమ్ము ఆడకూతుర్ని
వాల్మీకినే మించు వరస తాతయ్య
మా యింటి కంపించవయ్య మావయ్య ॥కలికి॥

చ: ఆ చేయి ఈ చేయి అత్త కోడలికి
ఆ మాట ఈ మాట పెద్ద కోడలికి
నేటి అత్తయ్య నాటి కోడలివె
తెచ్చుకో మాయమ్మ నీవు ఆ తెలివి
తలలోని నాలికై తల్లిగా చూసె
పూలల్లో దారమై పూజలే చేసే
నీ కంటి పాపలా కాపురం చేసే
మా చంటి పాపను మన్నించి పంపు ॥కలికి॥

చ: మసకబడితే నీకు మల్లెపూదండ
తెలవారితే నీకు తేనె నీరెండ
ఏడు మల్లెలు తూగు నీకు ఇల్లాలు
ఏడు జన్మల పంట మా అత్తకాలు
పుట్టగానే పూవు పరిమళిస్తుంది
పుట్టింటికే మనసు పరుగుతీస్తుంది
తెలుసుకో తెలుసుకో తెలుసుకో
తెలుసుకో తెలుసుకో మనసున్న మామ
సయ్యోధ్య నేలేటి సాకేత రామ ॥కలికి॥

## పరదేశి

రచన: చంద్రబోస్　గానం: ఉన్నికృష్ణన్, చిత్ర

ప/ఆ: తెలుగు ఇంటి పెరటిలోన విరిసే మందారమా
చిగురు మావి కుబురులోని కుహూకుహూల రాగమా
ఐయామ్ ఫీలింగ్ ఫీలింగ్ ఫీలింగ్ దట్ ఐయామ్
ఫాలింగ్ ఇన్ లవ్
అహ ప్రేమ ప్రేమ ప్రేమా అంటూ
ఐ వాంటు లివ్
ఈ ఊరి గాలి మంచి కబురు తెచ్చింది
కోరుకోని కాలమేదో కలిసొచ్చింది

ఆ: నయగార దారుల్లో వురికే జలపాతమా
న్యూజర్సీ తోటల్లో అల్లుకున్న శాంతమా
ఐయామ్ ఫీలింగ్ ఫీలింగ్ ఫీలింగ్ దట్ ఐయామ్
ఫాలింగ్ ఇన్ లవ్
అహ ప్రేమ ప్రేమ ప్రేమా అంటూ
ఐ వాంటు లివ్
ఈ చిన్నిమాట నాకు భలే నచ్చింది
ఇంతవరు లేని హాయి తెలిసొచ్చింది

చ/ఆ: జూలియట్ రోమియోల జంటలీల మనది
అ: నలదమయంతిలోని పంతమే ఇది
ఆ: గ్రీనులాండ్ నేల మీద ప్రేమ ఖాండ మనది
అ: ఎదుకుల వీధిలోన ప్రణయమే ఇది
ఆ: దేశం మారినా
అ: ప్రేమ రసం ఒక్కటే
ఆ: కాలం మారినా
అ: కన్నెతనం ఒక్కటే
ఆ: చనువే పెరిగిన తనువె మరిగిన
అ: చలిగంగ స్నానాల వణుకు ఒక్కటే
ఆ: మారిషస్‌లో ఊహల్లో దాగిన సౌందర్యమా
అ: పడమరమ్మ నుదిటిపైన విరిసే సింధూరమా
ఆ: ఐయామ్ ఫీలింగ్ ఫీలింగ్ ఫీలింగ్ దట్ ఐయామ్
ఫాలింగ్ ఇన్ లవ్
అ: అహ ప్రేమ ప్రేమ ప్రేమ అంటూ ఐ వాంటు లివ్

చ/ఆ: ఆంధ్రపెదవి ఆంగ్ల పెదవి హత్తుకున్న నిమిషం
ఆ: మధువులు మంచు ద్రెంచు ముద్దులే సుమా
అ: సీమరాణి గామారాజు దగ్గరైన తరుణం
ఆ: మనసుకు గ్రీనుకార్డు సిద్ధమే సుమా
అ: అతిథిగా వచ్చిన
ఆ: అమృతమె ఇవ్వనా
అ: హృదయం అర్పణ
ఆ: ఈ క్షణమే చెయ్యనా
అ: తరగని కాంక్షతో వదలని దీక్షతో
ఆ: వెయ్యేళ్ళు వెయ్యాలి వలపు వంతెన
అ: విజయనగర వీధుల్లో మెరిసె రవికిరణమా
ఆ: వాషింగ్టన్ వీధుల్లో కురిసే హిమక్షేత్రమా ॥ఐయామ్॥
ఆ: ఈ చిన్ని మాట నాకు భలే నచ్చింది
అ: కోరుకోని కాలమేదో కలిసొచ్చింది

(తరువాయి 73వ పేజీలో)



## 'బాంబే డ్రీమ్స్' కల కల్లయినా

# రెహమాన్ స్వప్నం ఫలించింది

గతపక్షం జూన్ 19న "బాంబే డ్రీమ్స్" ప్రీమియర్ షో లండన్‌లోని వెస్ట్ ఎండ్ థియేటర్‌లో నిర్వహించబడింది. 2002 సంవత్సరంలో లండన్‌లో విడుదలైన కొత్త మ్యూజికల్ ఇదొక్కటే. బాలీవుడ్ కథాంశంగా, అనేకమంది భారతీయులతో కలిసి రూపొందించారు కాబట్టి "బాంబే డ్రీమ్స్" భారత దేశంలో కూడా ఎంతో ఆసక్తిని రేకెత్తించింది. షారుఖ్‌ఖాన్ ప్రత్యేక అతిథిగా ఈ ప్రీమియర్‌కు హాజరయ్యారు.

ఆస్కార్ గెల్చుకోలేకపోయినా 'లగాన్' విదేశీయుల్లో బాలీవుడ్‌పై తమ దృష్టిని మరల్చేలా చేసింది. భారతీయ వాతావరణంలో, భారతీయ టెక్నిషియన్లతో, భారతీయ నటీనటులతో తయారయిన "బాంబే డ్రీమ్స్" హిట్ అయితే లండన్ తదితర థియేటర్ వర్గాల కోటలో బాలీవుడ్ పరిశ్రమ పాగా వేసినట్టే. ఈ వాతావరణం కొత్తగా అనిపించి బ్రిటిష్ విమర్శకులు, ప్రేక్షకులు తిరస్కరిస్తే నాలుగున్నర మిలియన్ పౌండ్లు పెట్టుబడి, మూడేళ్ల శ్రమ వృథా అయినట్లే!



ఇంతటి రిస్కును తీసుకుని రంగస్థలంపై ఈ మ్యూజికల్‌ను నిర్మించినది - ప్రఖ్యాత సంగీత దర్శకుడు ఆండ్రూ లాయిడ్ వెబ్బర్! "జీసస్ క్రైస్ట్ సూపర్‌స్టార్", "కాట్స్", "ఎవిటా", "ఫాంటమ్ ఆఫ్ ది అపేరా" వంటి బ్లాక్ బస్టర్ మ్యూజికల్స్‌కు సంగీతం సమకూర్చి అనేక అవార్డులు (టోనీ, గ్రామీ, ఎమ్మీ, ఆస్కార్) గెలుచుకున్న వెబ్బర్‌కు ఈ థీమ్‌పై ఆసక్తి రగిలించినది శేఖర్‌కపూర్. "ఎలిజిబెత్" విజయం తర్వాత తనను కలిసిన వెబ్బర్‌కు ఇండియన్ సబ్జెక్ట్‌పై మ్యూజికల్ తీయమని ప్రోత్సహిస్తూ ఎ.ఆర్.రెహమాన్‌ను పరిచయం చేశాడు. "ఛయ్యా, ఛయ్యా" పాట విన్న వెబ్బర్ ముగ్ధుడై పోయాడు. ఆ పాటతో బాటు 'షకలక బేబీ" వంటి మొత్తం 5 ఫిల్మీ ట్యూన్స్ ఉపయోగిస్తూ రెహమాన్ మొత్తం 16 పాటలు సమకూర్చాడు.





శేఖర్‌కపూర్, వెబ్బర్ కలిసి చెప్పిన ప్లాటు (బొంబాయి స్లమ్ కుర్రాడు ఓ సినిమా ప్రొడ్యూసర్ కూతురితో ప్రేమలో పడడం) మీద మీరా సయాల్ ('గుడ్‌నెస్ గ్రేషియస్ మీ' ఫేమ్) స్క్రిప్టు రాసింది. స్టీవెన్ పిమ్‌లాట్ డైరెక్టు చేశాడు. హీరోగా రజా జాఫ్రీ, హీరోయిన్‌గా ప్రియా కాళిదాస్, విలన్ (ప్రొడ్యూసర్)గా దలీప్ తాహిల్ వేశారు. డాన్సు డైరెక్టరుగా పని చేసినది బాలీవుడ్‌కి చెందిన ఫరాఖాన్, ఆమెతో బాటు బ్రిటిషు డాన్సర్ ఏంథోనీ వాన్ లాస్ట్. లిరిక్స్ రాసినది డాన్ బ్లాక్. బ్లాక్ కమెడియన్‌గా కాక "డైమండ్స్ ఆర్ ఫరెవర్", "బోర్న్ ఫ్రీ" (దీనికి ఆస్కార్ వచ్చింది) వంటి అనేక చిత్రాలలో వందకుపైగా పాటలు రాసి ఖ్యాతి నార్జించుకున్నాడు.

"బాంబే డ్రీమ్స్"కై అతను రాసిన పాటలు మచ్చుకు చూడబోతే-

"షకలక బేబీ, షకలక బేబీ/నథింగ్ హియర్ ఈజ్ ఎవర్ వాట్ ఇట్ సీమ్స్/షకలక బేబీ, లెట్ మీ టేక్ యూ విత్ మీ ఇన్ మై డ్రీమ్స్/షకలక బేబీ, షకలక బేబీ, కమ్ అండ్ షకలక విత్ మీ..."

అలాగే - "యాయిరే, యాయిరే/సింగ్ అండ్ డాన్స్ రైట్ ఎవే"

ఇంత హంగామా చేసినా "బాంబే డ్రీమ్స్" తొలి ప్రదర్శనకు హాజరయిన 2,200 మందిలో ఎక్కువ మంది భారతీయులే ఉన్నారు. కేవలం ఏషియన్స్ మాత్రమే ఆదరిస్తే షో సక్సెస్ కావడం కష్టం. సక్సెస్ అవుతుందని వెబ్బర్ కూడా ఢంకా బజాయించి చెప్పటం లేదు. "ఇప్పటిదాకా ఎవరూ నడవని దారిలో నడిచి చూస్తున్నాం. పాశ్చాత్య నాటక రంగంలో వేసిందే వేసి బోరు కొడుతోంది. కొత్త రుచులు చూపించాలి. కొత్త తరహా సంగీతం వినిపించాలి. అందుకే ఈ ప్రయోగం చేయడం జరిగింది" అన్నాడు. వెబ్బర్ ఇంత నమ్రతగానే ఉన్నా ఇంగ్లండు జర్నలిస్టులు మాత్రం "బాంబే డ్రీమ్స్"ను తూర్పారబట్టారు. "షాడీ", "సూపర్‌ఫిషియల్", "మిష్-మాష్", "గూయీ బాంబే మిక్స్" - ఇవీ వాళ్లు వాడిన కొన్ని విశేషణాలు. ది టైమ్స్ పత్రిక లిరిక్స్‌ను, పాత్రల చిత్రీకరణను, ముగింపుని విమర్శించింది. ది ఇండిపెండెంట్ పత్రిక కథను ఫార్ములా ఫ్రేమ్‌లో బిగించేసేరని వాపోయింది. దిడైలీ టెలిగ్రాఫ్ స్క్రిప్టును 'మెస్'గా అభివర్ణించింది. నటీనటుల్లో ఆయేషా ధార్కర్‌కు మాత్రం మంచి మార్కులు పడ్డాయి.

కానీ పత్రికలన్నీ ముక్తకంఠంతో కీర్తించినది మాత్రం - ఎ.ఆర్.రెహమాన్ సంగీతాన్ని! తను అందించిన సంగీతం వెస్టరన్ ఆడియన్స్‌కి నచ్చాలనీ, కాలక్రమేణా భారతీయ గాయకులు అంతర్జాతీయ రంగంలోకూడా పేరు తెచ్చుకుని గ్రామీ అవార్డులు గెలుచుకోవాలని రెహమాన్ ఒక ఇంటర్వ్యూలో కోరిక వెలిబుచ్చాడు. అందులో మొదటి మెట్టు ఎక్కినట్టే! అందుకే మనం అనుకోవచ్చు. 'బాంబే డ్రీమ్స్ ఫెయిలయినా రెహమాన్ మాత్రం ఫస్టు క్లాసులో పాస్ అయ్యాడు' అని.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# న్యూస్ వ్యూస్

## నూతన్‌ప్రసాద్‌కు ఎన్.టి.ఆర్. ఆత్మీయ గౌరవం అవార్డు



హాస్యనటుడు నూతన్‌ప్రసాద్‌కు రాష్ట్ర ప్రభుత్వం ఎన్.టి.ఆర్. ఆత్మీయ గౌరవం పురస్కారం లభించబోతుందని జూన్‌లో ఆయనకు జరిగిన ఓ సన్మాన సభలో శ్రీ కె.వి. రమణాచారి ప్రకటించారు. ఆ పురస్కారం క్రింద తనకు లభించే రూ.50,000/-లు తన అసిస్టెంటు నాగేశ్వరరావుకి ఇచ్చివేస్తానని నూతన్ ప్రసాద్ ప్రకటించారు. 'బామ్మమాట - బంగారు బాట' సినిమా షూటింగ్‌లో జరిగిన దుర్ఘటన వల్ల వెన్నెముక దెబ్బతిన్న తాను వీల్ ఛైర్లో తిరుగుతూనే 80 సినిమాలలో నటించగలిగానంటే నాగేశ్వరరావు వల్లనే అది సాధ్యపడిందన్నారు నూతన్‌ప్రసాద్.

## టూకీగా

★హాస్యనటుడు రాజేంద్రప్రసాద్ తొలిసారిగా ఓ కన్నడ చిత్రంలో నటిస్తున్నారు. ఆ సినిమా పేరు 'టాప్‌టెన్'.

★టైమ్స్‌మ్యూజిక్ 21 ఇంటర్నేషనల్ లేబుల్స్‌తో ఒప్పందం కుదుర్చుకోవడం ద్వారా అంతర్జాతీయ మార్కెట్లో ప్రవేశించింది. గత పక్షం జూన్ 19న బొంబాయిలో నిర్వహించిన సమావేశంలో ఈ విషయం ప్రకటించడంతోబాటు టైమ్స్ మ్యూజిక్ 381 ఇంటర్నేషనల్ టైటిల్స్ విడుదల చేసింది.

★రాజధాని, శతాబ్ది ఎక్స్‌ప్రెస్ ప్రయాణికులకు ఎఫ్.ఎమ్.2 రేడియో ప్రోగ్రాములు వినిపించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. రైల్లో ప్రస్తుతం ఉన్న ఎనౌన్స్‌మెంటు ఛానెల్స్ ద్వారా వీటిని వినిపించడానికి ట్రయల్స్ నిర్వహిస్తున్నారు.

★ఢిల్లీ-త్రివేండ్రం రాజధాని ఎక్స్‌ప్రెస్‌లో ఏసియా స్టార్ శాటిలైట్ సహాయంతో తమ కార్యక్రమాలు ప్రసారం చేయడానికి ఆలిండియా రేడియో పరీక్షలు జరుపుతోంది.

## ఘంటసాలపై రెండు పుస్తకాల ఆవిష్కరణ

గత పక్షం జూన్ 23న హైదరాబాదులో ఘంటసాలపై 'బహుదూరపు బాటసారి' 'స్మృతితరంగాలు' అనే పుస్తకాలు పుష్పగిరి పీఠాధిపతులు ఆవిష్కరించారు. దీనిలో మొదటి పుస్తకంలో ఘంటసాల గానామృతంపై ప్రొ॥ హెచ్.ఎస్.బ్రహ్మానంద రాసిన పరిశోధనా వ్యాసంతో బాటు ఘంటసాలతో




కలిసి పని చేసిన రచయితల, గాయనీమణుల, సంగీత దర్శకుల వివరాలున్నాయి. రెండవ పుస్తకంలో ఘంటసాలపై ఆయన శ్రీమతి రాసిన వ్యాసంతో బాటు, ఇతరుల వ్యాసాలు కూడా ఉన్నాయి. పుస్తకాలను ఆవిష్కరిస్తూ పీఠాధిపతి పుష్పగిరి పీఠానికి విపత్కర పరిస్థితులు ఏర్పడినప్పుడు ఘంటసాల అందించిన సహకారాన్ని గుర్తు చేసుకున్నారు. భావ ప్రకటనకు ఎక్కువ ప్రాధాన్యత ఈయడం వలనే సినిమా సంగీతం శాస్త్రీయ సంగీతం కంటె ఎక్కువ పాప్యులర్ అయిందని ఘంటసాల అనేవారన్నారు. ఈ పుస్తకాల సంపాదకులలో ఒకరైన డా॥ కె.వి.రావు మాట్లాడుతూ 'హరిజనవాడలదాకా పాకినప్పుడే హైందవ మతం నిలుస్తుందన్న ' - వివేకానందుని కలను భగవద్గీత గానం చేసి ఘంటసాల సాకారం చేశారన్నారు. అప్పటివరకు భగవద్గీత అంటే తెలియని వర్గాలలో కూడా ఘంటసాల రికార్డు వల్లనే కొన్ని శ్లోకాలయినా నేర్చుకునే అవకాశం వచ్చిందన్నారు. సభకు ఘంటసాల శ్రీమతి, కుమార్తె, మనుమరాలు హాజరయ్యారు.

## మెక్ కార్ట్‌నీ ద్వితీయ వివాహం ఖర్చు రూ. 120 కోట్లు



'బీటిల్స్'లో ఒకరైన పాల్ మెక్ కార్ట్‌నీ తన 60వ యేట 34 యేళ్ల హీదర్‌మిల్స్‌ను జూన్ 11న పెళ్లాడాడు. అతని మొదటి భార్య 1998లో క్యాన్సర్‌తో మరణించింది. నలుగురు పిల్లలున్నారు. మోడల్, సాంఘిక సేవాతత్పరురాలు అయిన హీదర్‌మిల్స్ పరిచయం కావడంతో మళ్లీ పెళ్లి చేసుకో దలచుకున్నాడు పాల్. ఐర్లండ్‌లో జరిగిన ఈ పెళ్లికి రూ. 120 కోట్లు ఖర్చయిందట. అతిథులలో బిల్‌క్లింటన్, ఎల్టన్ జాన్, ఎరిక్ క్లాప్టన్, రింగోస్టార్ వంటి ప్రముఖులున్నా అందరికీ శాకాహారమే వడ్డించారు.

## బకింగ్‌హామ్ పాలెస్ కూడా ప్రవేశించిన పాప్

బకింగ్‌హామ్ పాలెస్‌లో జరిగిన క్వీన్స్ గోల్డెన్ జూబిలీ రాక్ కాన్సర్ట్ సిడి రూపంలో గత పక్షం జూన్ 24 నుండి అమ్మకానికి వచ్చింది. పాలెస్ గ్రౌండ్స్‌లో తొలిసారిగా జరిగిన ఈ పాప్ కచ్చేరీని 10 లక్షల మంది ప్రత్యక్షంగా, 2 కోట్ల మంది బ్రిటన్‌లో టీవీ ద్వారా చూసారు.



ప్రపంచంలోని తక్కిన దేశాల టీవీ ప్రేక్షకులను కలుపుకుంటే 20 కోట్ల మంది చూసి ఉంటారని అంచనా. అందుకే దీన్ని సి.డి రూపేణా రిలీజ్ చేసి దానిపై వచ్చే 2 కోట్ల పౌండ్లను బ్రిటిష్‌రాణి, ప్రిన్స్ ఫిలిప్ నిర్వహించే 6 చారిటీ సంస్థలకు విరాళమిద్దామని అనుకున్నారు. 21 ట్రాక్‌లున్న ఈ సిడిలో పలువురు గాయకులు - క్లిఫ్ రిచర్డ్ (మూవ్ ఇట్), పాల్ మెక్ కార్ట్‌నీ (అల్ యూ నీడ్ ఈజ్ లవ్, హే జూడ్), షిర్లీ బేస్సీ (గోల్డ్ ఫింగర్), ఎరిక్ క్లాప్టన్ - పాడిన పాటలున్నాయి. ఈ సిడి ఖరీదు 12.99 పౌండ్లు. డివిడి అయితే 19.99 పౌండ్లు.

## రోలింగ్ స్టోన్ మిక్ జాగర్‌కి 'సర్' బిరుదం

"రోలింగ్ స్టోన్స్" బ్యాండ్‌కి చెందిన మిక్ జాగర్‌కు బ్రిటన్ ప్రభుత్వం ఈ ఏడాది "సర్" బిరుదంతో సత్కరించబోతోంది. 58 ఏళ్ల జాగర్‌కు ఈ గౌరవం లభించడంపై చాలా విమర్శలు



వచ్చాయి. "ఐ కాంట్ గెట్ నో", "బ్రౌన్‌షుగర్", "సింపతీ ఫర్ ది డెవిల్", "జంపింగ్ జాక్ ఫ్లాష్" వంటి పాటల ద్వారా జాగర్ ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్న మాట వాస్తవమే అయినా డ్రగ్స్ వాడకం, అమ్మాయిలతో తిరగడం వంటి అనేక వివాదాలలో ఇరుక్కోవడం వల్ల ఈ పరిస్థితి దాపురించింది. రోలింగ్ స్టోన్ జీవితచరిత్ర రాసిన ఫిలిప్ నార్మన్ అయితే జాగర్ పేరును రికమెండ్ చేసినందుకు బ్రిటన్ ప్రధాని బ్లయర్‌ను దుయ్యబట్టారు. ఇలాటి పాప్ స్టార్స్‌కు నైట్ హుడ్ ప్రసాదించి మామూలు ప్రజల మధ్య చీప్ పాపులారిటీ కోసం బ్లయర్ ప్రయత్నిస్తున్నారని విమర్శించారు.






విడుదల: హెచ్.ఎం.వి
వెల: రూ. 80/-

తెలుగువారు గర్వంగా చెప్పుకోగల గాయని పి. సుశీల యాభై ఏళ్ళ సినీ జీవితాన్నిపురస్కరించుకుని హెచ్.యమ్.వి. వారు 'స్వర్ణోత్సవ గాయని పి. సుశీల' పేరిట ఓ డబుల్ ప్యాక్ క్యాసెట్లను విడుదలచేశారు. ఏమని పాడెదనో (భార్యాభర్తలు), గోదారిగట్టుంది (మూగమనసులు), మామిడికొమ్మ మళ్ళీ మళ్ళీ పూయునులే (రాము), గుండెఝల్లు మన్నది (ప్రాణమిత్రులు), అందెను నేడే అందని జాబిలి (ఆత్మగౌరవం), నినువీడని నీడను నేనే (అంతస్థులు), ఇది మల్లెల వేళయని (సుఖ దుఃఖాలు), దరికి రాబోకు రాబోకు రాజా (నర్తనశాల), అమ్మ కడుపు చల్లగా (సాక్షి), మొక్కజొన్న తోటలో (అదృష్టవంతులు), మనసే కోవెలగా (మాతృదేవత), పాండవులు పాండవులు తుమ్మెదా (అక్కా చెల్లెలు), అందాల పసిపాప (చిట్టి చెల్లెలు), మల్లెపందిరి నీడలోన జాబిల్లీ (మాయదారి మల్లిగాడు) పాటలు క్యాసెట్ నం.1 లోనూ.... నీ మది చల్లగా (ధనమా-దైవమా), మనసా కవ్వించకే నన్నిలా (పండంటి కాపురం), వ్రేపల్లె వేచెను (శారద), వస్తాడు నారాజు ఈరోజు (అల్లూరి సీతారామరాజు), ఎవరు నేర్పారమ్మ ఈ కొమ్మకు (ఈనాటి బంధం ఏనాటిదో), చిన్నమాట (మల్లెపువ్వు), గలగల కలకలా (పొట్టేలు పున్నమ్మ), రాయినైనా కాకపోతిని (గోరంత దీపం), నిన్నటి దాకా శిలనైనా (మేఘసందేశం), ముత్యమంత పసుపు ముఖమెల్ల ఛాయ (ముత్యాలముగ్గు), రారయ్య పోయిన వాళ్ళు (గాజుల కిష్టయ్య), జోరు మీదున్నావు తుమ్మెదా (శివరంజని), ఎంత మధురం (మహాత్ముడు) పాటల క్యాసెట్ నం.2 లోనూ పొందుపరచారు.

మొత్తం ఈ 27 పాటలూ తెలుగు ప్రేక్షక శ్రోతలకు చిరపరిచితాలే! ఇందులో చాలా వరకూ టాప్ హిట్సే! అయితే చాలాకాలం వరకు దాచుకోదగ్గ సత్తా ఉన్న పాటల శాతం కూడా గణనీయంగానే ఉంది. మంచి కలక్షన్స్‌ని మెయిన్‌టెయిన్ చేసేవారి కోసం అన్నట్టుగా ఇటీవల వినమరుగై పోతున్న కొన్ని పాటలు చోటు చేసుకోవటం కూడా బావుంది. నిజానికి సుశీల ప్రతిభాపాటవాలను ప్రతిబింబింపజేయగల పాటలను క్యాసెట్ల రూపంలో తీసుకు రావాలంటే 10ప్యాక్ కూడా సరిపోదు. కానీ అలా ఒకేసారి 10 ప్యాక్‌ని మనవాళ్ళు అంతసులువుగా కొనరు కనుక ఇలా రెండు రెండు ప్యాక్‌ల చొప్పున రిలీజ్ చెయ్యటమే ఉత్తమం. అంచేత వరస వాల్యూమ్‌లుగా విడుదల చేస్తూ పాటలు రిపీట్ కాకుండా చూసుకోగలిగితే శ్రోతలకు హెచ్.యమ్.వి. మహోపకారం చేసిన వారవుతారు. సుశీల వంటి గాయనికి కనీసం 'పద్మశ్రీ'నైనా తెప్పించుకోలేని మనం ఇలాంటి వాల్యూమ్‌లు మరిన్ని రావటానికైనా కృషిచేస్తే అలాగైనా ఆవిడని గౌరవించుకున్న వాళ్ళమవుతాం.

---

ఇటీవల దక్షిణాదిలో విపరీతమైన క్రేజు సృష్టించిన 'జెమిని' తమిళ చిత్రంలోని "ఓ... పోడు' పాట ఓ ఊపు ఊపేసింది. ఆ పాట ద్వారా సంగీత పరిశ్రమ అంతా ఒక్కసారి తన వైపు చూసేట్టు చేసుకున్న భరద్వాజ్ సంగీత దర్శకత్వం వహించిన 'రోజాపూలు' సినిమా క్యాసెట్ విడుదలయింది. 'సొగసు చూడతరమా' చిత్రం ద్వారా పరిచయం అయిన రమణీభరద్వాజే ఈ భరధ్వాజ్. ఈ 'రోజాపూలు' చిత్రంలోని పాటలన్నిటినీ రాసింది భువనచంద్ర.

'ముద్దుముద్దు రోజావే' పాట వినగానే ప్రాణం లేచొస్తుంది. దానికి కారణం హాయిగా వున్న ట్యూనూ, మరింత హాయిగా వినిపింపజేసిన బాలు టోనూ! కార్తిక్ బృందం పాడిన 'కాలేజ్ రూట్‌లో లేడీస్ కాలేజ్ రూటులో' పాటని వింటుంటే యూత్ సాంగ్స్ పేరిట ఇప్పుడొస్తున్న పాటలు ఈ పాటని వింటే తమ రూటుని మార్చుకుంటాయనిపిస్తుంది. మాల్‌కౌస్ రాగం ఆధారంగా మలచబడ్డ ఈ గీతంలో - నీలాంటిపిల్ల భూమికి మళ్ళీరాదు / ఒక వేళ వస్తే సృష్టికి అర్థం లేదు' అనే ఎక్స్‌ప్రెషన్ సాహిత్యపరంగా బావుంది. టిప్పు పాడిన 'చెలియా చెలియా సిగ్గెందుకు' పాట - బీట్ సాంగ్స్‌కి విదేశాల నుండి ట్యూన్స్‌ని దిగుమతి చేసుకోనవసరం లేదని మన క్లాసిక్ రాగాలతోనే అద్భుతంగా చేసుకోవచ్చని నిరూపిస్తుంది. ఈ పాటకి 'కాగడ' రాగం ఆధారం. బాలసుబ్రహ్మణ్యం, స్వర్ణలత పాడిన 'ముచ్చటగా ముచ్చటగా మురిపించే విరులారా' పాటకి హాంటింగ్ ట్యూన్ జత పడింది.



విడుదల: సుప్రీమ్
వెల : రూ.35/-

ఏ సైడు బాలు పాడిన 'ముద్దు ముద్దు రోజావే' పాటే కొద్దిపాటి సాహిత్యం మార్పులతో జీన్స్ శ్రీనివాస్ బృందం పాడగా బీ సైడున తొలి పాటగా వస్తుంది. రెండు పాటలనీ కలిపి ఒకదాని తరువాత ఒకటి వింటే - కంఠాలు రెండూ మంచివే అయినా రెండో కంఠంలో ఎంత ఫ్రెష్‌నెస్ ఉన్నా మొదటి కంఠంలో ఉండే డెప్త్, స్పష్టత ఎన్ని మంచి మార్కులు తెచ్చిపెడుతుందో తెలుస్తుంది. మనో, అనూరాధ శ్రీరాం పాడిన 'సుబ్బమ్మా సుబ్బమ్మా సూళ్ళురు సుబ్బమ్మా' పాట గొప్పపాట కాక పోవచ్చు కానీ వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించని హుషారు గీతంగా పేర్కొనవచ్చు. పిల్లనగ్రోవిని వాయించే ప్రియుడు ఇష్టమా కొత్త ప్లాటు రాసిచ్చే మగాడు ఇష్టమా' అని అంటే ఒద్దనదానికి 'ఫ్లూటొద్దు ఫ్లాటొద్దు' అంటూ కాయిన్ చేయడం సాహిత్యపరంగా తమాషాగా ఉంది. మనోపాడిన 'యాపిల్ పిల్లా నీవెవరో ఐస్‌క్రీం చెలియా నీవెవరో' పాట పల్లవిని చూడబోతే టీజింగ్ సాంగ్‌లా వుంటుంది. కానీ తర్వాత వచ్చే సాహిత్యం, పాట సమకూర్చబడిన ట్యూను అలా అనిపించనివ్వవు. ఇది కూడా వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించని పాటే....! మొదటి చరణంలోని 'శ్వాసలతో నిను తడిపెయ్యనా' అనే ఎక్స్‌ప్రెషన్ 'ఆవిరి భాష్పప్రయోగం'గా అనుకుంటే మాత్రం కొత్తగా ఉందని చెప్పక తప్పదు. టోటల్‌గా మెలోడి ఓరియంటెడ్ సాంగ్స్ ఇందులో ఎక్కువగా చోటుచేసుకున్నాయి.

**రచన: పోతుల రవికిరణ్ — 1 — గానం: బాలు,ఉష**

ప/ఆ: రెండువేల రెండు వరకు చూడలేదే ఇంత సరుకు
సోకుల్తో వచ్చేసింది సూదుల్తో గుచ్చేసింది
చినుకుల్తో చిందేసిందీ జివ్వంటు లాగేసింది
ఆ: పోకపోక తోటకెళితే
వేటగాడు వెంటపడితే
బాణంతో పువ్వొచ్చింది ప్రాణంతో గోడవొచ్చింది
రవ్వంత నొప్పేసిందీ మువ్వలతో ముద్దేసింది
అ: ఊరించి ఓ మెరుపు రాగాలు తీస్తుంటె
ఉడికించి ఓ చినుకు గారాలు పోతుంటె
ఊరించి ఉడికించి వొడిలోకి రానంటె (2)
ఊగిందె నీ నడుము తడియారి పోతుంటె
ఆ: కోరింది నీకిచ్చుకుంటె చలి ఆటలే ఆడుకుంటె
ఊరుకుంటె జారుకుంటె
ఆకుచాటున్న పిందల్లె నేవుంటే ॥రెండువేల॥
చ/ఆ: మత్తొచ్చె నీచూపు మత్తెక్కి పోతుంటె
మత్తొచ్చి నాకేమొ మత్తెప్పిపోతుంటె
ఆ మత్తు మసకల్లో పొద్దే గడిపేస్తుంటె(2)
నీ మత్తు మాటల్తో వెన్నే సలిపేస్తుంటే...
అ: ఈ వానలో కన్నుగీటి
రసవీణలా నిన్ను మీటి
వరస తెలిసి వయసు కురిసి
మనసు లోతుల్లో ఉయ్యాల లూగాలీ ॥రెండువేల॥

**రచన: పోతుల రవికిరణ్ — 2 — గానం: కార్తీక్, కౌసల్య**

ప/ఆ: బొడ్డునుచూడయ్యో బొంగరమాడయ్యో
తిమ్మిరిగుందయ్యో చిన్నిరామయ్యో
అ: బొడ్డునుచూసొతే బొంగరమేస్తానే
తిమ్మిరి తీరేలా మంతరమేస్తానే
ఆ: అందమంత ఆరేసీ ఆగలేనయ్యో
ఉన్నదంత ఊరేసీ వేగలేనయ్యో
అ: వొంపులన్నీ అరిగేలా
కెంపులన్నీ అరిచేలా
అల్లుకోన గిల్లుకోన ఒక్కసారి అమ్మమ్మమ్మొ ॥బొడ్డును॥
చ/ఆ: రమ్మంటె రానంటావు ఇమ్మంటె లేదంటావు



నిన్ను చూసి ఆగనంది ఈ వయసు
అ: స్వీటే హాటుగుంది మాటే ఘాటుగుంది
అయ్యారే... వయ్యారే... నేనింకా... తయ్యారే ॥ఒప్పుల॥
చ/ఆ: చిలిపి ఆటలకు వస్తావా
కౌగిలింతలకు ఇస్తావా
ఆ: కొట్టకు కన్నూ...
కో: హోయ్... హోయ్
ఆ: కొట్టకు కన్నూ చంపకు నన్నూ
చూపుతో... షాకుతో...
అ: సన్నజాజి పందిరుంది సరదాగా
వెన్నెలమ్మ వాలుతోంది పరదాగా
ఆ: నువ్వే ఎస్సు అంటె నేనే కస్సుమన్న
ఆ బుగ్గా... ఈ బుగ్గా... లాలిస్తా... తీరిగ్గా ॥ఒప్పుల॥

**రచన: పోతుల రవికిరణ్ — 6 — గానం: మనో, ఉష**

ఈ టౌను నాదిరా... ఈ గౌను నాదిరా...
ఈ పిల్లనాదిరా... పిల్ల తల్లి నాదిరా...
ప: జడకు జడా మెడకు మెడా
అదిరిపడే ఎడాపెడా
శాలిబండ సోకులాడిరో ॥జడకు॥
ఈ వెండి పళ్లెంలో ఆ వెన్నపూసెట్టీ
దానిమ్మరసంలో జలకమాడిన వయ్యారిరో
చ: ఏమి బువ్వ తిన్నదిరో ఏపుగ వున్నాది
నాటుకోడి పులుసులాగ మోతగ వున్నాది
ఈడు చిన్నదయినా ఒణికిస్తోంది
జోడుకోరుకుంటూ రంకేస్తోంది
చురుకైన కళ్ళురో ఇరుకైన ఒళ్ళురో
మెరుపంటి పిల్లరో మరి అదేసిరి సరేసరే ॥జడకు॥
చ: ఏడ పుట్టి వున్నాడో పిల్లకు మొగుడు
ఎతికి తెచ్చుకోవయ్యా తల్లి మొగుడా
మంచి లగ్గం చూసి ముడిపెట్టెయ్యి
పట్టిమంచంవేసి గెడపెట్టెయ్యి
ఇది పాలబొమ్మరో
మురిపాల గుమ్మరో
అరుదైన జన్మరో
మరి సరే సరీ చలోపిల్లో ॥జడకు॥



**రచన: భువనచంద్ర — 1 — గానం : బాలసుబ్రహ్మణ్యం**

ప: ముద్దు ముద్దు రోజావే... ముద్దులొలుకు రోజావే ప్రేమబంధమే...నీదీ...
కలలుగన్న రోజావే... కలత విడిన రోజావే వింతబంధమే... మనదీ...
నీ ఆరాటం... నా సహకారం... విధి ఆట ఇదే
అనుకోనా నేస్తమా... రోజాపువ్వా రోజా రోజాపువ్వా
సొగసరి రోజాపువ్వా... వాడని రోజాపువ్వా... ॥రోజా॥
చ: దూరానున్నా దూరం తెలియని వలపే ఒకస్వర్గం
పక్కనెవున్నా... దూరం తరగని బ్రతుకే ఒక నరకం...
పెదవులపైనా... చిరునవ్వున్నా... ఎదలో ఒక మౌనం
నీ కలలకు... నే... కావలినైనా... నా కలలను నీ కళ్ళల్లో చూడనీ... ॥రోజా॥
చ: కన్నులలోని... నిదురను నీకు... కానుకే ఇచ్చెయ్‌నా...
నాలోవున్న ప్రేమని చెలియా... ఎదలో దాయెచ్‌నా...
నీకై నాలో ప్రాణం నిలిపే... నన్నే... మరిచానే...
నీ సేవలకే... చెలి నేనున్నా... నా హృదయంలో నీ స్థానం చెరగదే... ॥రోజా॥

**రచన : భువనచంద్ర — 2 — గానం : కార్తిక్, కోరస్**

ప/అ: థేంక్యూ భగవాన్లూ...
కాలేజ్ రూటులో లేడీస్ కాలేజ్ రూటులో
ఒక ముద్దు ముద్దు రోజాపువ్వుని చూశా...
నన్నే మరచి... చిట్టి మనసే పరిచీ...
ఆ పిల్ల మీదో నాటీలుక్కు వేశా...
వాహ్... వా... వాటే లవ్‌లీ లేడీ... నాలో... రగిలిందయ్యో వేడీ...
చెయ్యిపట్టేలోగా సూపర్ ఫిగరు మాయం అయ్యిందే...
చ: లోకంలో అందాలన్నీ దోచుకున్న మగువ ఆనందం తనలో దాచుకున్న చెలియ...
కో: కంట్లో పడ్డది నేస్తం... తను మెరిసే సూర్యరథం
ఇంకాసేపు చూస్తే... మతిపోవుటే ఖాయం
అ: ఒక్కొక్క పిల్లకి ఒక్కోచోట అందం నా కన్నె పాపలో అందాలే అనంతం
చినదాన్ని చూస్తే... ముఖమంతా వెలుగు తనగొంతు వింటే... ఒళ్లంతా కైపు
చెలివుండే వీధికి దీపాలేలా... ఏలా... తోడుంటే చాలును స్వర్గాలేలా...? ॥కాలేజ్॥
చ: ఆకాశంలో కోటి నక్షత్రాలని కలిపీ వెన్నెలతో వాటిని వయ్యారంగా కడిగీ
కో: అయ్యో బ్రహ్మ శుచిగా... చెలి కళ్లని మలిచాడో
నల్లని మబ్బులతోటి... కనుపాపలు చేశాడో
అ: ఓ.కె. అంటే ఆమె మనసులో వుంటా... నో నో అంటో నా ప్రాణాలే వదిలేస్తా...
స్వర్గాలెన్నో వున్నె ప్రేయసి ఒడిలో... చోటుంటుందా నాకు ప్రేయసి మదిలో...
ఇట్టాంటి పిల్ల మళ్ళీ భూమికి రాదూ... రాదూ...
ఒకవేళ వస్తే సృష్టికి అర్థం లేదూ... ॥కాలేజ్॥



అ/కో: ఇక్కడ ఉందంతా పిల్లా అక్కడ పెట్టెయ్‌నా ఇబ్బడి ముబ్బడిగా
పిల్లా జబ్బలు గిచ్చెయ్‌నా...
ఆ/కో: చింతలపూడి షరాబూ... చెల్లదురా నీ రుబాబు...
దమ్మున్నోడె నవాబూ... అది లేనోడె గరీబు...
చ/ఆ: కొత్త చీరెలతో... కొంటె మాటలతో... ఆడది ఎన్నటికీ సంతోషపడదోయ్
కమ్మగ దరిచేరి కోరిన దిచ్చేసి ఒళ్ళో పడుకుంటే నిన్ను వీడదోయ్...
అ: ఆ ఒడిని చేరీ పడక లేసే వివరమెందుకులే... నీ...
మనసు దోచే మార్గమేదో చెబితే చాలునులే...
ఆ: నలుగురిలోనూ... పెళ్ళాం పరువు నిలిపే వాడినే
ఆడది కోరేనయ్యా... వినుకోవయ్యా...

**రచన : భువనచంద్ర — 7 — గానం : మనో**

ప/అ: యాపిల్ పిల్లా నీవెవరో ఐస్క్రీం చెలియా నీవెవరో
కళ్ళల్లోన మెదిలే కలవే నీవా
పుత్తడి పువ్వా నీవెవరో పచ్చని చిలకా నీవెవరో
మోహంలో నను ముంచిన మగువా రావా...
నవ్వుతూ మత్తుజల్లి... దూరమై పోవద్దే
ప్రియా నీ వెంట వస్తే... ఎవరు నువ్వనవద్దే
ఏదో ఒకనాడు సఖియా... నీ ప్రేమే దొరకునని
ఇలాగే వేచివుంటా...నన్నిక ఆపొద్దే...
చ: మనసున తలచీ... కళ్లను మూసీ... కలగన్నాను కనపడలా...
మౌనంగా నా గుండెని గిల్లావ్ అయ్యోఅయ్యో ఎందుకిలా...
నన్నేతాకి అల్లరిపెట్టిన చిరుగాలెక్కడ దాగినదే
తుంటరి పైటకి ముద్దులు పెట్టి నాలో విరహం రేపినదే
అందాలూరే చిలకమ్మా - శ్వాసలతో నిను తడిపెయ్‌నా
ఆకాశంలో దాగున్నా - ఎన్నడు నిన్ను విడనమ్మా
నిను చేరకపోతే జీవితమంతా వ్యర్థం అయిపోదా...
ఏదో ఒకనాడు సఖియా - నీ ప్రేమే దొరకునని
ఇలాగే వేచివుంటా... నన్నిక ఆపొద్దే ॥యాపిల్॥
చ/అ: పిల్లా నీకై పరుగులు పెడితే లవ్ యు లవ్ యు అంటావా
పాపం అయ్యో పిచ్చోడంటూ పక్కకి తిరిగి నవ్‌తావా
ఊహల తలుపులు నువు తెరిచేస్తే ఊపిరి నేనై వచ్చెయ్‌నా
ముచ్చటగా నువు ఓ.కె. అంటే ఒళ్లో డేరా వేసెయ్‌నా
యస్ అని నువ్వు చెప్పేస్తే పాదం మీదే పడిపోనా
లేదూ కాదూ అన్నావో చెలియా బ్రతుకుట నాతరమా
నేనింకొక సారి మళ్ళీ పుడితే నిన్నే ప్రేమిస్తా...
ఏదో ఒకనాడు సఖియా... నీ ప్రేమే దొరకునని
ఇలాగే వేచివుంటా... నన్నిక ఆపొద్దే... ॥యాపిల్॥

రచన : చైతన్యప్రసాద్ **4** గానం : రవివర్మ, ఉష

రుక్కుమిణి రుక్కుమిణి రుక్కుమిణి
నన్ను చెయ్యమంది పట్టపగలు కొంటిపని
లుక్కులోని ఎక్సరేటు పెంచుతోంది పల్సుబీటు
లిప్స్ రెండు మిక్స్ చేయమన్నదీ
నన్ను పెళ్లి డేటు ఫిక్సు చేయమన్నదీ
చ/అ: ఇది ఎర్రని మామిడి బద్దరా
రుచి చూడక పట్టదు నిద్దరా
మమకారం ఘాటుకు మతి పోతోందమ్మో నా రుక్కుమిణి
ఆ: మురిపాలను వేడిగా కాగనీ
మది మీగడ తోడుగా వెయ్యనీ
ప్రతి ముద్దుకు ముద్దును కమ్మగా కలపనీ
అ: నాకు కంచమైన మంచమైన లంచమియ్యి
ఆ: దోర కోరికంత కొంచమైన పంచనియ్యి
అ: దీప మారినాక అందమంత హారతియ్యి రుక్కుమిణీ ॥రుక్కుమిణి॥
చ/అ: చిరుగజ్జెల గుర్రం రుక్కుమిణీ
జలపాతం దూకుడు రుక్కుమిణీ
చిరునవ్వుల చాకుతో గుండెను కోసేదే నా రుక్మిణ్
ఆ: నిను వలచిన చిన్నది రుక్కుమిణీ
నువు పిలిచిన వస్తది రుక్కుమిణీ
నువ్వంటే తెగపడిచస్తదీ రుక్మిణీ
అ: ఈడు తోడు పెట్టి తెచ్చెనాకు రుక్కుమిణీ
ఆ: సోకు కూడబెట్టి ఇచ్చెనీకు రుక్కుమిణీ
అ: కోడి పెట్టపుంజు ఆటకింక సిద్ధమందీ రుక్కుమిణీ ॥రుక్కుమిణీ॥

రచన :చైతన్య ప్రసాద్ **5** గానం : ఆర్పీ పట్నాయక్, ఉష

ప/అ: ఒప్పుల కుప్పా వయ్యారి భామా ఓ చందమామా
ఆ: తప్పదు అంటే ఎట్టాగయ్యా తారక రామా
అ: నీకు గుద్దులు కావాలా లేత ముద్దులు కావాలా
ఆ: కోడె గిత్తల దూకుడులో ఈడు అల్లల్లాడాలా
చ/ఆ: కనులు మూసినా నీ రూపం కలలై విసిరెను విరిచాపం
అ: చెంపకు చుమ్మా...
కో: హొయ్... హొయ్...
అ: చెంపకు చుమ్మా ఇస్తా లేమ్మా చెంతకే చేరనీ
ఆ: నిన్న మొన్న మాట విన్న ఈ మనసు



ఇస్తుంటె వద్దంటావు ఎప్పటికప్పటికె
ఆ: రమ్మంటు ఊరిస్తావు ఇమ్మంటు ఉడికిస్తావు
ముద్దంటె పడిచస్తావు ఎక్కడికక్కడికె
అ: పట్టుకున్నా పత్తేమో మల్లెకన్నా మత్తేమో
ఆ: చెప్పుకున్నా సిగ్గేమో చెప్పకున్నా అగ్గేమో
అ: అంతలోనె ఇంతసిగ్గ చెప్పగానె అమ్మమ్మమ్మొ
చ/ఆ: పట్టిందె పట్టంటావు కట్టిందె చీరంటావు
కట్టిందె బాగుంటావు అక్కడికక్కడికె
ఆ: ఒట్టంటె ఊ అంటావు బెట్టంటె రా అంటావు
హద్దంటె లేదంటావు ఇక్కడికిక్కడికె
అ: ఒక్కటయ్యే ఇద్దర్లో లక్షలయ్యే ముద్దర్లూ
ఆ: దిక్కులయ్యే చప్పట్లో చెప్పకయ్యే ముచ్చట్లూ
అ: ముద్దుగుమ్మా ముద్దుగుమ్మా ముద్దుకుముద్దుముద్దనవమ్మో... ॥బొడ్డును॥

రచన : చైతన్య ప్రసాద్ **3** గానం : ఆర్పీ పట్నాయక్, ఉష

అ: చెలియా... చెలియా... చెలియా చెలియా
చెంత చేరి జంట కడితె చలియా గిలియా
ఆ: మదనా... మదనా... సుందర వదనా
కన్నుగీటి పిలవగానె పరుగున రానా
అ: ప్రియురాలు ఇచ్చింది పెదవి లంచమూ
ఆ: దొరగారి కౌగిలే నా ప్రపంచమూ
అ: రస సీమలో చేయనా పరిపాలనం ॥చెలియా॥
చ/అ: వయ్యారి ఈ చిన్నదీ - పడకటింటి కయ్యాని కొస్తున్నదీ
ఓరయ్యొ కామయ్యొ ఏం చేసినావయ్యొ నాకేదో ఔతున్నదీ
ఆ: మనసైన మగధీరుడు - అయ్యయ్యో అయ్యాడు సుకుమారుడు
నీ ప్రేమ పాఠాలు నీ చేతి వాటాలు నే చేసి చూపించనీ
అ: యతికూడ మతిపోయి జతకోరగా
రతియోగ మంత్రాలు జపియించగా
ఆ: ఈ పిల్లదీ అల్లరి చేస్తోందిలా ॥చెలియా॥
చ/అ: జేగంట మోగించనీ - చిన్నదాన్ని జాగారం చేయించనీ
లేలేత అందాల గంధాలు తీయించి గ్రంథాలు రచియించనీ
ఆ: నా ముడుపు చెల్లించనీ - చెప్పరాని పాఠలు వల్లించనీ
శ్రీ గీత గోవింద శృంగార శ్లోకాల గానాలు సాగించనీ
అ: కన్నయ్య అలివేణి ఆ రాధికా చాలయ్య పోవయ్య అనరాదిక
ఆ: మది మురళి నీ సరళిలో రవళించరా ॥చెలియా॥



నెచ్చెలి ప్రియవచనం... ఆశలె రేపెనమ్మా...
ఆ: నదిని నేను కడలివి నీవూ నీలో నన్ను చేర్చుకో
అలలవంటి అనురాగాన్నీ నాతో నువ్వు పంచుకో
అ: నిను చూసిన క్షణమే నా హృదయాన్ని
అర్పించేశా ప్రాణమా... ॥ముచ్చటగా॥

రచన : భువనచంద్ర **5** గానం : జీన్స్‌శ్రీనివాస్, కోరస్

ప: ముద్దు ముద్దు రోజావే
ముద్దులొలుకు రోజావే... మౌనమేలనే నీకూ...
నీవులేక నే లేనే... బ్రతికివుంటె నీతోనే
నీవె సర్వమే... నాకూ...
నీ కళ్లల్లో... నే దాగుంటా... నీ పెదవులపై చిరునవ్వై
ఒదగనీ... రోజాపువ్వా... తాజా రోజాపువ్వా
సొగసరి రోజాపువ్వా... వాడని రోజాపువ్వా
చ: ప్రేమేలేని లోకంలోనా... చీకటే వుంటుందే...
ప్రేమేవుంటే నరకం అయినా... స్వర్గమైపోతుందే
తల్లి తండ్రి గురువూ... నేర్పనివెన్నో... ప్రేమే నేర్పునులే
నా ప్రియసఖియా... నీ సొగసులతో...
చిరునగవులతో నా ప్రాణం తీయకే... ॥రోజాపువ్వా॥
చ: వలపుని గెలిచే బ్రతుకే ధన్యం... ప్రేమే సర్వస్వం
వలపుని మరిచే బ్రతుకే వ్యర్థం... ఎందుకో ఆ జన్మం
ప్రేమతో బ్రతికే ఒక క్షణమైనా...
అమరమే చిన్నారీ...
ఆ తొలివలపే... నా ఎద పిలుపై
నిను కదిలిస్తే నా ప్రేమే, సత్యమే... ॥రోజాపువ్వా॥

రచన : భువనచంద్ర **6** గానం : మనో, అనురాధాశ్రీరాం

ప/అ: సుబ్బమ్మా... సుబ్బమ్మా... సూళ్ళూరు సుబ్బమ్మా... నువు
చెప్పమ్మా చెప్పమ్మా... ఓ యవ్వారం చెప్పమ్మా...
ఆడోళ్లకి మగాడిలో ఏది ఇష్టమో... అదీ ఆడమనసు విప్పి
కాస్త చెవిలో వెయ్యమ్మా...
ఆ: పువ్వులా ఇచ్చేటి ముద్దు ముఖ్యమోయ్...
అరే పరువాలతో సాగించే యుద్ధమిష్టమోయ్...
లాలీ ప్రేమ ముఖ్యమోయ్ గురూ... అందం... అంటే ఇష్టమోయ్...
చ/అ: మైసూర్ పాకుల్ని... ఏలూర్ అరిసెల్ని వేడుకగా తెచ్చే వాడు ముఖ్యమా...
ఆ: మైసూర్ పాకంటి మనసుని ఇచ్చేస్తే మగువల మనసులకీ ఎంతో ఇష్టమోయ్...
అ: హేయ్... పిల్లనగ్రోవి వాయించే ప్రియుడు ముఖ్యమా లేక
కొత్త ప్లాటు రాసిచ్చే మగడు ఇష్టమా...
ఆ: ప్లాటొద్దమ్మా... ప్లాటొద్దమ్మా... గుండెల్లో నమ్మకమే ఉండాలమ్మా అదె చాలమ్మా...





రచన : భువనచంద్ర **3** గానం : టిప్పు

ప/అ: చెలియా చెలియా సిగ్గెందుకే... జతగా ఒకటై పోదామటే...
చలిగిలి ముదిరిన వేళలో... బిగిబిగి కౌగిలిచాలునే
రావె నెరజాణా... కొంటె కుర్రదానా... వస్తె ఐసైపోనా...
రావె నెరజాణా... వస్తె ఐసైపోనా...
రావేనా... కోమలీ... రావే నా గులాబీ కలీ... రెచ్చిందే ఆకలీ...
ఇచ్చెయ్‌వే బిగి కౌగిలి... రావేనా నవమోహినీ...
రావే నా జనరంజనీ... ॥చెలియా॥
చ: గువ్వాగువ్వా నువ్వునవ్వకే... నువ్వు నవ్వావంటే వయసు ఆగదే...
నడుమా... నడుమా... నువ్వు ఊగకే... నువ్వు ఊగావంటే శివరాతిరే...
నీవెంటే నేనూ వుంటా... నువు చెప్పిందల్లా చేస్తా...
యు లవ్ మి రాజా అంటే ప్రాణాలే రాసిచ్చేస్తా...
నీ ప్రేమకోరినానే... నను దయతోటి చూడవే...
రావె సుకుమారీ... చిట్టి చిన్నారీ... వస్తె ఐసైపోనా...
రావె సుకుమారీ... కిస్సేకొట్టేసెయ్‌నా...
చ: పిల్లా పిల్లా పైట జార్చకే... జార్చి మోహంలోన నన్ను ముంచకే...
రవికా రవికా రంకెలేయకే... వేసి... కొంచెం కొంచెం నన్ను చంపకే...
మగసిరితో పోటీకొస్తే... నీ సొగసే లూటీ చేస్తా - నా
మనసుతో ఆటాడేస్తే... నీ తనువుని కాటేసేస్తా...
నకరాలు మానుకోవే... నా... సరదాలు తీర్చవే...
ఓసి ప్రియురాలా... తాజా రోజాలా... వస్తే చిత్తైపోనా
ఓసి జవరాలా నిన్నే దోచేసెయ్‌నా...

రచన : భువనచంద్ర **4** గానం : బాలసుబ్రహ్మణ్యం, స్వర్ణలత

ప/అ: ముచ్చటగా... ముచ్చటగా... మురిపించే విరులారా
కమ్మగా నిదురించే చెలియని పిలవొద్దూ
మెత్తని మీ పిలుపులకీ... మగువ కల చెదిరేనూ...
నెచ్చెలి కల చెదిరిందో... నా హృదయం నీరవదా
ఆ: ముచ్చటగా... ముచ్చటగా... మురిపించే విరులారా
నను తలచీ నిదురించే సఖుడిని పిలవొద్దూ
మెత్తని మీ పిలుపులకీ... ప్రేమకల చెదిరేనూ
అతని కల చెదిరిందో... నా హృదయం నీరవదా...
చ/ఆ: నీవొక పూవిస్తే... నా ఎదలో దాచుకుంటా...
వాడిన పూవులనీ... పయ్యెదగా మలుచుకుంటా
అ: నీ కళ్ల వాకిలి ముందు నిదురను నేనై వాలనా...
తెల్లార్లు మాటే వేసీ మనసును దోచుకుపో... నా...
ఆ: నీవొస్తే చాలోయ్ చినవాడా... నీ
వూపిరి నేనై వుంటా... ॥ముచ్చటగా॥
చ/అ: నా చెలి మధురస్వరం... ఎదనే తాకెనమ్మా...

ఫ్రెండ్లీ మూవీస్



# అల్లరి రాముడు



బి. గోపాల్



చంటి అడ్డాల



ఆర్.పి. పట్నాయక్



పోతుల రవికిరణ్



చైతన్య ప్రసాద్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ-మాటలు-స్క్రీన్‌ప్లే | : పరుచూరి బ్రదర్స్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | : కె. రవీంద్రబాబు |
| సంగీతం | : ఆర్.పి. పట్నాయక్ |
| ఎడిటర్ | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఫైట్స్ | : విజయ్ |
| డ్యాన్స్ | : రాఘవేంద్ర లారెన్స్ బృందం, అమ్మరాజశేఖర్ |
| పాటలు | : పోతుల రవికిరణ్, చైతన్య ప్రసాద్ |
| కో-డైరెక్టర్ | : కుర్రారంగారావు |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : పి. రామమోహనరావు |
| కాస్ట్యూమ్స్ | : రమేష్ |
| మేకప్ | : జోగారావు |
| స్టిల్స్ | : భారతీరాజా |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : పిడుగు సుబ్బారావు, వెంకటేశ్వరరావు, రాంబాబు |
| పబ్లిసిటీ డిజైనర్ | : రమేష్ వర్మ ( కిరణ్ పోస్టర్ యాడ్స్) |
| పి.ఆర్.ఓ | : యు. వినాయక రావు |
| నిర్మాత | : చంటి అడ్డాల |
| దర్శకత్వం | : బి. గోపాల్ |

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

యన్.టి.ఆర్., ఆర్తీఅగర్వాల్, గజాలా, నగ్మా, నరేష్, ఊర్వశి, కె.విశ్వనాథ్, పరుచూరి వెంకటేశ్వరరావు, యమ్మెస్ నారాయణ, ఎల్.బి.శ్రీరాం, జయప్రకాష్‌రెడ్డి, ఆహుతి ప్రసాద్, వైజాగ్ ప్రసాద్, వినోద్ బెనర్జీ, ప్రసన్న, కళ్యాణీ, మధు, అశోక్, కాదంబరి కిరణ్, రజిత, పావలాశ్యామల, అచ్యుత్, హారిత



## తారాగణం

శ్రీరాం, భూమిక చావ్లా, రాధిక, రఘువరన్, ఆకాష్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# రోజా పూలు

*The Feel Of Love*



భరద్వాజ్



భువనచంద్ర



సురేష్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : శ్రీరామకృష్ణ |
| పాటలు | : భువనచంద్ర |
| కెమెరా | : పన్నీర్ సెల్వం |
| పి.ఆర్.ఓ | : రాంబాబు వర్మ |
| పబ్లిసిటీ డిజైనర్ | : ఏలే ధని |
| సమర్పణ | : ఎమ్.చంద్రయ్య |
| నిర్మాత | : సురేష్ |
| దర్శకత్వం | : శశి |

జులై 10 కోట శ్రీనివాసరావు పుట్టినరోజు సందర్భంగా...

# ఆ వరం భగవంతుడు నా ఒక్కడికే ఇచ్చాడనుకుంటున్నా



కొంత మందిని ముందుతరం వారితో పోల్చటం కష్టం. ఒక్కొక్కర్ని పక్కన ఊహించుకుంటూ బేరీజు వేసుకుంటే - 'వారికన్నా ఈయన ఏం తక్కువ!?' అని అనిపిస్తూ ఉంటుంది. పోనీ తర్వాతి తరంలో చూద్దామా అంటే 'ఎవరు ఈయనకంటే ఎక్కువ!?' అని వెతుక్కోవలసివస్తుంది. సరిగ్గా అటువంటి నటుడే కోట శ్రీనివాసరావు. ఆయన నటన ఎంత నిత్యనూతనమో... ఆయనలోని హాస్య చతురత అంత నిస్సూత్నం. జులై 10 ఆయన పుట్టిన రోజుని పురస్కరించుకుని పాఠకుల తరపున **'హాసం'** పంచుకున్న ఓ అయిదు నిముషాల తమాషా కాలక్షేపంలో వెలువడ్డ సరదా సమాధానాలివి :

✡ కంకిపాడులో కంకిపాడవకుండా హాయిగా తింటూ ఉండే మీకు నటుడు కావాలన్న ఆలోచన ఎలా వచ్చింది..?

❁ చదువుకునే రోజుల్లోనే నటుడు కావాలన్న ఆలోచనకు పునాది పడిపోయింది. ఇక ఆ పునాది పాడవకుండా దాన్ని రాశి సిమెంట్‌లెవెల్లో కాంక్రీట్ చేసేసుకున్నాను. ఎందుకంటే నేను చదువుకున్నది 'పునాదిపాడు' స్కూల్లో కనుక.

✡ అలా అయితే హీరో వేషాలు వెయ్యకుండా విలనీలు, కారెక్టర్ ఆర్టిస్ట్ పాత్రలు.... మళ్ళీ అందులో కామెడీ మిక్సు... ఎంచేతంటారు...?

❁ ఎంచేతంటే ఎవ్రిబడీ నోస్ దట్ అయామె క్యారెక్టర్ యాక్టర్ బట్ అయామ్ యాన్ యాక్టర్ విత్ క్యారెక్టర్. కామెడీని మిక్స్ చేయటం కూడా ఆ క్యారెక్టర్‌లో భాగం.

✡ 'అబ్బా... ఈ సినిమాలు నేను చేయలేను'.... అని ఎప్పుడైనా మీకు అన్పించిందా?

❁ అనిపించింది. సినిమాల్లో కొడుకుపాత్రలు 'ఒరే డాడీ... ఓ పది వేలివ్వరా' అని అంటుంటే - చేతనైతే జిగ్గుమని ఒకటిచ్చుకుని 'తండ్రితో ఎలా ప్రవర్తించాలో నేర్చుకో' అని అనేట్టుండాలి. అలా చెయ్యలేని క్యారెక్టర్లు వచ్చినప్పుడు మాత్రం చెయ్యలేనని దాదాపోర్లనిపించింది. కొన్ని ఆఫర్స్‌ని వదులుకున్నాను కూడా...

✡ రిలీజైన సినిమాల మీద, వాటికి సంబంధించిన వారి మీద ఎప్పుడూ జోక్స్ చేస్తుంటారు కదా, అందులో మీకు నచ్చిన ఓ జోక్ ఏది... దాని మీద రియాక్షన్స్ ఏమిటి?

❁ ఓసారి ఓ నటుడి షూటింగ్‌లో సెట్‌నిండా రకరకాల ఫ్యాన్‌లు పెట్టి తీస్తున్నారు. 'ఏంటది?' అని అడిగేరు చూద్దానికి వచ్చినవాళ్ళు. 'ఆయనకి బైట ఫ్యాన్స్ అంతగా లేరేమో అందుకే షూటింగ్‌లోనే ఫ్యాన్స్‌ని ఏర్పాటు చేశారు' అన్నాను. ఇప్పటికీ ఆ జోక్‌ని తల్చుకుని ఎంజాయ్ చేస్తుంటారంతా. నాక్కూడా నచ్చిన జోక్ అదే...

✡ సినిమాల్లో మీరిప్పటిదాకా చెప్పిన డైలాగ్‌లలో మీకు నచ్చినది?

❁ 'కులం మతం అనేవి గజ్జి తామర లాంటివి. అసలవి టచ్ అవనే అవకూడదు. ఓసారి అంటుకున్నాయంటే మాత్రం గోక్కోడానికి జీవితం సరిపోదు' ఇదే నాకు నచ్చిన డైలాగ్

✡ 'అన్నలారా... అక్కలారా' అంటూ తెరమీద కొచ్చారు.... అదే డైలాగ్‌తో రాజకీయాల్లోకి కూడా వచ్చారు. రెండు సక్సెస్‌లకీ ఒకటే డైలాగ్... తల్చుకుంటే ఏమనిపిస్తుంది?

❁ బహుశా ఇలా ఏ నటుడికీ జరగలేదేమో... ఆ వరం భగవంతుడు నా ఒక్కడికే ఇచ్చాడనుకుంటున్నా...

✡ బి.జె.పి. గుర్తుతో ఎన్నికయ్యారు కదా కృతజ్ఞతా సూచకంగా వాజ్‌పేయి గార్కి ఓ మంచి అమ్మాయిని వెతికి పెళ్ళిచేయవచ్చు కదా...?

❁ నేను చెయ్యనండి. ప్రభుత్వం పడిపోతుందేమోనన్న భయం నాకు. ఎందుకంటే వయసుమళ్ళిన వారు అర్ధాంగిని కోరుకుంటే గద్దె దిగిపోవలసి ఉంటుంది.



✡ పార్టీల మధ్య మిత్రత్వంతో వారా చంద్రబాబు నాయుడు గారు 'నేనలా కొన్నాళ్ళపాటు ఫారిన్ తిరిగిరావాలి అందాకా సి.ఎం. గా ఉండు' అని అడిగితే?

☸ వచ్చేటప్పుడు అప్పుతీసుకొస్తానంటే మీ పదవి మీకు అప్పచెబుతానండీ అని అంటాను.

✡ **దావూద్ ఇబ్రహీంను వదిలిపెట్టడానికి మిమ్మల్ని అప్పగించాలని ముషారఫ్ కోరితే?**



☸ నా వల్ల దేశానికి మంచి జరుగుతుందంటే తప్పకుండా వెళ్ళిపోతాను. కాక పోతే ముషారఫ్ అటువంటి కోరిక కోరి తన పదవికి ముప్పు తెచ్చుకోడని నా నమ్మకం.

✡ **మీరెవర్నయినా ప్రేమించారా?**

☸ మననుకి ప్రేమించే వయసొచ్చేనరికి పెళ్ళయి పోయింది. అప్పట్నించి మా ఆవిడ్నే ప్రేమిస్తున్నాను మరి.

✡ **కల్పనారాయ్ లాంటి అమ్మాయి వచ్చి మిమ్మల్నే ప్రేమిస్తున్నానని, ఏమైనా సరే మిమ్మల్ని వదిలి పెట్టనని మొండికేస్తే?**

☸ వదిలించుకోవటం సాధ్యం కాదు కాబట్టి క్రేన్ కోసం ఫోన్ చేస్తా.

✡ **ఇంట్లో ఎప్పుడైనా కామెడీ చేసారా?**

☸ రోజూ చేస్తూనే ఉంటా... బైట చేసే తప్పులు కప్పిపుచ్చుకోడానికి.

✡ **మోనికాలెవినిస్కీ మీకు సెక్రటరీగా ఉంటానంటే...?**

☸ ఒద్దండీ... టెన్షన్ పెరిగిపోతుంది... మొత్తం జనం అంతా సైట్ కొట్టేస్తారు. ఆవిణ్ణి జాగ్రత్తగా చూసుకోడానికే టైమంతా సరిపోతుంది ఒద్దులెండి.



✡ **అందర్నీ కామెంట్ చేసే మీరు - మీ మీద ఓ కామెంట్ చేసుకోవలసివస్తే ఆ కామెంట్ ఎలా ఉంటుంది?**

☸ అయామ్ కోట
ఐ ఆల్వేస్ యూజ్ టాటా అండ్ బాటా
బై ఎయిర్ ఐ ట్రావెల్ బై డకోటా
బై రోడ్ ఆన్ టయోటా
ఎట్ టైమ్స్... ఆన్ డ్రింక్స్... ఐ డూ గలాటా
డిసీజ్ మై బయోడేటా...





తండ్రి దగ్గర వయొలిన్ నేర్చుకుంటూ...





తండ్రి వై.యన్. శర్మగారితో...



భార్య శ్రీవాణి, కుమారుడు మహతి స్వరసాగర్‌లతో...



# మణిశర్మ పర్సనల్ ఆల్బమ్ నుండి 'హాసం' పాఠకులకోసం ప్రత్యేకంగా...

## మురారి

రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి గానం: జిక్కి, సునీత, సంధ్య

ప: అలనాటి రామచంద్రుడికన్నింటా సాటి
ఆ పలనాటి బాలచంద్రుడికన్నా అన్నిట మేటి (2)
అనిపించే అరుదైన అబ్బాయికి మనువండి
తెలుగింటి పాల సంద్రం కనిపెంచిన కూన
శ్రీహరి ఇంటి దీపమల్లే కనిపించిన జాణ ॥తెలుగింటి॥
అటువంటి అపరంజి అమ్మాయిని కనరండి
చందమామ చందమామ కిందికి చూడమ్మా
ఈ నేలమీది నెలరాజుని చూసి నివ్వెరబోవమ్మా
వెన్నెలమ్మా వెన్నెలమ్మా వన్నెలు చాలమ్మా
మా అన్నుల మిన్నకు సరిగా లేవని వెలవెలబోవమ్మా
చ: పుత్తడి బొమ్మకు పుస్తెలు కడుతూ పురుషుడి మునివేళ్ళు
పచ్చని మెడపై వెచ్చగా వ్రాసెను చిలిపి రహస్యాలు
నేలకు జారిన తారకలై ముత్యాల తలంబ్రాలు
ఇద్దరి తలపున ముద్దగా తడిపిన తుంటరి జలకాలు
అందాల జంట అందరికంటికి విందులు చేసే సమయాన
ఆ... ఆ... ఆ... ఆ...
అందాల జంట అందరికంటికి విందులు చేసే సమయాన
కలలకు దొరకని కళగల జంటని పదిమంది చూడండి
తళతళ మెరిసిన ఆనందపు తడిచూపుల అక్షితలేయండి
॥చందమామ॥
చ: సీతారాముల కళ్యాణంలా కనిపిస్తూ ఉన్నా
విరగలేదు ఆ శివుని విల్లు ఈ పెళ్ళి మండపాన
గౌరీ శంకరు లేకమైనా సుముహూర్తమల్లే ఉన్నా
మరగలేదు మన్మథుని ఒళ్ళు ఈ చల్లని సమయాన
దేవుళ్ళ పెళ్ళి వేడుకలైనా ఇంత ఘనంగా జరిగేనా
ఆ... ఆ... ఆ... ఆ.... ఆ.... ॥దేవుళ్ళ॥
అనుకోని కనివిని ఎరుగని పెళ్ళికి జనమంతా రారండి
తదుపరి కబురుల వివరములడగక
బంధువులంతా కదలండి ॥చందమామ॥

## ఆది

రచన: చంద్రబోస్ గానం: మల్లికార్జున్, సునీత

అ: నీ నవ్వుల తెల్లదనాన్ని నాగమల్లి అప్పడిగింది
ఇవ్వద్దూ ఇవ్వద్దూ ఇవ్వద్దూ
నీ పెదవుల ఎర్రదనాన్ని గోరింటాకే అరువడిగింది
ఇవ్వద్దూ ఇవ్వద్దూ ఇవ్వద్దూ
నీ కోకను సీతాకోక నీ పలుకును చిలకల మూక
నీ చూపును చంద్రరేఖ నీ పొంగును ఏరువాక
బదులిమ్మంటూ బతిమాలాయి
ఇవ్వద్దూ ఇవ్వద్దూ ఇవ్వద్దూ
అసలివ్వద్దూ ఇవ్వద్దూ ఇవ్వద్దూ ॥నీ నవ్వుల॥
అ: నీ బుగ్గల్లోని సిగ్గులు కొన్ని మొగ్గలకైనా ఇవ్వద్దు
ఆ: నా వైపే మొక్కిన నీకైతే
అ: అది మొత్తం ఇవ్వొచ్చు
అ: నీ బాసల్లోని తీయదనాన్ని తెలుగు భాషకే ఇవ్వద్దూ
ఆ: నాకోసం వేచే నీకైతే
అ: అది రాసిగా ఇవ్వొచ్చు
అ: భక్తి శ్రద్ధ ఏదైనా భగవంతునికే ఇవ్వొద్దు (2)
ఆ: నీకై మొక్కేనాకే ఇవ్వొచ్చు ... ఆ.... ॥నీ నవ్వుల॥
అ: నీ అందం పొగిడే అవకాశాన్ని కవులకు సైతం ఇవ్వొద్దు
ఆ: మరి నాకై పుట్టిన నీకైతే
అ: అవి పూర్తిగ ఇవ్వొచ్చు
అ: నీ భారం మోసే అదృష్టాన్నే భూమికి సైతం ఇవ్వొద్దు
ఆ: నేనంటే నచ్చిన నీకైతే
అ: అది వెంటనే ఇవ్వొచ్చు
అ: నిను హత్తుకు పోయే భాగ్యాన్ని నీ దుస్తులకైనా ఇవ్వొద్దు(2)
నీకై బ్రతికే నాకేయివ్వొచ్చు ... ఆ... ॥నీ నవ్వుల॥
ఆ: నా వాకిట ముగ్గులు నీకే నా దోసిట మల్లెలు నీకే
నా పాపిట వెలుగులు నీకే నా మాపటి మెరుపులు నీకే
ప్రాయం ప్రణయం ప్రాణం నీకే
ఇచ్చేస్తా ఇచ్చేస్తా ఇచ్చేస్తా
బదులిచ్చేస్తా ఇచ్చేస్తా ఇచ్చేస్తా...

## ఖుషి

రచన: చంద్రబోస్ గానం: ఉదిత్‌నారాయణ్, కవితాసుబ్రహ్మణ్యం

అ: అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా
మతితప్పి కుర్రాళ్ళే మంచాన పడ్డారే (2)
ఆ: అబ్బాయే సూటిగా కన్నెత్తి చూడగా
ఆ వాడి చూపులకు మంచైన మరిగేను
అ: ఆ నవ్వులు ఈ చూపులు (2)
ఇ: కలిపేస్తే ప్రేమేలే ॥అమ్మాయే॥
కో: ఓ....
అ: ప్రేమలు పుట్టే వేళ పగలంతా రేయేలే
కో: అమ్మమ్మో
అ: ప్రేమలు పండేవేళ జగమంతా జాతరలే
ఆ: ప్రేమే తోడుంటే పామైనా తాడేలే
ప్రేమే వెంటుంటే రాయైనా పరుపేలే
అ: నీ ఒంట్లో ముచ్చెమటైనా నా పాలిట పన్నీరే
నువ్విచ్చే పచ్చిమిరపైనా నా నోటికి నారింజే
ఆ: ఈ వయసులో ఈ వరసలో (2)
ఇ: నిప్పైనా నీరేలే
కో: ఓ....
ఆ: నేనొక పుస్తకమైతే నీరూపే ముఖచిత్రం ॥అమ్మాయే॥
కో: అమ్మమ్మో
ఆ: నేనొక అక్షరమైతే నువ్వేలే దానర్థం
కో: అమ్మమ్మో
అ: ఎగిరే నీపైటే కలిగించే సంచలనం
ఒలికే నీ వలపే చేయించే తలస్నానం
ఆ: ఎండల్లో నీరెండల్లో నీ చెలిమే చలివేంద్రం
మంచుల్లో పొగమంచుల్లో నీ తలపే రవికిరణం
అ: పులకింతలే మొలకెత్తగా (2)
ఇ: ఇది వలపుల వ్యవసాయం ॥అమ్మాయే॥

## అన్నయ్య

రచన: వేటూరి గానం: హరిహరన్, హరిణి

అ: హిమసీమల్లో హల్లో యమగా ఉంది ఒళ్ళో
ఆ: మునిమాపుల్లో ఎల్లో మురిపాలా లోయల్లో
అ: చలి చలిగా తొలి బలిగా ఈడే ధారపోశా
ఆ: చలివిడిగా కలివిడిగా అందాలారబోశా
అ: అలకలూరి రామచిలక పలుకగనే ॥హిమ॥
అ: సోసో కానిసోయగమా ప్రియ శోభనమా సుఖ వీణ మీటుదమా
ఆ: వావా అంటే వందనమా అభివందనమా
వయసంతా నందనమా
అ: మోహమాటమైనా నవ మోహనం
ఆ: చెలగాటమైనా తొలిసంగమం
అ: మది వదిలే హిమ మహిమ ఓ...
ఆ: అది అడిగే మగతనమా నీదే భామ
అ: పడుచు పంచదార చిలక పలుకగనే ॥హిమ॥
ఆ: మామా అంటే మాధవుడే
జత పడనీడు ఎండపొడే
అ: సాసా అంటే సావిరహే బహుశా కలయే నడిజాము జాతరలే
అ: వాటేసుకుంటే వాత్సాయనం
అ: పరువాల గుళ్ళో పారాయణం
ఆ: రవికలనే రచన సుమా... ఓ...
అ: సుమతులకే సుమశతమా నీవే ప్రేమా
ఆ: పెదవి ప్రేమలేఖ ఇదని చదవగనే ॥హిమ॥

## యువకుడు

రచన: వేటూరి గానం: దేవిశ్రీ ప్రసాద్

ప: జగడ జగడ జగదానందం
రగడ రగడ రసగోవిందం
అడుగు అడుగునా వేదాంతం
పరుగు పరుగు మా సిద్ధాంతం ॥జగడ॥
నీలి ఆకసాలు మాసిపోవు మేఘమాల మేడల్లో... ఓ...
మన కాలికింద నేలతల్లి జారిపోదు ఏదైమైనా... ఓ...
గాలి ఆగిపోదు అందమైన పూలతోట నీడల్లో... ఓ...
లేత యవ్వనాలు మళ్ళిపోతే మళ్ళిరావు ఎవ్వరికైనా॥జగడ॥
ఓ మామ ఓమామ ఓ...
చ: పాత చెప్పులు పాత గొప్పలు చెల్లవులే ఈనాడు
వాళ్ళ ముద్దుల జోడు మద్దెల పెంచిందీ జనలోడు
పొట్టకూటికే పట్టభద్రులు పేపర్లు తిరగేస్తుంటే
పెళ్ళిపందిరి పిల్ల ఉందని పేచీలు పెట్టేస్తుంటే
జనకా తినకా మా బ్రెయిన్ బిరియాని
అరకో కొరకో... పారెయ్యి పాకెట్ మనీ ॥జగడ॥
చ: బెంగ పుట్టినా నింగి పట్టున చుక్కలతో వెయ్ భేటీ
మాయలోకపు లోయ లోతులు ఉండదు లేరా బూటీ
నీకు చెందిన ప్రాణవాయువు నీదైతేనే బ్యూటీ
పెట్టరాగురి పట్టరాసిరి నువ్వేరా నీ సాటి
సరదా పరదా చెయ్యొద్దు కుర్‌బానీ
మిగితా చరితా సంసార సాంబ్రాణి ॥జగడ॥

## ఆజాద్

రచన: వేటూరి సుందర్రామ్మూర్తి గానం: హరిహరన్, మహాలక్ష్మి

షః కల అనుకో కలదనుకో నాలో ప్రేమ
అవుననుకో కాదనుకో నీవే ప్రేమ
పడిపోయా ప్రేమలో పరువాల సాక్షిగా
పడదామా పెళ్ళిలో పదిమంది సాక్షిగా
ప్రేమించుకుందాం ఏ జన్మకైనా అ: ॥కల॥
ఆ: కల అనుకో కలదనుకో నాలో ప్రేమ
అ: అవుననుకో కాదనుకో నీవే ప్రేమ
ఛః ఓ నిను చూడని నిశిరాతిరి నిదరైన పోనీ కనుల పాపవో
ఆ: ఓ నిను తాకని నిమిషాలలో కునుకైన రాక కుమిలే బాధవో
అ: గాలుల్లో ఊసులు కళ్ళల్లో ఆశలు
ఆ: కౌగిట్లో పోసిన కామాక్షి పోగులు
ఏ తోటవైనా నీ పూజకేలే అ: ॥కల॥
ఆ: అవుననుకో కాదనుకో నీవే ప్రేమ
ఛః ఓ మలి సంధ్యలో నులివెచ్చగా
చలి కాచుకుందాం చనువే హాయిలే
అ: ఓ నడిరేయిలో నడుమెక్కడో తడిమేసుకున్నా గొడవే తీపిలే
ఆ: ఓ వీణల్లో తీగలా తీగల్లో మోగలా
అ: మీటే కవ్వింతలో పాటే కళ్యాణిగా
నా పాట వింటే నీ పైట జారే
ఆ: కల అనుకో కలదనుకో నాలో ప్రేమ అ: ॥అవునను॥
ఆ: పడిపోయా ప్రేమలో పరువాల సాక్షిగా
అ: పడదామా పెళ్ళిలో పదిమంది సాక్షిగా
ఇః ప్రేమించుకుందాం ఏ జన్మకైనా

## దేవీ పుత్రుడు

రచన: జొన్నవిత్తుల గానం: ఎస్.పి. బాలు, చిత్ర

అ: ఆకాశంలోని చందామామ బంగారు పాపై వచ్చేనమ్మా
సాగరమాయె సంబరమె స్వాగతమాయె సంతసమె
నాలోని ప్రేమ ప్రతిరూపమే ఈ ఇంట తానే సిరిదీపమే ॥ఆకాశ
అ నింగిలో నీలమంతా ఉంగరం చేసి ఇస్తా ఊరేగిస్తా
సాగరం పొంగులన్నీ గవ్వల గౌను చేస్తా గారాం చేస్తా
తెల్లని ఏనుగుపై నా పాపను ఎక్కిస్తా
చిలకలు హంసలని ఆడేందుకు రప్పిస్తా
ఆ: హరివిల్లేకాగా ఉయ్యాలలే
కోయిలలే పాడే నా జోలలే
బొమ్మలుగా మారే ఆ చుక్కలే
దిష్టంతా తీసే నలు దిక్కులే
ఆ పాపలో అందమంతా బ్రహ్మకే అందనంత ఎంతో వింత
అమ్మలో ప్రేమఅంత నాన్నలో ఠీవిఅంతా వచ్చేనెట్టా
దీని నవ్వేమో దివి తారల వెలుగంట
కమ్మని పిలుపేమో ఈ అమ్మకు పులకింత
అ: అడుగేసి తీస్తే హంస జోడి
కులుకుల్లో తానే కూచిపూడి
చిరునవ్వులోన శ్రీరమణి
మారాము చేసే బాలామణి
ఆ: ఆకాశంలోని చందామామ బంగారు పాపై వచ్చేనమ్మా
అ: సాగరమాయె సంబరమె స్వాగతమాయె సంతసమె
ఆ: నాలోని ప్రేమ ప్రతిరూపమే
అ/ఆ: ఈ ఇంటతానే సిరిదీపమే

(తరువాయి 74వ పేజీలో)

సీరియల్ 11

# సిద్ధాంత్ ఆంటీ ఇంటి కథ

- మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అంతే కాదు అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్పకుండా దాట వేస్తుంది. లింగమయ్య పనిచేసే కంపెనీ ప్రొప్రయిటర్ సుబ్బారావుకు బామ్మ ఇంటిపై కన్ను పడుతుంది. దానిని ఎలాగైనా సాధించాలని లింగమయ్యతో చెప్తూ ఉంటాడు...

లింగమయ్య ముఖ కవళికల్ని గమనించి అడిగాడు సుబ్బారావు.

"ఏం మొహమలా పెట్టావ్?"

"ఏం లేదండి. ఏం లేదు".

"ఏదో వుంది. ఏమిటిది? చెప్పు"

"ఖచ్చితంగా ఏం లేదండి. నేనా ఇంటావిడతో మాట్లాడతాను. తర్వాత మీతో మాట్లాడతాను."

"సరే. ప్రయత్నించి చూడు. ఆ ప్రాపర్టీని మనం డెవలప్ చేస్తే ప్రెస్టేజ్‌గా వుంటుంది".

"ఆ అపార్ట్‌మెంట్స్ పేరు కూడా 'ప్రెస్టేజ్ అపార్ట్‌మెంట్స్' అని పెట్టొచ్చు" చెప్పాడు లింగమయ్య.

"డెక్కన్ ప్రెస్టేజ్ అందాం"

"లేదా సదరన్ ప్రెస్టేజ్"

"అంత లేదు. డెక్కన్ చాలు"

లింగమయ్య లేచి బయటికి వచ్చాక ఆయన అర్జెంట్‌గా ఒకటిన్నర ఇరానీ టీ తాగాడు. తాగాక చాలాకాలం తర్వాత సిగార్‌ని వెలిగించాడు. బుర్ర చురుగ్గా పని చెయ్యాలని. తర్వాత ఆ సిట్యుయేషన్‌ని తనకి లాభకరంగా ఎలామలచుకొనుట' అన్న కోణంలోంచి ఆలోచించసాగాడు.

***

"అమ్మా. లిప్‌స్టిక్ అనే పేరు దానికి తప్పుగా ఎందుకు పెట్టారు?"

నిద్ర లేచి మంచం దిగి పరిగెత్తుకొచ్చిన రాజు లిప్‌స్టిక్‌ని పెదాలకి రాసుకుంటున్న తల్లిని చూసి అడిగాడు.

"దీనికాపేరు తప్పెందుకైందిరా?" అడిగింది వాసవి నవ్వుతూ.

"లిప్‌స్టిక్ అంటే పెదవులని అతికించడం కదా, కాని దీన్ని రాసుకున్నాక కూడా పెదాలు కదుల్తూనే వుంటాయి కదా?"

"అదా నీ సందేహం. ఎందుకంటే... ఎందుకంటే..." వాసవికి తగిన జవాబు తట్టలేదు.

"నిన్న నేనడిగిన ప్రశ్నకి ఎలా జవాబు చెప్పలేకపోయావో దీనికీ అంతే కదా?" అడిగాడు రాజు.

క్రితం రోజు రాజు స్కూల్ నించి రాగానే అడిగాడు.

"మమ్మీ. ప్రాక్టీస్ చేయడం అంటే ఇంకా నేర్చుకోవడమే కదా?"

"అవును. ప్రాక్టీస్ పూర్తయి అంతా వచ్చాక వాళ్ళని ఎక్స్‌పర్ట్స్ అంటారు".

"మరయితే డాక్టర్లంతా ప్రాక్టీస్ చేస్తూంటారు కదా. వాళ్ళు పర్‌ఫెక్ట్ అయ్యేదాకా ఎందుకు ఆగడం లేదు?"

రాజు ప్రశ్నకి తృప్తికరమైన సమాధానం ఇవ్వలేక పోయింది వాసవి.

"నీ కన్నీ ఇలాంటి సందేహాలే వస్తూంటాయి" చెప్పింది.

"నీ పేరులోని స్పెల్లింగ్‌లో ఓ తమాషా వుందని మొన్న రాత్రి కల్లో సాయిబాబా కనబడి చెప్పారన్నాను గుర్తుందా?"

"గుర్తుంది. నిన్న రాత్రి మళ్ళీ ఆయన కల్లో కనబడి అదేమిటో చెప్పారా?" అడిగింది వాసవి.

"అవును".

"ఏమిటా తమాషా?" అడిగింది వాసవి.

"నీ పేరులోని స్పెల్లింగ్‌ని ఎటునించి చదివినా అదే అర్థం వస్తుంది".

"రాదే? ఎలా? రాసి చూపించు" ఆలోచించి అడిగింది వాసవి.

"నీ ఇనీషియల్ ఏమిటి?"

"ఐ"

ఓ కాగితం మీద రాజు ఇలా రాసి తల్లికి చూపించాడు.

i Vasavi

"చదివిచూడు తెలుస్తుంది ఆ తమాషా"

ముందునించే కాక వెనకనుంచి చదివినా అదే అర్థం రావడంతో చెప్పింది వాసవి.

"నిజమేరా. ఎవరు చెప్పారిది నీకు? మీ ఇంగ్లీష్ టీచరా?"

"కాదు. షిర్డిసాయిబాబా"

"... ఎందుకురా ఇంత చిన్నవయసులోనే అబద్ధాలు నేర్చావు?"

"అబద్ధం కాదు మమ్మీ. నిజం. బాబానే నాకు కల్లో కనబడి చెప్పారు".

కొడుకు మాటల్లోని సిన్సియారిటీని కొట్టి పారేయలేక పోయింది వాసవి. కాదనలేక పోయింది. అంతటితో ఆ టాపిక్‌ని ఆపేసింది.

"నాన్న కేంప్‌నించి ఎప్పుడొస్తున్నారు మమ్మీ?" అడిగాడు రాజు.

"ఎల్లుండి"

"వచ్చాక ఓ వారం పాటు వుంటారా? లేక మళ్ళీ కేంప్‌కి వెళతారా?"

"ఏమో ఎవరికి తెలుసు?" చిన్నగ్గా నిట్టూర్చి చెప్పింది వాసవి.

***

లంచ్ అవర్‌లో బేంక్ స్టాఫ్ అంతా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ లంచ్ తీసుకుంటున్నారు. ప్రతీ వర్కింగ్ డే నిరుపమ్ ఆ టైం కోసం చకోర పక్షిలా ఎదురు చూస్తుంటాడు. ఎందుకంటే అనన్యతో తీరిగ్గా మాట్లాడచ్చు.

ఆ రోజు స్టాఫ్‌లో ఒకరైన కుచలకుమారి ప్రెగ్నెంట్ అని కన్‌ఫర్మ్ అయింది. దాంతో అందరూ బలవంతం చేసి బయటనించి స్వీట్స్, కూల్‌డ్రింక్స్ తెప్పించారు.

"ఛ. ఇంక చస్తే ప్రెగ్నెంట్ కాను" చెప్పింది కుచలకుమారి అందుకయిన బిల్లు చూసి.

"ఓహో! అదెలా జరుగుతుందో ఇప్పటికైనా అర్థం అయిందన్నమాట" కొంటెగా చెప్పింది అనన్య.

ఆ జోక్‌కి అంతా గట్టిగా నవ్వారు. నిరుపమ్ అందరికన్నా ఎక్కువ సేపు నవ్వాడు.

"ఇఫ్ యూ ఆర్ అండర్ టెన్. యూ హేవ్ లాటాఫ్ ఫన్ విత్ ఏ గన్
ఇఫ్ యూ ఆర్ ఓవర్‌టెన్
యూహేవ్ లాటాఫ్ ఫన్ విత్ ఏ మేన్"

చెప్పింది కుచలకుమారి.

కుచలకుమారితో బాగా చనువుగల ఒక క్లర్క్ అడిగింది.

"నిన్నోటి అడుగుతాను. ఏం అనుకోవుగా?"

"అనుకోను. అడుగు".

"మా అందరికీ ఇది చాలా కాలంగా వున్న సందేహం కాబట్టి అందరి ముందు అడుగుతున్నాను".



"అడుగు"

"మీ వారు నీ కన్నా పొట్టి కదా... నీ కన్నా పొట్టి మనిషితో ఎలా ప్రేమలో పడి వివాహం చేసుకున్నావే?"

అంతా కుచలకుమారి జవాబు కోసం ఆసక్తిగా చూసారు.

ఏం తడుముకోకుండా జవాబు చెప్పింది ఆమె.

"ఏం వుంది? మేం ఇద్దరం కూర్చుని వుండగా, ఒకరినొకరు చూసుకుని ప్రేమలో పడ్డాం. మేం ఇద్దరం నించునే సరికే లేటైపోయింది".

నిరుపమ్ ముందున్న గ్లాస్‌లోని కోకోకోలాలో ఓ స్ట్రా వేసింది అనన్య.

"ఓ! థాంక్స్, థాంక్స్". ఉబ్బితబ్బిబ్బయ్యాడు నిరుపమ్. వెంటనే మరో స్ట్రా కూడా వేసింది.

ఓ ... మళ్ళీ థాంక్స్, థాంక్స్".

నిరుపమ్ నోట్లోని ఓ స్ట్రాతో ఎంత పీల్చినా కోకోకోలా పైకి రాదే. "ఏం చేశారు? ఇదేం మాయ?" అడిగాడు నిరుపమ్.

"సైన్స్ భాషలో చెప్పనా?" అడిగింది అనన్య.

"చెప్పండి"

"ద్రవంలో ఒకే స్ట్రా వుంటే లోపల వేక్యూం క్రియేట్ అయి, అది ఆ ద్రవాన్ని పైకి పంపుతుంది. రెండో స్ట్రా అలా క్రియేటైన వేక్యూంని రద్దు చేసేస్తుంది కాబట్టి ద్రవం పైకి పీల్చినా రాదు. రెండు స్ట్రాలనీ కలిపి ఒకేసారి ఉపయోగిస్తే ద్రవం మళ్ళీ పైకి వస్తుంది" చెప్పింది అనన్య.

"యూ ఆర్ మిస్ ఐన్‌స్టీన్" మెచ్చుకున్నాడు నిరుపమ్.

"మీ మనసులో ఏం వుందో ఇట్టే తెలుసుకుంటే నన్ను మిస్ ఫ్రాయిడ్ అంటారా?" అడిగింది ఫక్కున నవ్వి కుచలకుమారి నిరుపమ్‌ని.

"తప్పకుండా. బట్ తెలుసుకోలేరు"

"అంటే అక్కడ ఓ పెద్ద ఖాళీ వుందన్న మాట"

"ఏం కాదు. నా మైండ్‌లో ఏముందో చెప్పుకోండి చూద్దాం?" అడిగాడు.

"ఓ నంబర్ వుంది"

"నంబరా?"

"అవును"

"లేదు"

"ఉంది... రెండు నంబర్లు నిజానికి"

"అయితే ఏమిటా నంబర్లు?" అడిగాడు నిరుపమ్.

"చెప్తా. ముందు మీరు ఓ రెండు నంబర్లు అనుకోండి".

"అనుకున్నా". చెప్పాడు నిరుపమ్.

(ఇరవై రెండు అనుకున్నాడు)

"దాన్ని రెట్టింపు చెయ్యండి" చెప్పింది కుచలకుమారి.

"చేసా" చెప్పాడు నిరుపమ్ (నలభై నాలుగు అనుకున్నాడు)

"వెరీగుడ్. దాన్ని అయిదుతో హెచ్చవేయండిప్పుడు"

"వేసా" చెప్పాడు.

(రెండు వందల ఇరవై అనుకున్నాడు)

"ఇప్పుడు ఆ నంబర్ చివర వున్న సున్నా కొట్టేస్తే మిగిలించే మొదట మీరనుకున్న నంబరు" చెప్పింది కుచలకుమారి.

"కరెక్ట్. కాని ఎలా తెలుసుకున్నారు?" అడిగాడు నిరుపమ్.

"నేను మిస్ ఫ్రాయిడ్‌ని కాబట్టి. ఐకెన్ రీడ్ యువర్ మైండ్"

"నో నో. ఇలాంటివి చిన్నప్పుడు స్కూల్లో చేసేవాళ్ళం".

అనన్య వెంటనే చెప్పింది.

"నేను కోఠీ బ్రాంచ్‌లో పని చేసేప్పుడు జరిగిందిది. ఒకతను వంద రూపాయలతో నూట పాతికని ఒకే రోజు సంపాదించాడు".

"ఎలా?" అడిగింది కుచలకుమారి.

"మోస్ట్ ఇంటెలిజెంట్‌గా. అతను వంద రూపాయలని ఫిక్సెడ్ డిపాజిట్ చేసాడు. ఆ వంద సర్టిఫికెట్‌ని డెబ్భై అయిదు రూపాయలకి పాన్‌షాప్‌లో తాకట్టు పెట్టాడు. ఆ పాన్ టిక్కెట్‌ని ఏభై రూపాయలకి అమ్మాడు. దాంతో డెబ్భై అయిదు ప్లస్ ఏభై నూటపాతిక సంపాదించాడు".

"వీడు అసలైన మేధావంటే" చెప్పాడు నిరుపమ్. టైం అవగానే అంతా లేచారు. నిరుపమ్ అనన్య సీట్ దగ్గరికి వెళ్ళి చెప్పాడు.

"మీరు నిజంగా జీనియస్సండి"

"ఏం?"

"ఆ రెండు స్ట్రాల సంగతి జీనియస్‌లకే తెలుస్తుంది".

"ఓ అదా!" నవ్వేసింది.

"మీ ఇంటి వైపు నాకు ఇవాళ సాయంత్రం వచ్చే పని పడింది. అటొచ్చినప్పుడు ఓ సారి మీ ఇంటికి వస్తాను మీ కభ్యంతరం లేకపోతే".

"నాకు అభ్యంతరం వుంది".

"ఓ! అయితే రాన్లెండి. ఏమిటా అభ్యంతరం?"

"సాయంత్రం నేను ఇంట్లో వుండను. సూపర్ మార్కెట్‌కి వెళ్తాను. అక్కడికి వస్తే రావచ్చు".

"సర్లెండి. వద్దులెండి. చూస్తాలెండి." గొణిగి వెళ్ళిపోయాడు నిరుపమ్.

కుచలకుమారి అనన్య దగ్గరికి వచ్చి అడిగింది నవ్వుతూ.

"ఏంటి గురుడు ఏమంటున్నాడు?"

"పిల్ల కాకి బ్రహ్మచారి. ఏదో అంటూనే వుంటాడు పెళ్ళయ్యేదాకా".

బేంక్ లోన్ కోసం వచ్చి కూర్చున్నాడు ఓ ముసలాయన. ఆయన తన దళసరి కళ్ళజోడు లోంచి చూస్తూ చెప్పాడు.

"అన్నమూ లేని వాని బాధ బాధ కాదు.
కొడుకూ లేని వాని బాధ బాధ కాదు.
పొడుమూ లేని వాని బాధ ముమ్మాటికీ బాధ"

పొడుం డబ్బా తీసి ఇంత నశ్యం పీల్చి చెప్పాడు.

"నా లోన్ అప్లికేషన్ ఎంత దాకా వచ్చిందోయ్?"

పనిలో పడ్డ నిరుపమ్ అనన్య గురించి మర్చిపోయాడు.

***

మరోసారి కూడా ఫోన్ డయల్ చేసింది బామ్మ. అవతల వైపు ఎంగేజ్డ్ రావడంతో విసురుగా పెట్టేసింది రిసీవర్‌ని. తర్వాత అది పగిలిందేమోనని పరీక్షించింది కూడా.

అప్పటికే ఆ నంబర్‌కి అనేక డజన్ల సార్లు ట్రై చేసింది బామ్మ. అయితే ప్రతీసారీ ఎంగేజ్



వస్తోంది. ఆ నంబర్ 'ఆట కావాలా పాట కావాలా?' ప్రోగ్రాంలో పాల్గొన దలిచే వారిది. ఆ వారం దాన్ని నిర్వహించేది తనికెళ్ళభరణి.

గల్లీలో నా చెల్లికి పెళ్ళి
చెయ్యాలి మళ్ళీ మళ్ళీ

సీన్ అడిగి వేయించుకోవాలన్న సంకల్పంలో బామ్మ వుండగా విధి ఇంకోలా డిసైడ్ చేసింది. తెరచి వున్న తలుపులోంచి అకస్మాత్తుగా లోపలకి వచ్చాడు లింగమయ్య. బామ్మని చూసి అవాక్కయ్యాడు.

కాళ్ళు రెండూ స్టూల్ మీదకి జాపుకుని కూర్చుని, ఓ చేతిలో చెగోడీలు, ఇంకో చేతిలో కార్డ్‌లెస్ ఫోన్ పట్టుకుని తీరిగ్గా టివి చూస్తున్న బామ్మను చూసి అతను అవాక్కవడానికి ఇంకో కారణం ఆ వుదయమే ఆవిడ ఫేషియల్ చేసుకోవడం ఎంతో వర్చస్సుగా వుందావిడ మొహం.

"బామ్మగారూ. బాగా తేరుకున్నట్లున్నారే?" అడిగాడు నీరసంగా.

"అంతా ఆ దేవుడి దయ. అయినా ఇది నమ్మతగ్గ ఆరోగ్యం కాదు. ఇవాళ ఇలా వుంటుంది. రేపెలా వుంటుందో?"

"మీతో ఓ విషయం మాట్లాడాలని వచ్చాను"

"మాట్లాడు"

"ఎవరికో ఫోన్ చేస్తున్నట్లున్నారు?"

"ఎవరికో కాదు. తనికెళ్ళ భరణికి".

"తనికెళ్ళ భరణంటే సినిమా ఏక్టరా?"

"ఇప్పుడు ఏక్టరయ్యాడు కాని మునుపు రచయితేగా"

"అప్పటి నించి తెలుసా?"

"ఎందుకు తెలీదు? అర్జెంట్ మాట్లాడాలన్నప్పుడే నంబర్ ఎంగేజ్డ్ వస్తుంటుంది కాని నువ్వు చెప్పు ఎందుకొచ్చావో"

"మన ఈ ఇల్లుంది చూసారూ. దీన్ని అమ్మితే ఎలా వుంటుందన్న ఆలోచన వచ్చింది నాకు".

"ఎవరికి? ఎంతకి? ఎందుకు?" అడిగింది బామ్మ ఫోన్ నెంబర్ ట్రై చేస్తూనే.

"ఎవరికైతే మనకేమిటి? ఎంత కన్నది ముఖ్యం. ఇక ఎందుకంటారా? ఆ వచ్చే డబ్బులో కొంత భాగం మీకు ఉచితంగా ఇవ్వదలచాను కాబట్టి".

"ఆగాగు. నెంబర్ తగిలినట్లుంది. ఛ.... మళ్ళీ ఎంగేజ్డ్.... సరే నువ్వు చెప్పు".

"చెప్పాల్సింది చెప్పేసా కదండి"

"నేను సరిగ్గా వినలా. మళ్ళీ చెప్పు".

దాన్ని రిపీట్ చేసాడు లింగమయ్య.

"దాన్ని అమ్మడానికి అందరం సంతకాలు చేద్దాం. వచ్చింది అందరం తలాకాస్త పంచుకుందాం. మేం కూడా సంతకాలు చేస్తాం కాబట్టి ఆ అమ్మకం పూర్తిగా లీగల్ అవుతుంది. ఏమంటారు?"

"నువ్వట్టి మూర్ఖుడివంటాను" సీరియస్‌గా చెప్పింది బామ్మ కార్డ్‌లెస్ ఫోన్ పక్కనపెట్టి.

"అదేం మాట?" నొచ్చుకున్నాడు లింగమయ్య.

"లేకపోతే, కోట్లు వచ్చేదాకా ఆగలేక లక్షలకి అమ్ముడు పోతావా లింగమయ్యా?"

"అదికాదు..." నసిగాడు.

"చూడు లింగమయ్యా. మనిషి జీవితం శాశ్వతం అని భ్రమపడక! నేను ఇంతకాలం బ్రతికినట్లుగానే ఎల్లకాలం బ్రతకను. నేను చచ్చే రోజు అంటూ ఒకటి దేవుడి లెక్కల్లో ఖచ్చితంగా వుంటుంది. తొందరపడితే "నష్టపోతాం" (నష్టపోతావు)"

"ఇందులో తొందరేం లేదు. అంతా తలా కాస్త పంచుకోవచ్చుని, దీని వల్ల మీకు లాభమేగా?"

"లాభమా? నష్టమా? ఎంత శాతం? అన్న లెక్కల్లోకి వెళ్ళొద్దు మనం. నేను బ్రతికున్నంత కాలం ఈ ఇంట్లోంచి కదలను, దీన్ని అమ్మను".

లింగమయ్య మొహం ఎర్రబడింది. కోపాన్ని తమాయించుకుంటూ చెప్పాడు.

"ఇప్పుడర్థమైంది. మనిద్దర్లో ఎవరు మూర్ఖులో"

"అయింది కదా. ఇంక వెళ్ళు. వినే వాళ్ళకి ఎవరు మూర్ఖులో అర్థం కాక అది నేనేనని పొరబడచ్చు".

"అదికాదు బామ్మగారూ...."

"ఇంక ఈ విషయం మాట్లాడక. ఈ భరణి ఎంతకీ దొరకడేమిటి చెప్మా?"

"నేను రెండు రోజులాగి ఫోన్ చేస్తాను. ఒక వేళ మీరు మళ్ళీ ఆలోచించుకుని మనసు మార్చుకుంటే చెప్పండి. అనన్యని కూడా సంప్రదించండి. పెళ్ళీడుకొచ్చిన పిల్ల కదా".

"ఈ సలహా నచ్చింది. ఇవాళ అనన్యకి కొన్ని విషయాలు చెప్తాను సరా!"

లింగమయ్య మొహం మళ్ళీ మామూలుగా అయింది. ప్రసన్నంగా చెప్పాడు.

"ఇందాక నోరు జారాను. మనిద్దర్లో ఎవరం మూర్ఖులం కాదు బామ్మగారు"

"ఆ మూర్ఖత్వంలోంచి నువ్వు త్వరగా బయట పడినందుకు సంతోషం. వెళ్ళిరా నాయనా. నేను భరణితో కొంత ప్రైవేటుగా మాట్లాడాలి".

లింగమయ్య వెళ్ళిపోయాడు.

***

"వావ్! నిజంగా ఈ ఇంటి కథంతా ఇవాళ చెప్తావా?"

"నిజంగానే"

"వెరీ వెరీ గుడ్. ముందుగా ఈ ఇంటిని నువ్వు ఎందుకు అమ్మదలచుకోవడం లేదో చెప్పు బామ్మ"

"అలా కూర్చో"

కూర్చున్నాక అడిగింది అనన్యని. "ఎంతదాకా చెప్పా నిదివరలో?"

"పూర్వం ఎంతదాకా చెప్పావంటే అతని పేరు గ్రామం. అతనితో మొదలవుతుంది కథ. అతను నీ సంగీతం మాస్టారు. తర్వాత?"

"గ్రామం అనే పేరు అతనికెలా వచ్చిందో చెప్పానా?"

"చెప్పావు. జి.రామంలోని ఫుల్‌స్టాప్‌ని కొట్టేస్తే గ్రామం అయ్యాడు".

బామ్మ కుడిచేతి చూపుడు వేలుతో గాల్లో పెద్దపెద్ద గుండ్రాలు గీయసాగింది.

"అదేమిటి బామ్మ. అలా చేస్తున్నావు?" అడిగింది అనన్య.

"సర్కిల్స్. ఫ్లేష్ బేక్‌కి గుర్తులవి. ఇవాళా, నిన్నా? ఏభై ఏళ్ళ కిందటి కథ కాబట్టి ఎక్కువగా సర్కిల్స్ గీయనీ".

"సస్పెన్స్ ఆపి చెప్పు బామ్మా" మృదువుగా విసుక్కుంది అనన్య.

(ఇంకా వుంది)



## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు



❖ వి.మంజురాణి, హైదరాబాద్

ప్ర॥ ఛానల్స్‌లో సీరియల్స్ ఓకే కావాలంటే పైలెట్‌ను ఎందుకు చూపించ మంటారు?

జ॥ హోస్టెస్‌ని చూపించమంటే బావుండదు కనుక.

ప్ర॥ లంకకు వారధి కట్టే సమయంలో నీలుడు వేసిన రాళ్ళు మాత్రమే ఎందుకు తేలాయి?

జ॥ రాముడు నీలమేఘశ్యాముడు. సముద్రుడి వర్ణం నీలం. రాళ్ళు వేసిన వాడి పేరు నీలుడు. ఈ రోజుల్లో 'క్యాస్ట్ ఫీలింగ్'లా ఆ రోజుల్లో కలర్‌ఫీలింగేమైనా వర్కవుట్ అయిందేమో!

ప్ర॥ పోస్ట్‌పోన్ చెయ్యలేని విషయం ఏది?

జ॥ దురద పుడుతుంటే గోక్కోవడం.

## ఈ రూటే వేరు



(1) అల్పాహారం = అల్లులు తినే ఆహారం

(2) పూర్వీకులు = బీదతనముగా బలహీనముగా ఉండేవారు.

(3) స్వయంవరం= తపస్సు చెయ్యకుండా తనకు తానుగా దేవుడి దగ్గర్నుంచి వరాల్ని లాగేసు కోవటం

- చొప్ప నాగేశ్వరరావు, పాములవలస



## డబుల్ రోల్



(1) 'కారం' లెక్క 'ప్రకారం' వేస్తేనే ఆవకాయ బాగుంటుంది.

- బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

(2) 'జెంట్స్' మాత్రమే అక్కడ 'ఏజెంట్స్'గా పని చేయగలరు.

(3) ఈ 'పాన్'... 'జపాన్'లో కూడా వేసుకుంటారు.

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

## చిలిపి కవిత

కూర కమ్మగా ఉంది!



పులి, సింహం

క్రూర జంతువులు

గొర్రె, మేక, కేడి, దుప్పి

కూరజంతువులు

-బ్రహ్మానందం (సినీ నటుడు)

## పేరు - రిపేరు




(1) ఒసే రాములమ్మ... మనసంతా నువ్వే...
నువ్వు నాకు నచ్చావ్... నువ్వేకావాలి....
నిన్నే పెళ్ళాడతా...

-బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

(2) తేజ - నీతో - చిత్రం - జయం

(3) శ్రీరామ్ - నీతో - పెళ్ళి - ఆనందం

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

## చిలిపిలిపి




(1) రాళ్ళ జామారావు = రాళ్ళబండి రామారావు

-నిశాపతి, హైదరాబాద్

(2) 3 నే 3= త్రినేత్రి

-మామిడి శ్రీలత, రేపల్లె

(3) **Cut Cut All Shiva's Father=**
కటకటాలరుద్రయ్య

-బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

## పేరడీ పేరేడ్



భలే మంచి గుండు
పసందైన గుండు
రాగి చెంబులాగే నున్నగుండు ॥భలే॥
నెత్తిపైన అడవులలోన
పేలుపెట్టి తొలిచిన రోజు
పేలతోటి పాటే చుండ్రు
పాకి పాకి సలిపిన రోజు
గుండుకున్న సౌఖ్యాలన్నీ
కన్నుల ముందర నిలిచిన రోజు ॥భలే॥
కర్బూజలా గుండ్రంగుండు
నూనె లేక మెండుగా ఎండు
తొలుత తొలుత నున్నగనుండు
ముదురుతుంటె గరకుగనుండు
జెల్లకొడితే గుండెల్లోన
పుండు పిండుతున్నట్టే మండు ॥భలే॥

'జరిగిన కథ' సినిమాలోని
'భలేమంచిరోజు' పాటకు పేరడీగా...

-పి.గిరి, హైదరాబాద్

జులై 11 సియ్యస్సార్ జయంతి పురస్కరించుకుని...



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# యస్సార్ యస్సార్ యూ ఆర్ గ్రేట్ సియ్యస్సార్!

మద్రాసులో (ఇప్పుడు చెన్నై అన్నారు గాని, అప్పుడు మద్రాసే) టీ నగర్ (కాఫీనగర్ అని వేరే వుందా? అని అడగొద్దు. టీ అంటే త్యాగరాజశెట్టి. ఆయన పూర్తి పేరు ఇలా మారిపోయి పొడి (టి) అక్షరమై పోయింది!) సినిమా నటీనటులకి అప్పట్లో ప్రసిద్ధి. చాలామంది చిన్నా పెద్దానటులు, టెక్నీషియన్లూ అందరూ టీనగర్నే ఎన్నుకున్నారు. ఆ టీనగర్ సెంటర్‌లో పాండీబజారు. పెద్దవీధి. హోటళ్లు షాపులూ. ఒక హోటలు పేరు నారాయణ కేఫ్. (కేఫ్ అనడం తప్పు. కఫే అనాలి - కరెక్టుగా. మనం కఫే అని కరెక్టుగా పలికితే నవ్వుతారు గనక, కేఫ్ అనే అందాం) ఆ నారాయణ కేఫ్ ముందు, రెండు పెద్ద చెట్లు. (ఇప్పుడూ ఆ హోటలు అక్కడే వుంది గాని పేరు మారింది. రోడ్డు విశాలం కోసం ఒక చెట్టుని కొట్టేశారు, రెండో చెట్టు మాత్రం వియోగభారంతో వున్నట్టుగా, ఎండిపోయి నిర్జీవంగా వుంది) ఆ చెట్టు సియస్సార్ గారి చెట్టు. అంటే చిలకలపూడి సీతారామాంజనేయులు గారిచేత సిగరెట్లు కాల్పిస్తూ కబుర్లు చెప్పిస్తూ నీడ ఇచ్చిన చెట్టు. షూటింగు లేకపోతే, ఉదయం తొమ్మిదినుంచి పన్నెండూ వరకూ ఆయన మకాం అక్కడే నిలబడే! చిన్నా పెద్దా వచ్చేవాళ్లూ పోయేవాళ్లతో కబుర్లు. ఎక్కువ సినిమా సంగతులు. తక్కువ లోక భోగట్టాలూ. ఆయన్ని "పాండిబజార్ ప్రెసిడెంట్" అనే వారు. ఏ కారణం చేతనైనా ఆయన అక్కడికి రాకపోతే, షూటింగ్‌లో వున్నారన్నమాట. షూటింగ్ లేకపోయినా సభకు హాజరు కాలేదంటే - వొంట్లో బాగులేదన్నమాట. ఐతే, ఆయన మాత్రం టీనగర్‌లో లేరు, పక్కనే వున్న తేనాంపేటలో వుండే వారు. శోభనాచల స్టూడియోకు దగ్గర్లో అప్పట్లో కొందరు నటులు ఇళ్లు కట్టించుకున్నారు; ఆయనా కట్టించు కున్నారు. ఆయనకో పెద్ద కారుండేది. బ్యూక్. ఆ కార్లోనే వచ్చేవారు. వస్తూనే హోటల్లో ప్రవేశించి కాఫీ, ఆయన కోసం నిరీక్షిస్తున్న వాళ్లెవరైనా కనిపిస్తే వాళ్లని తోడ్కొని కాఫీ.

సియస్ఆర్ అసలు సిసలైన కారెక్టరు యాక్టరు. పైగా చాలామంది స్టేజి నటులు సినిమాకి అడ్జస్ట్ కాలేక పోయారు గాని, సియస్సారు గారు మాత్రం ఇమిడి పోయారు. సినిమాల్లోకి వచ్చిన తర్వాత కూడా నాటకాలు ఆడారు. నాటకం, ఆ నటనా అదే, సినిమా ఈ నటనే ఇదే. ముక్కు పొడుం పట్టడంతో - మారిన తమాషా ముక్కు గొంతు. మిమిక్రీ చేసే కళాకారులకి సులభ సాధ్యుడు. విషాద పాత్రలు, విలన్ పాత్రలూ, విదూషక పాత్రలూ, హీరో పాత్రలూ కాక, కృష్ణుడు, వెంకటేశ్వరుడూ కూడా వేసినవారు. సాంఘికాల్లోనూ పౌరాణిక జానపదాల్లోనూ నటించిన వారు.




"మీ గొంతులో మార్పేమి లేకుండా, ఇంత వెరైటీ ఎలా చూపించగలుగుతున్నారు సార్, సియస్సార్ సార్?" అని అడిగితే, "ఇంటిపేరు చిలకలపూడి అయినంతమాత్రాన నా కంఠం కూడా అలాంటి బంగారమే అనుకుంటు న్నావా? కాదు. మేలిమి బంగారం నాయనా! నా గాత్రం, నా డెలివరీ నా ఎసెట్సు" అని గంభీరంగా చెప్పారు.

ఆంజనేయులుగారు పెద్దగా చదువుకోలేక పోయినా, కోపరేటివ్ సూపర్‌వైజర్‌గా చిన్న ఉద్యోగం చేశారు కొంతకాలం. ఆయన తండ్రిగారు నటుడు కావడం వల్ల ఆ 'అంశ' ఆంజనేయుల వారికీ అబ్బింది. పద్యాలు

ప్రాక్టీసు చేసి, నాటకాల్లో నటించడం ఆరంభించి స్థానం, పారుపల్లి, కపిలవాయి, జొన్నవిత్తుల మొదలైన పెద్దనటులతో దీటుగా పోటీ పడ్డారు. సియస్ఆర్ ప్రతిభావంతుడని ఆ పెద్దలంతా అభినందించారు. ముఖ్యంగా 'శ్రీకృష్ణ తులాభారం'లో కృష్ణ పాత్ర. ఆ పాత్రతోనే ఆయనకు పేరు. దానికే మాత్రం సంబంధం లేని పేరు తెచ్చిన ఇంకో పాత్ర - రామదాసు. అంచేత ఆ రెండు పాత్రలే ఆయన్ని సినిమాకి రప్పించాయి. ఈస్టిండియా వారు 1933లో తీసిన 'రామదాసు' సియస్సార్ తొలి చిత్రం; తర్వాత కృష్ణపాత్రతోనే 1936లో వచ్చిన 'ద్రౌపదీ వస్త్రాపహరణం' మలి చిత్రం. రంగస్థలం మీద 'తుకారం' ధారణ కూడా సియస్ఆర్‌కు ప్రఖ్యాతి తెచ్చింది. అంచేత అదీ సినిమా అవతారం ఎత్తి 1937లో సియస్సార్‌నే ఎన్నుకుంది. 1939లో పి.పుల్లయ్య నిర్మించిన 'వెంకటేశ్వర మహత్యం'లో శ్రీనివాసుడు సి.యస్సార్. దీంతో అతను ప్రజలకి 'దేవుడే' అయిపోయాడు. దాంతో సినిమా నటుడూ (పూర్తిగా), అయి పోయాడు. సాంఘిక చిత్రం 'చూడామణి'లో హీరో, 'గృహప్రవేశం'లో గిరీశం మార్కు విలనూ. సియస్సార్‌గారు పద్యం చదివే విధానమే వేరు. ఆధోరణి ఆయనదే. పద్యాన్ని విరిచి, విడమరిచి, కొండొకచో 'ప్రోజు'లాగా మాట్లాడుతూ చదవడం ఆయన సొత్తు. దానివల్ల పద్యం అర్థవంతంగా వుండి, ప్రేక్షకులకి అర్థమయేది. 'మాయాబజార్' సినిమాలోని శకుని చదివిన పద్యం గుర్తుకు తెచ్చుకోండి.

**"శకుని ఉన్నచాలు శనియేలనని కదా**
**ఔను నిజమే నేను అంత ఘనుడ**
**కాని పనులకైన కాజేసుకొని గాని**
**మానిపోవలేనే మాయలాడి!"**

అన్న పద్యంలో 'ఔను, నిజమే' అన్న పదాలు పద్యంలా వుండవు. అలాగే, 'మానిపోవలేక మాయలాడి' అన్న మాటలు కూడా నొక్కినొక్కి ఎక్స్‌ప్రెషన్‌తో చదవడం - ఆంజేయులుగారి తీరు. అలాగే ఆ పాత్రధారణ కూడా అనితర సాధ్యం అనిపించారు. 'పాతాళభైరవి'లో మహారాజు? "రాణీ -" అని సాగదీయడం అందరికీ జ్ఞాపకం. మిమిక్రీ కళాకారుల దయవల్ల "తోట రాముడూ! రాజకుమారిని వరించడమే గొప్ప అనుకున్నావా" లాంటి డైలాగులు ఇంకా వినిపిస్తూనే వున్నాయి.

మంచి టైమింగ్ వున్న హాస్యం కూడా ఆయనలో వుంది. గృహప్రవేశం, రత్నమాల, పరమానందయ్య శిష్యులు, చక్రపాణి, సువర్ణసుందరి, జగదేకవీరుని కథ, అప్పుచేసిపప్పుకూడు వంటి సినిమాల్లో ఆ పాళ్లు కనిపిస్తాయి.

**"హాస్యం పలకాలంటే డైలాగ్ టైమింగ్‌రా అబ్బాయి!**
**కుప్పిగుంతులు వేసి, కోతి చేష్టలు చెయ్యడం**
**హాస్యం కాదు. అది కోతే చేస్తుంది. దానికి ఈ**
**ఆంజనేయులెందుకు?"** అని అడిగారోసారి. ఆయన సినిమాల్లో, చెప్పవలసిన ప్రతి డైలాగునీ పదిపదిహేడు సార్లు రకరకాలుగా అనుకునేవారు. 'ఇలా చెప్పనా - అలా చెప్పనా' అని మధన పడే వారు. 'కన్యాశుల్కం'లో రామప్పపంతులు వేస్తున్నప్పుడు ఎప్పటికీ షాటుకి వచ్చేవాడు కాదు.



డైలాగు చూసుకుంటున్నా అనే వాడు ఓ మూల కూచుని" అని ఆ చిత్రం దర్శకుడు పి.పుల్లయ్య చెప్పారు ఒక సందర్భంలో. "ఆ రోజుల్లో నేను కాలేజీలో చదివిన రోజుల్లో-" అని 'జీవితం'లో డైలాగు ఆరంభించిన సియస్సారూ, 'నిత్యకళ్యాణం పచ్చతోరణం' లోని సియస్సారూ ఒకరు కారనిపిస్తుంది.

'భీష్మ' సినిమా (1944)లో కృష్ణుడి వేషం వేశారు సియస్సారు. మంచి పద్యాలున్నాయి. ఆ రోజుల్లో శ్రీకాకుళం థియేటర్లో ఆడుతూ వుంటే ఒక జమిందారు గారు చూస్తున్నారు. యుద్ధ ఘట్టంలో సియస్సార్ పద్యం రాగానే ఆ జమిందారుగారు 'వన్స్‌మోర్' అని కేకవేశారు. కేకవేసింది జమీందారు గారు అని తెలియడానికి కొంత టైము పట్టినా, సినిమా ఆపేసి, ప్రొజెక్టర్లో రీలు వెనక్కి తిప్పి ఆ పద్యం మళ్లీ వేశారు. అక్కణ్నుంచి, రోజు ఆ పద్యం రాగానే జనం 'వన్స్‌మోర్' అని అరవడం ఆరంభించారు. మరీ గోల ఎక్కువైతే, థియేటర్ వారికి తప్పేది కాదు. అదీ - సియస్సార్ రంగస్థలం మీదనే కాకుండా, తెరమీద కూడా సాధించిన ఘనత!

ఆయనకి అరమరికలుండేవి కాదు. ఆడంబ రం తెలీదు. పెద్దా చిన్నా అందరితోనూ కలిసి మెలిసి, సిగరెట్లు, కాఫీ పంచుతూ మైత్రి పెంచు కున్నారు. అటు స్టేజినీ ఇటు తెరనీ సమానంగా వాడుకుని, తేడాలు చూపించారు ఆంజ నేయులుగారు. "తెలుగు సినిమా కారెక్టర్ యాక్టర్లలో ఒక గొప్ప యాక్టరు. నాకిందే నించున్నాడు" అని పాండీబజార్లో నిలబడి వున్న ఆ వృద్ధవృక్షం ఇప్పటికీ గర్వంగా తల ఎగరవేసి చెబు తూనే వుంటుంది - సియస్సార్ గురించి.

## 'సి.ఎస్.ఆర్. శైలి గమనించు' - గుమ్మడికి చక్రపాణి సలహా



'నిత్యకల్యాణం - పచ్చతోరణం' సినిమా తీస్తూ పినిశెట్టి ఒక ముఖ్యమైన పాత్ర గుమ్మడిని వేయమన్నారు. 'హాస్యం, దుష్టత్వం కలిసిన అటువంటి పాత్రకు సరైన నటుడు సి.ఎస్.ఆర్.యే. ఆయనకే ఆఫర్ చేయండి' అని చెప్పారు గుమ్మడి. రెండ్రోజుల తర్వాత పాండీ బజార్లో సి.ఎస్.ఆర్. కనబడితే 'కులాసానా?' అని పలకరించారు గుమ్మడి. 'ఏం కులాసాలే, మీలాటి వాళ్ళు వచ్చాక మాకు అంతా లాసే మేము వేసే వేషాలన్నీ నువ్వు కొట్టేస్తున్నావుగా' అన్నారు సి.ఎస్.ఆర్. వ్యంగ్యంగా. అంటూనే చిన్న నవ్వునవ్వి 'సరదాగా అన్నానయ్యా! పినిశెట్టి వచ్చి అంతా చెప్పాడు. నువ్వయిలాంటి మంచి మనసుతో కలకాలం ఉంటే పరిశ్రమకే ఒక మంచి సంప్రదాయం నెలకొల్పినవాడివి అవుతావు' అని ఆలింగనం చేసుకుని ఆశీర్వదించారు.

నాటకాల నుంచి వచ్చి సినిమాలకు తగ్గట్టుగా అభినయశైలిని మలచుకున్న సి.యస్.ఆర్. మాడ్యులేషన్, ఉచ్చారణ, శైలి జాగ్రత్తగా పరిశీలిస్తుండమని చక్రపాణి గారు తనకు ఎన్నోసార్లు చెప్పారని గుమ్మడి తన జీవిత చరిత్ర 'తీపిగురుతులు - చేదు జ్ఞాపకాలు'లో రాసుకున్నారు.

# సద్గురు సాక్షాత్కారం పొందిన పిరాట్ల శంకర శాస్త్రి

**పిరాట్ల శ్రీశైలశాస్త్రీ, పిచ్చమ్మలకి నలుగురు కొడుకులు....**
**నాలుగో కుర్రాడి పేరు శంకరశాస్త్రి**
**శ్రీశైలశాస్త్రి బావగారు చల్లా సుబ్బారాయుడుగారు చిన్నప్పుడే**
**శంకరశాస్త్రి జాతకం చూసీ.....**
**'బావా వీడు విద్వాంసుడై.... అపారమైన కీర్తి సంపాదిస్తాడయ్యా'**
**అని భవిష్యత్తు చెప్పేశాడు!!**
**శ్రీశైల శాస్త్రిగారికి తన కుర్రాణ్ణి మంచి సంస్కృత పండితుణ్ణి**
**చెయ్యడానికి ఏ కాశీకో పంపించాలని కోరికా!.....**
**తల్లేమో.... తాను ఆధ్యాత్మరామాయణ కీర్తనలు....**
**రామదాసు భజన్లు పాడి సంగీతం వైపు ఆకర్షిస్తోంది!!**
**శంకర శాస్త్రికి చిన్నతనం....**

ఓ వైపు సంస్కృత శబ్దమంజరీ, అమరకోశం, బట్టీయం వేసేస్తున్నాడు. మరో వైపు అమ్మ వొళ్లో కూర్చునీ... ఓ రామా నీనామ మెంత రుచీర... అనో 'చేరీ వినవే శౌరి చరితము గౌరీ' అనో కీర్తనలు నేర్చుకుంటున్నాడు.

రెండు చెవుల్లోంచీ రెండూ వినిపిస్తున్నాయ్

రెండు పెదాలు రెంటినీ ఉచ్చరిస్తున్నాయ్.

సంగీతమపి సాహిత్యం సరస్వతీ పద ద్వయం.

రెండింటికీ నమస్కారం చేస్తూనే ఉన్నాడు...

ఊరెళ్ళాల్సిన సమయ మొచ్చేసింది....

కుర్రాడికి తట్టాబుట్టా సర్ది.... సంస్కృతం నేర్పించడానికి దేశం కాని దేశానికి పంపించడానికి సిద్ధపడ్డాడు శ్రీశైల శాస్త్రి.....

తల్లి పిచ్చమ్మకి చెప్పుకోలేని బాధ.... ఒకటి సంగీతం నేర్చుకోలేక పోతున్నందుకూ... రెండూ.... కన్నబిడ్డ దూరమౌతున్నందుకు...

పడవెక్కాడు శంకరశాస్త్రి....

తల్లీతండ్రి వీడ్కోలు చెప్తున్నారు.

'గురూగారికి సేవలు చేస్తో నాలుగు ముక్కలు వంటబట్టించుకో వెధవా' అన్నాడు తండ్రి.

తల్లి నోట మాట లేదు... మౌనంగా రోదిస్తోంది!.... కన్నీళ్ళు గోదార్లో కలిసిపోతున్నాయ్.

పడవ కదిలింది!!

శ్రీశైల శాస్త్రికి తన బిడ్డ కాశికెళ్ళి సంస్కృతంలో నిష్ణాతుడై.... సభల్లో వాదించి.... గెల్చి శాలువాలు కప్పించుకుని... గండె పెండేరాలు వేసుకో బోతున్నట్టు ఊహించేసుకుంటున్నాడు.

తల్లి నిట్టూర్చి... వెనక్కి తిరిగింది!....

కళ్ళనీళ్ళ మధ్య మసకబారిన తల్లి మొహం తల్చుకుని ఏడుస్తున్నాడు శంకర శాస్త్రి... భుజం మీద చెయ్యి పడింది!.... మామయ్య చల్లా సుబ్బారాయుడుగారు!!!

మామయ్యా... అని బావురుమన్నాడు శంకరశాస్త్రి...

ఒరేయ్... మీ నానకి నచ్చచెప్పలేక... ఎవ్వరికీ తెలీకుండా పడవెక్కాను. ఈ రోజుల్లో సంస్కృతం చదువుకుంటే.... ఏవుందిరా అడుక్కుతినాలి!!

నా మాట వినీ సంగీతం నేర్చుకో... ఎన్నో సంస్థానాలు నెత్తినెట్టుకుంటాయ్ అన్నాడు.

గురువుని వెతుక్కుంటూ మెడ్రాసెళ్లు అన్నాడు మావయ్య.

తారకమంత్రంలా పన్జేసిందామాట.

***

ఓరుగల్లులో సంగీత సభ...

శంకరశాస్త్రి... చేతులు కట్టుకునీ

పలుకే బంగారమాయెనా... అంటూ రామదాసు కీర్తన పాడాడు.

అందరూ ఆనందిస్తున్నారు కానీ... ఒక తమిళుడు మాత్రం ఆ పాటని దీక్షగా వింటూ కుర్రాడు స్టేజి దిగగానే దగ్గరకొచ్చీ 'తంబీ గొంతు, స్వరం ప్రమాదంగా ఉంది! (ప్రమాదం అంటే అద్భుతం అనీ అరవంలో) గానీ అపస్వరం అంతా వొస్తావుంది.

ఎవరైనా గురువుదగ్గర సంగీతం నేర్చుకుంటే రొంబ అళహ ఉండును' అన్నాడు.

దానికి కుర్రాడు సంగీతం నేర్చుకోవాలనే మద్రాసు కెళ్ళాలనుకుంటున్నాను స్వామీ ఆ డబ్బుకోసమే సంగీత సభలో పాడాను అన్నాడు...

అంతే... ఆ తమిళుడు పరమానందభరితుడై.... ఆ కుర్రాడికి డెబ్బై అయిదు రూపాయలిచ్చీ.. చెన్నపట్నం రైలెక్కించాడు!!

***

చెన్నపట్నంలో-

తిరవత్తూర్ త్యాగయ్యగారి దగ్గర కొచ్చీ సంగీతం నేర్పమన్నాడు శంకరశాస్త్రి. ఆయనకేమో ఎనభై ఏళ్ళు... "అబ్బే నా వల్లకాదురా ఓపిక లేదు ఇంకెవరి దగ్గరికెన్నా వెళ్ళు" అనేశాడాయన...

కానీ శంకరశాస్త్రి పట్టుదలా... శ్రద్ధా భక్తులు చూసి అతన్ని శిష్యుడిగా చేర్చుకునీ సంగీతం నేర్పడం ప్రారంభించాడు....

కొన్నేళ్ళు దీక్షగా సంగీతం నేర్చుకున్న తర్వాత.....

మద్రాసులో కలరా వ్యాపించే సరికీ... గురువుగారు శిష్యుణ్ణి ఇక్కడ ఉండడం క్షేమం కాదు నువ్వు నీ ఊరెళ్ళిపో అని ఆజ్ఞాపించారు...

***

శంకరశాస్త్రి రామభక్తుడు....

ఉభయ కుశలోపరి - మీ వ్యాసాలు కొన్ని చాలా బావుంటాయి. కొన్ని అద్భుతంగా ఉంటున్నాయి. సంతోషం... శభాషు.... నటులకు బుర్ర ఉండదనుకునే వాడ్ని. నా అభిప్రాయం తప్పనిపించారు.

కాస్త రసజ్ఞత, కాస్తంత హృదయం, కాస్తంత తడి, ఆర్ద్రత ఇవన్ని కలబోస్తూ వచ్చేది మంచి పాట, మంచి సంగీతం. దాన్ని మరుసటి తరాలకు అందించటం కొంతమందికే సాధ్యం. ఆస్తులు అందరూ ఇస్తారు. పైన నేను చెప్పినవన్ని అందరూ ఇవ్వరు. అది ఇవ్వమని కాస్తోకూస్తో మీ వ్యాసాలు హెచ్చరిస్తూ కర్తవ్యాన్ని బోధిస్తున్నాయి.

నిమ్మరసంలో తేనెలాగో, తేనెలో నిమ్మరసం లాగో జీవితం ఉండాలంటూ ఏం వుండాలో చెప్తున్న మీ వ్యాసాలకు పేరు 'వారసత్వం' (మన)? అంటే బావుంటుంది.

-మురారి, (సినీ నిర్మాత) చెన్నై.

అన్ని కీర్తనలూ రాముణ్ణి స్మరిస్తూ రాసినవే...

**సర్వజనములెచటనుండి వచ్చెను**

**సర్వజగము లెచట లీనము**

**సర్వ వేదాంత సారమదేయని**

**సర్వజ్ఞుడు శ్రీరామచంద్రుడును "సదా నీ నామకీర్తన"**

ఎన్నో కీర్తనలు రాస్తున్నాడు.... గానం చేస్తున్నాడు గానీ శంకర శాస్త్రికి మనశ్శాంతి కలగడం లేదు...

అంచేత 'మంథెన' వెళ్ళి శ్రీ వామదేవ తీర్థ స్వామిని దర్శించి తనకి సన్యాసం తీసుకోవాలనిపిస్తోంది అనుజ్ఞ ఇమ్మంటే 'నువ్వు నాద యోగివి నీకింకా సన్యాసమెందుకూ' అని ఆశీర్వదించి పంపేశారు!

***

విజయనగరంలో సాక్షాత్తూ ఆదిభట్ల నారాయణ దాసుగారి సమక్షంలో తోడి రాగంలో 'తత్తధిమి, తద్ధిమియని శివుడాడేను' అని పాడితే.... 'ఆహా పరమ శివుడి సాక్షాత్కారం చేయించావయ్యా' అంటూ దాసుగారు కావలించుకునీ విజయనగరంలో పలుచోట్ల శంకరశాస్త్రి కచేరీలు ఏర్పాటు చేసారట...

అందులో ఒక కచేరీ.

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న విస్సా అప్పారావుగారింట్లో... ఎంతో మంది సంగీతం విద్వాంసులు, గాయకులు.... పత్రికా సంపాదకులు... రసికులు ... కిటకిటలాడిపోతోంది... ఇల్లు....

విస్సా అప్పారావుగారికి సందేహం కలిగిందట....

శంకరశాస్త్రి చూడ్డానికి అర్భకుడిలా ఉన్నాడు... ఇంతమందిని రంజింప చెయ్యగలడా అని. శంకరశాస్త్రిగారు సభకు నమస్కరించీ సౌరాష్ట్ర రాగాన్ని శుద్ధ దైవతం చేసి పాడ్డం మొదలెట్టారు!!

సభ మొత్తం ఆనందంతో పొంగిపోయింది.

అందులోంచి ... శ్రీనివాసశాస్త్రి అనే రసికుడు లేచీ 'అయ్యా నేను నలభై ఏళ్ళ నించీ ఈ రాగాన్ని వింటున్నాను. శుద్ధ దైవతంలో మీరు చేసిన ప్రయోగం అద్భుతం. మీ పాదాలకి నమస్కారం' అన్నాడు.

అంతే సభ చప్పట్లతో మారుమోగిపోయింది!!

విస్సా అప్పారావుగారు... పరమానంద పడిపోయారు!!

***

1938లో బులుసు సాంబమూర్తిగారు చెన్నపురి ఆంధ్రమహాసభ ఆధ్వర్యంలో సంగీత సభ ఏర్పాటు చేసారు!!



అప్పటికే కర్ణాటక సంగీతంలో దిట్ట శ్రీ టైగర్ వరదాచారి గారు రావడం సంగీత చర్చ!!

బేగడ రాగంలో కాకలి నిషాదం - కైశికి నిషాదాలే కాకుండా వేరొక ప్రయోగం ఉందని టైగర్ వరదాచారి గారు!!

వారిని ఖండిస్తూ శంకరశాస్త్రి గారు బేగడ రాగంలో కైశికి, కాకలి నిషాదాలే ప్రయోగించాలి. అవి రాగచ్ఛాయా స్వరాలని త్యాగరాజ స్వామి, దీక్షితార్ మొదలైన వాగ్గేయకారుల కృతుల్లో, గీతాల్లో వర్ణాల్లో వాటిని చూపించి ధృవీకరించారు వీటిని మద్రాస్ సంగీత అకాడమీ వారు తీర్మాన రూపంలో స్వీకరించి రూపొందించారు.

అలాగే ఆ సభలో శంకరశాస్త్రిగారు - శంకరాభరణ రాగాన్ని ఆరోహణ అవరోహణ క్రమంలో తారా స్థాయిలో సంచారం చేస్తోంటే "శంకరుడే తాండవించినట్లుందని" ప్రసిద్ధ వైణికులు ఈమని అచ్యుత రామశాస్త్రిగారు సభాముఖంగా మెచ్చుకున్నారు.

***

1944....

తిరువయ్యూరు త్యాగరాజస్వామి వారి ఉత్సవాలు...

ఆయన 'సమాధి' ముందు ఎంతోమంది సంగీత కళాకారులు...

శ్రవణానందంగా, భక్తి పురస్సరంగా... తన్మయత్వంలో ఘనరాగ పంచరత్నాలు పాడారు....

తర్వాత శంకరశాస్త్రిగారు....

అహిరి రాగంలో... "ఆ దయ శ్రీరఘు' అని కీర్తన ఆరంభించారు. కళ్ళు మూసుకుని అలౌకిక పారవశ్యం పొందుతున్నారు.

కళ్ళముందు మెరుపు మెరిసినట్లయింది.

బంగారుచ్ఛాయలో త్యాగరాజస్వామి వారు మందహాసం చేస్తూ దర్శనమిచ్చినట్లయింది.

కళ్ళల్లోంచి ధారాపాతంగా నీరు కారిపోతోంది!!

ఈ జన్మకీ అనుభూతి చాలు అనుకున్న పిరాట్ల శంకరశాస్త్రిగారు వెంటనే తోడిరాగంలో 'త్యాగరాజ సద్గురు స్వామీ' అనే కీర్తనలు ఆశువుగా పాడి బ్రహ్మానందానుభవం పొందారు.

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**

గొప్పవారి జీవితాల గురించి రాసిన గ్రంథాలు చూడబోతే ఇంచుమించు అందరి జీవితం, సాధించిన విజయాలు ఒకేలాగ కనబడతాయి. వ్యాసంలా చదవబోతే చప్పగా ఉంటుంది. భరణిగారు ఆ జీవితాలను మథించి ఒక పాయింటు పట్టుకుని ఏదో స్వయంగా కళ్లతో చూసినట్లు డ్రమటైజ్ చేసి ప్రతీ పక్షం మనకో అద్భుతమైన స్క్రీన్‌ప్లే ఇస్తున్నారని అనిపిస్తూనే ఉన్నా ,16-30 జూన్ 2002 నాటి సంచికలో వాసా అప్పయ్యగారిపై రాసిన వ్యాసంలో ఆ కళను పరాకాష్టకు తీసుకు వెళ్లారనిపించింది. మామూలు కాలకృత్యాలలోనే సంగీతం చూడవచ్చంటూ 'ఓపెన్' చేయడం గురించి కాదు నేననేది. నెత్తి మీద నిమ్మకాయ పెట్టుకుని వాయించడం సంగతి! ఆ ఐడియా రావడం, ఘనరాగ పంచకీర్తనలన్నిటినీ నిమ్మకాయకు అన్వయించడం అద్భుతం! ఇక దిష్టితీసి పారేయడానికి నిమ్మకాయ థీమ్ వాడడం మాస్టర్‌స్ట్రోక్..! భరణి 'టచ్'!

**-ఎమ్మెస్ స్వాతి, హైదరాబాద్**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**

**మోతీనగర్, హైదరాబాదు - 500 018**

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

జులై 3న 74వ జయంతి సందర్భంగా...

# వసంత స్వర ఝరి ఎం.ఎల్.వసంత కుమారి

**భారతీయ శాస్త్రీయ సంగీత ప్రపంచంలో ఆమె నిత్యవసంతం. ఆమె ఓ సంగీత భాండాగారం. రాగసుధారస సముద్రంలో ఒక అమృత బిందువు. ఆమె గొంతులో రాగాలు జీవం పోసుకుంటాయి. ఆ రాగతరంగాలు కళా ప్రపంచ హృదయ వీణను సుతారంగా మీటుతాయి. ఆమె ఆలపించిన రాగంలో లోకం పరవశించి పోతుంది. ఆ గానామృత వర్షిణి "ఎం.ఎల్.వసంతకుమారి".**

దక్షిణ భారతదేశంలో కర్ణాటక సంగీత త్రయంగా ఎం.ఎస్.సుబ్బలక్ష్మి, డి.కె.పట్టమ్మాళ్‌లతో కలిసి ఎమ్మెల్వీ సాగించిన స్వరయాత్ర అత్యున్నత శ్రేణికి చెందినది. 1928 జులై 3న సంగీత విద్వాంసులైన అయ్యస్వాములు లలితాంగి దంపతులకు జన్మించిన ఎం.ఎల్.వసంతకుమారి తల్లిదండ్రుల నుండి సంగీతాన్ని వారసత్వ సంపదగా స్వీకరించింది. వారి వద్దే తొలి సంగీత పాఠాలు నేర్చుకుంది. పదకొండేళ్ల చిరుప్రాయంలోనే వసంతకుమారి చేసిన గాన కచేరి ఎందరో సంగీతజ్ఞుల ప్రశంసలందుకున్నది. ప్రఖ్యాత కర్ణాటక సంగీత విద్వాంసుడు జి.ఎన్.బాలసుబ్రమణ్యాం వద్ద శిష్యరికం చేసి సంగీత సాధనలో పరిపక్వత సాధించింది. అనతికాలంలోనే గురువును మించిన శిష్యురాలైంది. గానంలోని మాధుర్యం, మార్దవం, లాలిత్యం సంగీత శాస్త్ర విద్వత్తు, భావం ఎమ్మెల్వీకి పెట్టని ఆభరణాలైనవి. ఆమె పాడిన కీర్తనలన్నీ రసగుళికలే. కర్ణాటక సంగీత శైలిలో సృజనాత్మక ప్రతిభను కనబరచిన ఘనత కూడా ఈమెదే.



కర్ణాటక సంగీతంలో వసంత కుమారిది ఒక ప్రత్యేకమైన ముద్ర. వీరవసంతమైనా, కళ్యాణ వసంతమైనా, చంద్రజ్యోతి అయినా, వేగవాహిని అయినా శ్రోతలను రాగతరంగాలపై తేలియాడించే వారు. నాద ప్రధానమైన గానంతోనే ఆమె శ్రోతలను తన్మయులను చేసేవారు. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషల్లో సుమారు 400కు పైగా గ్రామ్ ఫోన్ రికార్డులిచ్చారు.

సాధారణంగా ఒక్కో సంగీతజ్ఞుడు ఒక్కొక్క వాగ్గేయకారుడ్ని తమకు ఆదర్శంగానో, లక్ష్యంగానో ఎంచుకుని వారి కీర్తనలే ఎక్కువగా గానం చేస్తుంటారు. ఎం.ఎల్.వసంత కుమారి కూడా పురందర దాసు కీర్తనలను ప్రత్యేకించి పాడేవారు. ఇక ఉడిపి కృష్ణుని స్మరించే కీర్తనలన్నీ ఆమె చేతవెన్న ముద్దల్లా కమ్మగా పేయంగా ఉంటాయి. "బారో కృష్ణయ్య", "కృష్ణా నీవేగనెబారో" వంటి కీర్తనలు ఎమ్మెల్వీ స్వరంలో పరిపూర్ణతను పొందాయి. తిల్లానా కావచ్చు. ముత్తుస్వామి దీక్షితులు కీర్తనలు కావచ్చు. పురందరుని కీర్తనలు కావచ్చు. సంస్కృత శ్లోకాలూ కావచ్చు. ఏవైనా సరే వసంత కుమారి పాడితే "శోభిల్లు సప్తస్వరములు".

ఎమ్మెల్వీ దృష్టిలో హిందుస్తానీ, కర్ణాటక సంగీతాలకు సమాన గౌరవం ఉంది. సంగీత వ్యాకరణం, ప్రతిభా పాండిత్యాలతో సంగీత సరస్వతికి నిలువెత్తు నిదర్శనంగా వెలిగి పోయిన ఆమె కంఠంలోని మాధుర్యాన్ని గుర్తించిన సినిమా ప్రపంచం తమ స్థాయికి అవసరమయ్యే పాటలు పాడించుకున్నారు. 'హంసగీతె', 'పార్దిబన్ కణవు', 'భూకైలాస్' వంటి చిత్రాల్లో పాటలు పాడారు. వి.శాంతారాం తమిళంలో తీసిన "నమ్‌నాడు" చిత్రంలో హీరోయిన్ పాత్రకు ఎమ్మెల్వీ చేతనే పాడించారు. ఎస్.రాజేశ్వరరావు, సి.ఆర్.సుబ్బరామన్, పెండ్యాల, సుసర్ల దక్షిణామూర్తి వంటి వారు తాము తొలి దశల్లో సంగీతం అందించిన చిత్రాల్లో ఎమ్మెల్వీచే పాడించుకున్నారు. 'జయభేరి'లో 'నీవెంత నెరజాణవేరా' పాడారు.

తమిళ తత్త్వాలు మొదలుకుని జావళీలు, లలిత గీతాలు, తిరుక్కురల్ నీతిశ్లోకాలు, సంస్కృత అష్టపదులు ప్రత్యేకించి ఇళా, గోదాదేవిలపై భక్తి శృంగార సాంప్రదాయ కృతులు, 'తలాట్టు' పాటలు -పిల్లల కోసం పాడే అన్ని రకాల పాటల నుంచి జయదేవుని అష్టపదుల వరకు అద్భుతంగా పాడి మన జాతీయ సంస్కృతిలో భాగమయ్యారు ఎమ్మెల్వీ. మరో వైపు హైదరాబాదు, విజయవాడ ఆకాశవాణి వారి పుణ్యమాని ఆంధ్రులకు వసంతకుమారి ఆత్మబంధువైంది. వీటన్నింటినీ మించి భారతదేశం అంతటా వందలాది కచేరీలుచేసి సంగీత జ్ఞానమున్న ప్రతి ఒక్కరికీ అభిమాన వాగ్గేయకారిణిగా మదిలో నిలిచిపోయారు. దేశ దేశాల్లో భారతీయ సాంస్కృతిక రాయబారిగా కచేరీలు చేసి కర్ణాటక సంగీత కీర్తి పతాకాన్ని అంతర్జాతీయంగా ఎగుర వేశారు. దైవదత్తమైన గాత్రంతో వేదికపైన కచేరీ చేస్తుండగా గంటల కొద్ది ఆమె గానంబోనిధిలో ప్రేక్షక శ్రోతల హృదయాలు ఓలలాడేవి.

వసంతకుమారి సంగీత ప్రావీణ్యానికి మెచ్చి విశ్వవ్యాప్తంగా పలు సాంస్కృతిక సంస్థలు, విశ్వవిద్యాలయాలు సన్మానాలు చేసి బిరుదులు ప్రదానం చేశాయి. 1967లో భారత ప్రభుత్వం "పద్మభూషణ్"తో సన్మానించగా, 1969లో న్యూఢిల్లీ సంగీత అకాడమీ "తిరుప్పావైమణి" బిరుదాన్నిచ్చింది. 1976లో మైసూరు యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్ నిచ్చింది. 1978లో మద్రాసు అకాడమి వారు "సంగీత కళానిధి"తో ఘనంగా సన్మానించారు. 1976లో అమెరికా పర్యటన సందర్భంలో భారత సంగీత సంస్థ వారు ఎమ్మెల్వీని "నాదజ్యోతి" బిరుదాన్నిచ్చారు. 1982లో గుంటూరు సాంస్కృతిక కేంద్రం వారు అన్నమాచార్య ఉత్సవాల సందర్భంగా "సంగీత విదుషీమణి" బిరుదుతో సత్కరించగా, ఉత్తర అమెరికాలోని కర్ణాటక సంగీత అకాడమీ "గానజ్యోతి" పురస్కారాన్నిచ్చారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆస్థాన విద్వాంసురాలిగా

నియమితురాలవడమే గాక "సప్తగిరి సంగీత విద్వన్మణి" బిరుదునందుకున్నారు. తిరుపతి పద్మావతి మహిళా విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా కూడా కొంతకాలం పనిచేశారామె. నిరంతరం సంగీత సాధనలో, బోధనలో, శోధనలో తన జీవితాన్ని తరింపజేసుకున్న ఎమ్మెల్వీ జిడ్డు కృష్ణమూర్తి ఇంటర్నేషనల్ ఫౌండేషన్, దారురుషి వాలీ సంగీత కళాశాలలో ఆచార్యపదవి నలంకరించి ఎందరో విద్యార్థులకు సంగీత కళను బోధించారు.

వసంతకుమారి సీనియర్ కేంబ్రిడ్జి చదువుకొన్నారు. ఇంగ్లీషులో అనర్గళంగా ప్రసంగించేవారు. ఎన్నో సహాయ నిధుల కోసం ఆమె దేశ దేశాల్లో ఉచితంగా కచేరీలు చేశారు. అందుకే ఆమెను పురందరదాసు ఆరాధనా కళామండలి "సంగీత రత్నాకరం", మద్రాస్ ఆర్ట్స్ అకాడమి 1954లో "సంగీత వాణి", కుంభకోణం కళాలయ సంగీత సభ వారు "అమృతగాన వర్షిణి"గా, విశాఖ సంగీత అకాడమి 'సంగీత కళాసాగర' వరించాయి. 1973లో నేపాల్ రాజ దంపతులు స్వయంగా ఆహ్వానించి కచేరీ ఏర్పాటు చేయించుకుని, ఎమ్మెల్వీని ఘనంగా సన్మానించారు. ఆమె గొప్ప గాయని మాత్రమే కాదు. తన మనో ప్రపంచంలో ఒక వేదాంతి కూడా! విశ్వవిఖ్యాత తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి. మద్రాసులో ఎమ్మెల్వీ ఇంటి ఆవరణలోని తోటలో తరచూ వేదాంత, తత్త్వబోధనలు చేశారు. ఇంకా ఆమె తెలుగు, తమిళ భాషల్లో పురందరదాసు కీర్తనలను ప్రచురించారు. సినీ నటి శ్రీవిద్య ఎమ్మెల్వీ కూతురే.

ఎమ్మెల్వీ తన చివరి రోజుల్లో గొంతుకు సంబంధించిన కాన్సర్ వ్యాధితో, పచ్చకామెర్లతో బాధపడుతూ 1990 అక్టోబర్ 31న 62వ ఏట మద్రాసులో తుది శ్వాస విడిచి స్వరలోకం చేరుకున్నారు. "సంగీతమొక్కటే సర్వమానవ సామాన్య భాష" అన్న మహాకవి ఖలీల్ జీబ్రాన్ మాటలను అక్షర సత్యాలు చేసి సంగీతాన్ని పండిత పామరులకు చేరువ చేసిన ఎమ్మెల్వీ జీవితకాలం కర్ణాటక సంగీత ప్రపంచంలో వసంతం వెల్లివిరిసిన మహత్తర శకం.



**-పి.మాలతి**




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. ఊసు (మిస్సమ్మ... ఔనంటే కాదనిలే)
   ఎ) ఊహ బి) ఆశ
   సి) ఊరు డి) సమాచారము
2. లోటారం (మిస్సమ్మ... సీతారాం)
   ఎ) గుడారము బి) ఆర్భాటం
   సి) ఖాళీ డి) గిన్నె
3. శోధన (మిస్సమ్మ... కరుణించు)
   ఎ) సాధన బి) ప్రాయశ్చితము
   సి) అందము డి) కోపము
4. మోసులు (మిస్సమ్మ... బృందావనమిది)
   ఎ) కబుర్లు బి) తాళ్ళు
   సి) నిచ్చెనలు డి) మొలకలు
5. సామంతము (మిస్సమ్మ... రావోయి)
   ఎ) అహంకారము బి) దిట్టతనం
   సి) కోపము డి) వలపు
6. కలికము (మిస్సమ్మ... ఏమిటో ఈ మాయ)
   ఎ) అబద్ధము బి) కాలము
   సి) కన్ను డి) కాటుక
7. చేల (భక్తప్రహ్లాద - ఆది అనాదియు)
   ఎ) వస్త్రము
   బి) అమాయకురాలు
   సి) పల్లెము
   డి) హారము
8. అపరంజి (మురారి... అలనాటి)
   ఎ) బంగారము బి) సంతోషము
   సి) రత్నము డి) మైనము
9. అన్ను (మురారి... అలనాటి)
   ఎ) ఇతరులు
   బి) స్త్రీ
   సి) అభిమానము
   డి) ధనికులు
10. కందు (అన్నమయ్య... మూసిన)
   ఎ) బొట్టు
   బి) కోపము
   సి) లోపము
   డి) సాటి

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) C

బాలు

జులై 14న అనిల్ బిశ్వాస్ 88వ జన్మదినం సందర్భంగా...



# ఆర్కెస్ట్రా పద్ధతిని పరిచయం చేసినది ఆయనే... అనిల్ బిశ్వాస్

అది స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగా కొనసాగుతున్న కాలం. 20 ఏళ్ల ఓ కుర్రవాడు దేశభక్తితో ఆంగ్లేయుల ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేసి విప్లవవాదిగా గుర్తింపబడి పోలీసుల "వాంటెడ్ లిస్ట్"లో కెక్కెడు. ఒకసారి పోలీసులు తరుముకొస్తుండగా ఒక వేశ్యాగృహంలో తలదాచుకున్నాడు. అక్కడే అతని జీవితం మలుపు తిరిగింది. అక్కడే జీవనం సాగించే ఓ స్త్రీ ద్వారా ఒకానొక రికార్డింగ్ కంపెనీలో చేరి పోలీసుల కంటబడకుండా జీవికను గడిపాడు. అలా ఆనాడు తనను తాను రక్షించుకోవడానికి సంగీత ప్రపంచంలోకి వచ్చిన ఆ కుర్రవాడికి తెలీదు, తానే భారతీయ సినీ సంగీతానికి సరికొత్త బాణీలందించి అలరిస్తానని. ఆ కుర్రవాడే నేటి భారతదేశ అత్యంత సీనియర్ సంగీత దర్శకుడు "అనిల్ బిశ్వాస్".

అనిల్ బిశ్వాస్ నేటి బంగ్లాదేశ్‌లోని బారిసాల్‌లో 1914 జులై 14న జన్మించారు. భక్తి గీతాల నాలపించే తన తల్లి ప్రభావం ఆయనపై బల మైన ముద్రవేసింది. దాంతో చిన్ననాటి నుండే సంగీతం పట్ల అభినివేశం పెంచుకున్నారు. మరో విచిత్రమేమిటంటే ఆయన చిన్ననాటి నుండే స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడం, పలుమార్లు జైలుకెళ్లి బ్రిటీష్ వారి లాఠీ దెబ్బలు తినడం. బిశ్వాస్ బాల్యమిత్రుడొకరు ఇలా అంటారు. "అనిల్ జీవితం సంగీతానికంకితం కావల సింది కాదు. అతగాడు చురుకైన విప్లవాదిగా ఉండవలసిన వాడు. మహా అయితే దేశభక్తి గీతాల్ని స్ఫూర్తి దాయకంగా ఆలపించి ఉండే వాడేమో! అయినా సంగీతం అతడి నరనరాల్లో ప్రతి అణువణువులో జీర్ణించుకుపోయింది.

పరిస్థితులు వెంట తరుముకు రావడంతో బారిసాల్ నుండి బొంబాయికి వచ్చిన అనిల్‌బిశ్వాస్ మధ్యలో కొంతకాలం కలకత్తాలో గడిపారు. తొలుత రికార్డింగ్ కంపెనీలో చేరిన ఆయన అంచెలంచెలుగా ఎదిగి సంగీత దర్శకుడైనారు. అక్కడి నుండి కర్దార్ స్టూడియోలో 250 రూపాయల జీతానికి కుదిరారు. ఆయన బెంగాలీ కావడంతో హిందీ రంగంలో చాలా కష్టాలనుభవించారు. స్టూడియో యజమాని బిశ్వాస్ గానమాధుర్యాన్ని విని మొదట ఒక చిత్రానికి పని చేయడానికి కుదుర్చుకున్నారు. అయితే ఆ తరువాత 8 చిత్రాలకు సంగీతం చేయించుకున్నారు. 'ఫాతిమా', 'త్రిమూర్తి', 'డాకూ', 'బుల్‌డాగ్', 'జెంటిల్‌మెన్', 'పియాకి జోగన్' మొదలైనవి వాటిలో ఉన్నవి.

కర్దార్ స్టూడియో నుండి 'సాగర్ మూవీటోన్'లో చేరి సినీ సంగీత ప్రపంచంలో అసంఖ్యాకమైన ప్రయోగాలు చేసి నూతన పోకడలకు శ్రీకారం చుట్టారు. 12 మందిచే ఒకేసారి వాయిద్యాలను పలికించడం ఈయన చేసిన తొలి ప్రయోగం. హిందీ సినిమాలకు వాయిద్య బృందాలను (ఆర్కెస్ట్రా) పరిచయం చేసిన ఘనత



అనిల్‌బిశ్వాస్‌దే. ఆ కాలంలో బాలీవుడ్‌నే కాదు హాలీవుడ్ సినిమా కారులను సైతం అబ్బురపరచిన ఘనుడాయన. ఆ రోజుల్లో వానకురుస్తున్న శబ్దానికి, గుర్రాలు పరుగెడుతున్న శబ్దాలకు హాలీవుడ్‌లో పుష్‌బటన్ సిస్టమ్‌ను వినియోగించే వారు. అయితే బిశ్వాస్ వీటికోసం అంత కష్టపడకుండా డబ్బాలో సన్నగా బియ్యం పోస్తూ వాన కురిసిన శబ్దాన్ని, తొడచరిచి గుర్రాలు పరుగెత్తే శబ్దాన్ని సృష్టించ వచ్చని చూపి హాలీవుడ్ సినిమా సంగీత దర్శకులను అబ్బురపరిచారు.

అనిల్ సినీ జీవితం 'సాగర్ మూవీటోన్' లో చేరిన తరువాత మలుపు తిరిగింది. 1936లో 'సాగర్' వారి 'జాగిర్దార్' సినిమా ఆయనకు ఎనలేని గుర్తింపును, ఖ్యాతిని తెచ్చిపెట్టింది. ఈ సంస్థ నుండి బాంబే టాకీస్‌లో చేరడం మరో కొత్త మలుపు తిప్పింది. వీరి "కిస్మత్" చిత్రానికి అనిల్ బిశ్వాస్ చేసిన సంగీతం పాటలకు ప్రాణం పోసింది. ఈ చిత్రం ఏకబిగిన మూడేళ్లపాటు ప్రదర్శితమై 1975లో "షోలే" వచ్చేవరకు రికార్డుగా ఉండిపోయిన విషయం తెలిసిందే.

ఈ నేపథ్యంలో అనిల్‌బిశ్వాస్ 'ఔరత్', 'అనోఖా ప్యార్', 'పెహలీనజర్', 'బసంత్', 'మిలన్', 'గజ్రీ', 'బడీబహన్', 'పర్‌దేశీ', 'ఛోటీ ఛోటీ భాతే', 'వారిస్', 'లాజవాబ్', 'అంగులీమాల', 'లాడ్‌లీ', 'ఆరామ్', 'బేకుసూర్', 'బడీబహూ', 'దో సితారే', 'నాజ్', 'దోరహా', 'హమ్‌దర్ద్', 'రాహీ', 'మాన్', 'జల్తీనిషాన్', 'ఛోటీబహెన్', వంటి సుమారు వంద చిత్రాలకు సంగీతమందించారు.

అనిల్ బిశ్వాస్ కూర్చిన బాణీలు, స్వరాలు ఎంతో సహజంగా ఉంటాయి. ఆయన స్వరాలు

ప్రకృతి చేసే శబ్దాలుగా అనిపిస్తాయి. చెట్ల ఆకుల గలగలలు, గాలిచేసే ధ్వని ఆయన సంగీతంలో ప్రధాన పాత్ర వహిస్తాయి. అందరిలాగాక ఆయన పాట రాసిన తరువాతే ట్యూన్‌లో కట్టేవారు. అంతేగాని ముందు ట్యూన్ చేసి దానికి ఏవో పదాలు సృష్టించి చొప్పించే వారు కారు. ఇంకో విశేషమేమిటంటే ట్యూన్‌లు చేయడానికి ఏనాడూ హార్మోనియం ముందు కూర్చొని విలక్షణ సంగీతాకారులాయన. వేరే పనులు చేస్తుండగా మదిలో మెదిలే భావాలతో స్వరకల్పన చేసే వారు. వాయిద్యాల హోరులో పాటలోని సాహిత్యాన్ని మరుగున పడనీకుండా చూసుకోవడం ఆయనలోని ప్రత్యేకత. అందుకే ఆయన పాటలు ఇప్పుడు విన్నా వినసొంపుగానే ఉంటాయి.

లతా మంగేష్కర్ తొలినాళ్లలో అనిల్ బిశ్వాస్ సంగీతంలో పాడి జనసామాన్యానికి చేరువైనారు. 1948లో వచ్చిన 'అనోఖా ప్యార్'లో ఆమె పాడిన 'యాద్‌రఖ్‌నా చాంద్', 'జీవన సప్నా టూట్‌గయా', 'అబ్‌యాద్ న కర్' వంటి ఏడు పాటలు ఆ రోజుల్లో హిట్ సాంగ్స్. ఇంకా ఆయన స్వరపరచిన పాటల్లో "ఏక్ దిల్ కో గానా బాకీథా", "ఓ దిల్ భీలగా కే దేఖ్‌లియా' (అనోఖాప్యార్), 'జమానేకా దస్తూర్ హై ఏ పురానా' (లా జవాబ్), 'రసియారే మన్ బసియారే' (వరదేశి), 'కహోనైనోమై కజ్ రాభరో' (బడీబహూ), 'కచ్చీహై ఉమరియా' (అంగుళీమాల) 'కుచ్ ఔర్ జమానా' (ఛోటీ ఛోటీ బాత్), 'రహెమత్ వాలే (వారిస్) వంటి వందలాది ఆపాత మధుర గీతాలున్నవి. ఇంకా 'భారత్ కీ బేటీ'లో కుమార్ నటిస్తుండగా వెనుకనుండి బిశ్వాస్ గానం చేయడంతోనే హిందీలో తొలి నేపథ్యగానం మొదలైంది. ఇలా తొలి ప్లే బ్యాక్ సింగర్ కూడా వీరే.

పోతే లతా మంగేష్కర్ పాటల ప్రపంచంలో అనిల్‌బిశ్వాస్‌కున్న స్థానం అత్యున్నతమైనది. ఆమెకు తొలినాట మదన్‌మోహన్‌తో బాటు బిశ్వాస్ అందించిన స్వరసహకారం కెరీర్‌లో పునాదులు గట్టి పడేందుకు తోడ్పడింది. లత పాడిన "ఓ దిన్ కహాగయా", "బద్‌లీ తేరీ నజర్‌తో నజర్ బదల్ గయా', 'కట్‌తిహైతో అబ్‌జిందగీ', 'బేయిమాన్‌తేరీ నైన్‌వా', 'మస్త్‌పవన్‌హై చంచల్ ధారా' వంటి పాటలు అనిల్ బిశ్వాస్ సంగీతంలోనివే.

అనిల్ బిశ్వాస్ 1935 నుండి 1965 దాకా 30 ఏళ్ల పాటు చిత్ర పరిశ్రమను ఏలి ముఖేశ్, తలత్ మొహమూద్, సితారా దేవి, సర్దార్ అఖ్తర్, అశోక్ కుమార్ వంటి గాయనీ గాయకులను పరిచయం చేసారు. అయితే తలత్ మొహమూద్ అంటే ప్రత్యేక అభిమానం ఆయనకు. "వందలాది కిశోర్, ముఖేష్, రఫీలు పుట్టవచ్చుగానీ తలత్ వంటి గాయకుడు మళ్లీ పుట్టడంటారు". తొలి దశలో



**సి.రామచంద్ర, లత, మదన్‌మోహన్‌లతో అనిల్‌బిశ్వాస్**

నూర్జహాన్‌ను అనుకరించే లతను నీ భవిష్యత్‌కు మంచిది కాదు. నువ్వు రెండో నూర్జహాన్ అవ్వనవసరం లేదు. మొదటి లతామంగేష్కర్‌వి అవ్వాలి' అని ఉద్బోధించారు. సైగల్‌ను అనుకరించే ముఖేశ్‌కి కూడా అలానే చెప్పారు.

ఎందరో సంగీత దర్శకులకు ఆరాధ్యుడైన అనిల్ బిశ్వాస్ ఆరాధించే వారెందరో ఉన్నారు. ఆర్.సి.బోరాల్, జైదేవ్, గులాం హైదర్‌లు ఆయన అభిమాన సంగీత దర్శకులు. ఆయన భార్య మీనాకపూర్ కూడా తొలినాటి సినీ నేపథ్యగాయనే.

స్వాతంత్ర్యానంతరం సినీ రంగంలో విలవలు మారడంతో స్వచ్ఛందంగా పరిశ్రమకు దూరమైన అనిల్ బిశ్వాస్ ఆకాశవాణిలో చేరి చాలాకాలం పాటు శాస్త్రీయ, లలిత సంగీత కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఆయన సేవలకు గుర్తింపుగా మధ్యప్రదేశ్ ప్రభుత్వం లతా మంగేష్కర్ అవార్డుతో సన్మానించగా, 1999లో జీ.టివి వారు లైఫ్ టైమ్ అచీవ్‌మెంట్ అవార్డుతో సత్కరించారు.

భారతదేశంలో టాకీలు వచ్చిన తరువాత హిందీ చిత్రసీమ సంగీతంలో ట్రెండ్ సెట్టర్స్‌గా చెప్పుకునే ఆరుగురిలో ఒకరైన అనిల్ బిశ్వాస్ (మిగతా అయిదుగురు నౌషాద్, సచిన్‌దా, నయ్యర్, సలీల్‌చౌధురి, ఆర్డీబర్మన్)కు ప్రభుత్వ పరంగా లభించిన గుర్తింపు లేదు. ఆయనకన్నా జూనియర్లకు ఫాల్కే అవార్డులిచ్చారు గానీ సెలక్షన్ కమిటీ వారి దృష్టికి అనిల్ బిశ్వాస్ రాకపోవడం శోచనీయం. కొంతకాలం పాటు జీ.టివి వారి "సరిగమ" కార్యక్రమంలో భాగం పంచుకున్న ఆయన భారతీయ సినీ సంగీత దర్శకులెందరికో ఓ కొసమెరుపుగా చెప్పుకోదగిన స్వరబ్రహ్మ.

-హెచ్.రమేష్‌బాబు






సంగీత సాహిత్యాలకు పెద్దపీట వేసిన నిర్మాణ సంస్థల్లో విజయావారిది అచంచల అగ్రస్థానం. వారి పాటల్లో సినిమా కథ, పాత్ర వ్యక్తిత్వమే కాక ప్రతి మనిషికీ కావలసిన జీవితానుభవసారం మొత్తం తొంగిచూస్తూ ఉంటుంది. ఇప్పటికీ విజయావారి పాటలు సజీవంగా ఉండడానికి, తరువాతి తరానికి ఒక సాంస్కృతిక వారసత్వంగా మనం వాటిని అందజేసుకోగలగడానికి, అదే కారణం. 1955లో విడుదలైన

## మిస్సమ్మ

చిత్రంలోని ప్రతీపాటా ఒక ప్రత్యేకతను సంతరించుకుంటూ అందుకు సాక్ష్యంగా నిలబడతాయి. పింగళి నాగేంద్రరావు రచించిన ఈ పాటలను సాలూరి రాజేశ్వరరావు స్వరపరిచారు. 'ముఖే ముఖే సరస్వతీ' అన్నట్టు ఇద్దరూ సరస్వతీ రూపాలే. పింగళివారు పుంభావ సరస్వతి అయితే రాజేశ్వరరావుగారు రసభావ సరస్వతి. ఇటువంటి కలయిక -'కల ఇక'- అనుకునే విధంగా ఆ చిత్రంలో వారిరువురూ ప్రాణప్రతిష్ట గావించిన పధ్నాలుగు పాటల్లో విజయావారి విజయకేతనాన్ని నేటికీ ఎగురవేయగల ఓ తొమ్మిది ప్రతిష్టాత్మక గీతాలివి.











ఔనంటే కాదనిలే - కాదంటే ఔననిలే
ఆడువారి మాటలకు - అర్థాలే వేరులే ॥ఔనంటే॥
అలిగి తొలగి నిలిచినచో - చెలిమి చేయ రమ్మనిలే
చొరవచేసి రమ్మనుచో - మరియాదగ పొమ్మనిలే ॥ఆడువారి॥
విసిగి నసిగి కసిరినచో - విషయమసలు ఇష్టమెలే
తరచి తరచి వూసడిగిన - సరసమింక చాలనిలే ॥ఆడువారి॥



*This feature is sponsored for 6 issues by*
**Sri MANISHARMA** ***(music director)***
in memory of his beloved friend
late THIRUPATHI SWAMY *(director)*

స్త్రీ మనస్తత్వాన్ని మనోనేత్రంతో వీక్షించి ప్రతీవాక్యం ఒక శాస్త్రకారుని భాష్యంలా రూపొందించిన పాట 'ఔనంటే కాదనిలే, కాదంటే ఔననిలే'! ఈ పాటలోని 'ఆడవారి మాటలకు అర్థాలే వేరులే' అనే వాక్యం ఎంత పాపులర్ అయిందంటే ఆ మాటను ఓ సామెతలాగా, ఓ సూక్తిలాగా వాడడమేకాక, నిజంగా అసలది ఓ సామెతే అని భావించేవాళ్ళు కూడా ఎంతోమంది ఉన్నారు. వారికి పింగళి, సాలూరి, ఏ.యం.రాజా, ఎన్టీఆర్, విజయావారు, "మిస్సమ్మ" గురించి తెలియకపోవచ్చు. కానీ ఆ వాక్యం "మిస్సమ్మ" ద్వారానే తెలుగువారికి అందిందంటే నమ్మలేరు. అంతటి శాశ్వత స్థానం తెలుగు భాషలో సంపాదించుకుంది ఆ వాక్యం. జానపద సంగీత పోకడలను నవీనం చేస్తూ మలచబడ్డ ఈ పాటకు 'పీలూ' రాగం ఆధారం. ఇటీవల విడుదలయిన పవన్‌కళ్యాణ్ 'ఖుషీ'లో ఈ పాటను తిరిగి అదే సంగీత సాహిత్యాలతో వాడడం, ఆ పాట ఇప్పటి పాటలను మించిన ఘనవిజయాన్ని సాధించడం ఇవన్నీ ఈ తరానికి తెలిసిన విషయాలే అయినా ఈ పాటకున్న 'బలం ఇదీ' అని ఓసారి మననం చేసుకోటానికే ఈ ప్రస్తావన! ఏయమ్ రాజా పాడిన ఈ పాటను ఎన్.టి.ఆర్., రేలంగి అభినయించారు.



సీతారాం - సీతారాం - సీతారాం - జైసీతారాం ॥సీతారాం॥
పైన పటారం లోన లొటారం - ఈ జగమంతా దంబాచారం ॥సీతారాం॥
నీతులు పలుకును ధర్మవిచారం - గోతులుతీసే కూటాచారం ॥సీతారాం॥
చందాలంటూ భలే ప్రచారం - వందలు వేలు తమ ఫలహారం ॥సీతారాం॥
గుళ్ళోహాజరు ప్రతి శనివారం - గూడుపుఠానీ ప్రతాదివారం ॥సీతారాం॥
డాబులుకొడుతూ లోకవిహారం - జేబులుకొట్టే ఘన వ్యాపారం ॥సీతారాం॥
టాకుటీకుల టక్కుటమారం - కలికాలం మనగ్రహచారం ॥సీతారాం॥



ఈ పాటను రేలంగి స్వయంగా గానం చేశారు. ఆ రోజుల్లో కొంతమంది నటీనటులకు స్వయంగా పాడుకునే అలవాటుండేది కనుక వారి పేర్లను నేపథ్య గాయనీ గాయకుల పట్టికలో వేసే వారు కాదు. ఈ పాటను రేలంగి, ఎన్.టి.ఆర్ మరికొంతమంది ఉప పాత్రధారులపై చిత్రీకరించారు. ఈ పాటను వినడంగాని చూడడం గాని తటస్థిస్తే - జాగ్రత్తగా గమనిస్తే గాయకుడిగా రేలంగి పెర్ఫార్మెన్స్, పింగళి అందించిన సాహిత్యం ప్రత్యేకంగా కనబడతాయి. ముఖ్యంగా సాహిత్యం వరకు చూసుకుంటే ఇవాళ్టికీ సమాజంలో అదే పరిస్థితి. కవి దార్శనికుడు అని ఊరికే అన్నారా మరి!?

బాలనురా మదనా
విరి తూపులు వేయకురా మదనా ॥బాలనురా॥
నిలచిన చోటనె - నిలువగనీయక
వలపులు కురియునురా - తీయని
తలపులు విరియునురా - మదనా ॥బాలనురా॥
చిలుకలవలె గోర్వంకలవలెనూ
కులుకగ తోచునురా తనువున
పులకలు కలుగురా మదనా ॥బాలనురా॥
చిలిపికోయిలలు చిత్తములోనె
కలకల కూయునురా మనసును
కలవర పరచునురా - మదనా ॥బాలనురా॥







ఈ పాటను సుశీల పాడగా, జమున నృత్యం చేస్తూ అభినయించింది. ఎన్.టి.ఆర్., సావిత్రి, యస్.వి.రంగారావు, ఋష్యేంద్రమణి మొదలైన వారంతా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఈ పాటకు ఖరహరప్రియ రాగం ఆధారం. ఖరహరప్రియరాగంలో 'పక్కానా నిలబడి' అనే త్యాగరాయ కీర్తన భరణీ వారి 'చక్రపాణి' ద్వారా సినీ సంగీత ప్రియులకు పరిచయమై పోయింది. కనుక రెండింటినీ కలిపి వింటే ఖరహరప్రియ రాగం మీద అవగాహన కలుగుతుంది. రాజేశ్వరరావు ఈ రాగాన్ని ఉపయోగించిన పద్ధతి చాలా బావుంటుంది. కావాలంటే 'సంగీత లక్ష్మి' సినిమాలో 'పాటకు పల్లవి ప్రాణం' అనే పాట యొక్క పల్లవిని 'బాలనురామదనా' పాట పల్లవిని కలిపి పాడుకొని చూడండి. వెంటనే ఎంత పోలిక వుందో, రెండిటిలో ఎంత వైవిధ్యం వుందో తెలుస్తుంది.

తెలుసుకొనవె చెల్లీ
అలా నడుచుకొనవె చెల్లీ ॥తెలుసు॥
మగవారికి దూరముగ
మగువలెపుడు మెలగాలని ॥తెలుసు॥
మనకు మనమె వారికడకు
పనియున్నా పోరాదని
అలుసుజేసి నలుగురిలో
చులకనగా చూచెదరని ॥తెలుసు॥
పదిమాటల కొకమాటయు
బదులు చెప్పకూడదని
లేనిపోని అర్థాలను
మన వెనుకనె చాటెదరని ॥తెలుసు॥



ఈ పాటను పి.లీల పాడగా సావిత్రి, జమున, యన్.టి.రామారావు అభినయించారు. ఎన్నేళ్లు గడిచినా - ఎప్పుడు అన్వయించుకున్నా - 'కరక్టే సుమా' అని అనిపింపజేసే సాహిత్యాన్ని అందించిన పింగళి వారికి ఆడవారంతా ఋణపడి ఉండక తప్పదనిపిస్తుంది. ఈ పాట అర్థాన్ని ఆసాంతం ఆకళింపు చేసుకోగలిగిన ఏ అమ్మాయికి ఎటువంటి జాగ్రత్తలూ చెప్పనవసరం లేదు.

ట్యూన్‌పరంగా చెప్పాల్సివస్తే - బేహాగ్, యమన్, ఖమాచ్ రాగాలను రేఖామాత్రంగా స్పృశిస్తూ 'రాజేశ్వరరావు ట్రైబ్ ఆఫ్ కమాచ్'ని సాధన చేయడానికి వీలైన విధంగా చక్కటి ట్యూన్‌ని ఇచ్చారు రాజేశ్వరరావు. ఖమాచ్ రాగంలో రాజేశ్వరరావుది ఓ ప్రత్యేక శైలి. 'ఎందుకే నీ కింత తొందరా' (మల్లీశ్వరి) వంటి క్లాసికల్‌ట్యూన్‌ని, 'పాడమని నన్నడగవలెనా' (డాక్టర్ చక్రవర్తి) వంటి సెమీ క్లాసికల్ ట్యూన్‌ని అందించగలిగాడాయన. ఆ రెండు పాటలనీ సాధన చేస్తే రెండు వైవిధ్యాలని స్వంతం చేసుకున్నట్టే. ఇదిలా ఉండగా ఒక చిన్న పరిశీలన - చాలామందికి 'పడోసన్' సినిమా గుర్తుండే ఉంటుంది. ఆ సినిమాలో 'ఏక్ చతుర్ నార్' పాటలో 'థానారే జారె జారె....' అనే లైనుకూడా గుర్తుండే ఉంటుంది. ఆ లైన్‌కి ఒరిజినల్ 1948లో దేవ్‌ఆనంద్, కామినీకౌశల్ హీరో హీరోయిన్లుగా నటించిన 'జిద్ది' చిత్రంలోని 'చందారే జారే జారే' అనే పాట! ఖేమ్‌చంద్‌ప్రకాశ్ స్వరపరిచిన ఆ పాటను లత పాడింది. ఆ పాట కొన్ని షాపుల్లో ఇంకా దొరుకుతోంది. వీలైతే సంపాదించి వినండి. ఈ 'చందారే జారే జారే' పాట ఇన్‌స్పిరేషన్ 'తెలుసుకొనవే యువతీ' పాటని స్వరపరుస్తున్నప్పుడు రాజేశ్వరరావుగారి మనసులో రేఖా మాత్రంగానైనా ఉండి ఉండాలని ఈ సమీక్షకుని వ్యక్తిగత అభిప్రాయం. కావాలంటే చరణాంతాలలోని ట్యూన్‌ని 'చందారే జారే జారే'తో కలుపుకొని చూడండి. ఎంత చక్కగా అతికిపోతుందో తెలుస్తుంది.

తెలుసుకొనవె యువతీ
అలా నడుచుకొనవె యువతీ ॥తెలుసు॥
యువకుల శాసించుటకే
యువతు లవతరించిరని ॥తెలుసు॥
సాధింపులు బెదిరింపులు
ముదితలకిక కూడవని
హృదయమిచ్చి పుచ్చుకునే
చదువేదో నేర్వాలని ॥తెలుసు॥
మూతిబిగింపులు అలకలు
పాతపడిన విద్యలనీ
మగువలెపుడు మగవారిని
చిరునవ్వుల గెలవాలని ॥తెలుసు॥



ప్రారంభం నుంచీ చివరి వరకు ప్రతీ అక్షరాన్ని 'మోహన' రాగం అనే తేనెలో ముంచి పంచిన పాట ఇది. ఈ పాటలోని సాహిత్యం అనుభవంలోకి రాని జంట అప్పటికీ, ఇప్పటికీ ఉండదనే చెప్పాలి. కొన్నికొన్ని పాటల గురించి చెప్పడానికి ఎక్కువ శ్రమపడాలి. మరి కొన్నిటి గురించి తక్కువగా చెప్పడానికి ఎక్కువ శ్రమపడాలి. రెండో కోవలోకి చెందినదే ఈ పాట. నిజానికి - మగవారితో ఎంత జాగ్రత్తగా మెలగాలో తెలియచెప్పే 'తెలుసుకొనవె చెల్లీ' పాటకు నాణానికి అటువైపు లాగా మలచబడ్డ ఈ చిన్ని పాటలో మనస్తత్వ శాస్త్రానికి సంబంధించి ఓ పెద్ద గ్రంథానికి సరిపడేంత విషయం ఉంది.



కరుణించు మేరిమాతా
శరణింక మేరిమాతా
పరిశుద్ధ ఆత్మ మహిమ
వరపుత్రు గంటివమ్మా
ప్రభు ఏసునాధు కృపచే
మా భువికి కలిగె రక్ష ॥కరుణించు॥
గురిలేనిదారి జేరి
పరిహాసమాయె బ్రతుకు
క్షణమైన శాంతిలేదే
దినదినము శోధనాయే... ॥కరుణించు॥



భక్తి, విరహం, విషాదం ఈ మూడూ 'జయజయావంతి' రాగంలో అద్భుతంగా పలుకుతాయి. ఈ మర్మమెరిగిన రాగజ్ఞుడు రాజేశ్వరరావు 'జయ జయా వంతి' రాగాన్ని బేస్‌గా చేసుకొని స్వరపరిచిన గీతమే - 'కరుణించు మేరిమాతా'. పీలూ రాగానికి దగ్గరగా ఉందేమోనని కొందరు అభిప్రాయపడడానికి ఆస్కారం ఉందిగానీ వాడుకున్న విధానంలో ఉన్న తేడావల్ల జయజయావంతి రాగమే దీనికి బేస్ అని చెప్పాలి. క్రైస్తవ మతస్థులు కూడా వారివారి ప్రార్థనా గీతాలలో ఈ పాటకు సముచిత స్థానాన్ని కల్పించుకోవడం- ఈ పాట కవిగా క్రైస్తవేతరుడైన పింగళి నాగేంద్రరావు సాధించిన విజయానికి మరో నిదర్శనం. పి.లీల పాడిన ఈ పాటను సావిత్రి అభినయించగా ఎన్.టి.ఆర్, రేలంగి, యస్.వి.రంగారావు, ఋష్యేంద్రమణి సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు.






బృందావనమది అందరిదీ - గో
విందుడు అందరి వాడేలే ॥బృందా॥
ఎందుకె రాధా ఈసునసూయలు
అందము లందరి ఆనందములే
పిల్లన గ్రోవిని పిలుపును వింటే
ఉల్లము ఝల్లున పొంగదటే
రాగములో అనురాగము చిందిన
జగమే ఊయల నూగదటే ॥బృందా॥
రాసక్రీడల రమణుని గాంచిన
ఆసలు మోసులు వేయవటే
ఎందుకె రాధా ఈసునసూయాలు
అందము లందరి ఆనందములె ॥బృందా॥

'బృందావనమది అందరిది' పాటను ఎ.యమ్. రాజా, సుశీల పాడగా ఎన్.టి.ఆర్., జమున అభినయించారు. సావిత్రి, అక్కినేని, యస్.వి. రంగారావు, ఋష్యేంద్రమణి సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఇది తెలుగువారందరూ గర్వంగా చెప్పుకోగల గీతం. ఎందుకంటే 'మిస్సమ్మ' చిత్రాన్ని హిందీలో 'మిస్ మేరీ'గా తీసినప్పుడు ఆ హిందీ చిత్రానికి సంగీత దర్శకుడైన హేమంత్‌కుమార్ మిగిలిన పాటలన్నింటికీ వేరే ట్యూన్స్ ఇచ్చారు. కానీ ఈ పాట ట్యూన్‌ను మాత్రం యథాతథంగా తీసుకొని 'బృందావన్ కా కృష్ణ కన్హయ్యా' అనే పాటగా మలుచుకోలేక తప్పలేదాయనకి. సామరాగంలో స్వరపరచబడిన ఈ పాట సాహిత్యాన్ని ఓ పక్కనబెట్టేస్తే వరసంతా ఏమాత్రం వైవిధ్యం లేకుండా ఒకేలా ఉంటుంది. అయినాసరే అదొక హాంటింగ్ ట్యూన్‌లా మారిందంటే ఆ స్వరబలం ఎంత గొప్పదో అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు మొత్తం 'సదప, పదస' అనే స్వరాల మధ్యనే తిరగడం ఓ విశేషం.

రావోయి చందమామ
మా వింతగాథ వినుమా
సామంతముగల సతికి
ధీమంతుడనగు పతినోయ్
సతిపతిపోరే బలమై
సతమతమాయెను బ్రతుకే ॥రావోయి॥
ప్రతినలు పలికిన పతితో
బ్రతుకగ వచ్చిన సతినోయ్
మాటలు బూటకమాయే
నటనలు నేర్చెను చాలా ॥రావోయి॥
తన మతమేదో తనదీ
మన మతమసలే పడదోయ్
మనమూ మనమను మాటే
అననీయదు తా ననదోయ్ ॥రావోయి॥
నాతో తగవులు పడుటే
అతనికి ముచ్చటలేమో
ఈ విధి కాపురమెటులో
నీవొక కంటను గనుమా ॥రావోయి॥










తెలుగులో వచ్చిన యుగళగీతాలు, ప్రేమకు సంబంధించిన అతి మంచి గీతాలు, భీంప్లాస్ రాగంలో వచ్చిన గొప్ప పాటలు, విజయావారి మధుర గీతాలు, ఏ.యం.రాజా హిట్స్, లీల హిట్స్, రాజేశ్వరరావు హిట్స్, ఎన్టీఆర్ హిట్స్, సావిత్రి హిట్స్ ఇలా ఎన్నిరకాలుగా విడదీసినా అన్ని విభాగాల్లోనూ చోటుచేసుకోదగ్గ పాట - 'రావోయి చందమామ' - ఈ పాటకు లభించిన ప్రజాదరణను కొలిచేందుకు, వర్ణించేందుకు తగ్గ కొలమానాలు, ఉపమానాలు లేవు.





ఏమిటో ఈ మాయా - ఓ
చల్లని రాజా - వెన్నెల రాజా - ఏమిటో నీ మాయా
వినుటయేకాని వెన్నెల మహిమలు
అనుభవించి నే నెరుగనయా
నీలో వెలసిన కళలూ కాంతులు
లీలగ యిపుడే కనిపించెనయా ॥ఏమిటో॥
కనుల కలికమిడి నీ కిరణములే
మనసును వెన్నగ చేసెనయా
చెలిమి కోరుచూ - ఏవో పిలుపులు
నాలో నాకే వినుపించెనయా ॥ఏమిటో॥





ఈ పాటను పి.లీల పాడగా సావిత్రి అభినయించారు. సింధుభైరవి రాగానికి అతి చక్కని ఉదాహరణగా చెప్పుకోదగ్గ మంచి గీతమిది. ఈ పాట సాహిత్యాన్ని చరణాలలో బాగా గమనించండి. ప్రేమలో పడిన ప్రతివారికి తమ తొలిరోజుల్లో ఇలాగే ఉండి తీరుతుందని అనిపించితీరుతుంది. వెన్నెల మహిమలు, కనులకలికమిడి వంటి పదప్రయోగాలు అందుకు వత్తాసుగా నిలబడతాయి.

తన స్వరజీవితంలో ఇచ్చినంతకాలం మంచి సంగీతమే ఇచ్చిన ఎస్.రాజేశ్వరరావు గురించి, అందరికీ తెలిసిన పదాలతోనే ఎంతో అర్థాన్ని వినసొంపుగా అందజేయగల పింగళి నాగేంద్రరావు గురించి ఓ పరిశోధనాత్మక గ్రంథం రాయదలుచుకుంటే అందులో పూర్తిగా ఓ అధ్యాయానికి సరిపడేంత ఓ పరిజ్ఞానాన్ని అందజేయగల సత్తాగలవి ఈ 'మిస్సమ్మ' చిత్రంలోని పాటలు.

ఇవిగాక 'మిస్సమ్మ'ను గురించి కొన్ని విశేషాలున్నాయి. 'రాసమణి గర్ల్స్ హైస్కూల్' అనే బెంగాలీ నవలను చక్రపాణి 'ఉదరనిమిత్తం' అనే మకుటంతో అనువదించారు. దాన్నే 'మిస్సమ్మ' మెయిన్‌ప్లాట్‌కు ఆధారంగా వాడుకున్నారు. మొత్తం సినిమాకు ఈ కథ సరిపోదనిపించి 'డిటెక్టివ్' అనే మరో బెంగాలీ నవల అనువాదాన్ని కూడా జోడించారు.

'మిస్సమ్మ' చిత్రంలో సావిత్రి పాత్రకు మొదట భానుమతిని అనుకున్నారు. నాలుగు రీళ్ళు చిత్రీకరించారు. చిన్న అభిప్రాయ భేదం వల్ల ఆమెకు ఆ చిత్రంలో స్థానం లేకుండా పోయింది. అప్పుడు చిత్రీకరించిన సన్నివేశాలలోని ఓ ఫొటోయే యిది.



| **పాత్రధారులు** | **- పాత్రలు** |
|---|---|
| ఎన్.టి. రామారావు | ... మిస్టర్ ఎం.టి. రావు |
| ఎ. నాగేశ్వరరావు | ... ఏ.కె. రాజు |
| ఎస్.వి. రంగారావు | ... జమీందారు |
| రేలంగి వెంకట్రామయ్య | ... దేవయ్య |
| రమణారెడ్డి | ... ఐ.పి. డేవిడ్ |
| దొరస్వామి | ... మిస్టర్ పాల్ |
| బాలకృష్ణ | ... గోవిందు |
| రామలింగయ్య | ... పంతులు |
| గుమ్మడి వెంకటేశ్వరరావు | ... ప్రొప్రయిటరు |
| సావిత్రి | ... మిస్ మేరీ |
| జమున | ... సీత |
| ఋష్యేంద్రమణి | ... జమీందారు భార్య |
| మీనాక్షి | ...మేరీ తల్లి |
| కాకినాడ రాజరత్నం | ... బుచ్చమ్మ |

గాయనీ గాయకులు:
పి. లీల, ఏ.ఎం.రాజా, సుశీల

| **టెక్నీషియన్లు** | |
|---|---|
| రచన | ... చక్రపాణి |
| పాటలు | ... పింగళి నాగేంద్రరావు |
| ఫొటోగ్రఫీ | ... మార్కస్ బార్‌ట్లే |
| సౌండు ఇంజనీరు | ... ఏ. క్రిష్ణన్, బి.ఏ. |
| ప్రాసెసింగు | ... సేన్ గుప్తా, బి.ఎస్‌సి. |
| అసిస్టెంటు సౌండు ఇంజనీర్ | ... పి. శివరాం, బి.ఏ. బిఎస్‌సి. |
| సంగీతం | ... రాజేశ్వరరావు |
| ఆర్‌చెస్ట్రా | ... ఏ. కృష్ణమూర్తి |
| ఆర్టు | ... గోఖలే, కళాధర్ |
| నృత్యం | ... పి. కృష్ణమూర్తి |
| ఎడిటింగ్ | ... జంబులింగం |
| మేకప్ | ... పీతాంబరం |
| ప్రొడక్షన్ | ... చలపతిరావు, జగన్నాథ్ |

డైరెక్షన్ ... ప్రసాద్
నిర్మాతలు ... నాగిరెడ్డి, చక్రపాణి

# లలిత సంగీతం

## ఓపలేనే మనసు ఓ మల్లె పూవా!



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప॥ ఓపలేనే మనసు ఓ మల్లెపూవా
దాచలేనే వలపు వేచు నా ఎదలోనా

1. చ॥ ఆకు మేల్ముసుగులో అందాలు చిందేవు
రాచబింకము తోడ చూచేవు నావంక

2. చ॥ రవగాలియూచేన చివురాకుటుయ్యాల
ఎంత ఒయ్యారమే ఎగసి పోవునెడంద

3. చ॥ ఒక ప్రొద్దె నిలిచినా ఒక పూటె వలచినా
బ్రతుకొక్కనగవుగా పరిమళించునె చాలు

| | | |
|---|---|---|
| రచన | : | కీ॥శే॥ కందుకూరి రామభద్రరావు |
| సంగీతం | : | పాలగుమ్మి విశ్వనాథం |
| గాయని | : | డా॥ కనకవల్లి నాగేందర్ |
| రాగం | : | చారుకేశి |
| | | 26వ మేళకర్త రాగం |
| తాళం | : | ఆది (కర్ణాటక సంగీతం) |
| | | -కహరువా (హిందుస్తాని సంగీతం) |
| ఆరోహణ | : | స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : | స ని ద ప మ గ రి స |

-షడ్జము, చతుశ్రుతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధధైవతం, కైశికి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

ఈ రాగంలో వున్న కైశికి నిషాదానికి బదులుగా కాకలి నిషాదాన్ని ఉపయోగిస్తే అది సరసాంగి రాగమవుతుంది.

అయితే విశ్వనాథం గారు యీ పాటకు చారుకేశి రాగాన్ని వాడుతూ అక్కడక్కడా కాకలి నిషాదాన్ని కూడా ప్రయోగించి సరసాంగి రాగపు సొగసులను కూడా వెదజల్లే విధంగా చాలా హృద్యమైన బాణీని కూర్చారు. మల్లెపూవు అందాన్ని, సౌరభాన్ని చవిచూసిన సుప్రసిద్ధ కవి రామభద్రరావుగారు తనకు కలిగిన ఆ మధురానుభూతిని సున్నితమైన పదజాలంతో సుందరమైన గీతంగా రూపొందించగా, శ్రీమతి కనకవల్లి ఆ పాటలోని భావాలను, స్వరమాధురిని తన గానం ద్వారా చక్కగా వ్యక్తపరిచారు. చారుకేశి శాస్త్రీయ సంగీతంలో ప్రసిద్ధి చెందిన రాగమే. లలిత సంగీతంలో కూడా యీ రాగంలో ఎంతోమంది స్వరకర్తలు కూర్చిన బాణీలు మనకు తరచూ వినబడుతూనే వుంటాయి.

ప॥ ;, మపదపమ మపగగరిస సని। సనిస గగాగ మపమప గా; ।
.. ఊ. పతే. నే. . మన. సు.।.. ఊ. మల్లెపూ... వా.।

;, మపదపమ మపగగరిస సని। సనిస గగగామపమ మపగగా।
.. దా. చవే. నే. . వల. పు.।.. వే. చునావద. లో.. న।

1.చ॥ ;, నిసస స సా నిసాస సారిస పా ।;, నిసస సస నిసాసరి ప పా।
.. ఆ. కుమే ఘ్నసుగులో... ।.. అం. దాలచిం. దే.. వు।

;, గసగ మా పపా పా, పమ । పదప దనిదప పదప దని గపమా।
.. రా. చ లిం కములో. డ. । మా.. చే. వు. నా.. వం. కే.. ।

॥ఊపతేనే॥

2.చ॥ ; నిసా రిగ రిగసా; సా, సా । ;పనిసరిస నిసాసని దాప పా ।
. రవ గాలి యూ... చే. న ।. చివురా. కు టు... యూ. ల ।

;, గసగమా పా, ప పా; । ;పనిప సా, ని దా పాపద ।
.. ఎం. త ఉ య్యా. ర మే. ।. ఎగసి పో. వు నె డంద. ।

మా, గసగమా పా మసనిరిసా సానిపా । ; పనిప సా, ని దా పాపద ।
.. ఎం. త ఉ య్యా..... ల.. మే । . ఎగసి పో. వు నె డంద. ।

మా, ॥ఊపతేనే॥
..

3వ చరణం మొదటి చరణంవలె పాడాలి.

ని = కాకలి నిషాదం

# పాలగుమ్మి విశ్వనాథం

'సంగీత భూషణ' మర్ల సూర్యనారాయణ మూర్తి, మహావైణికులు ఈమని శంకరశాస్త్రి గారల వద్ద నేర్చిన కర్ణాటక సంగీతం ఆలంబన కాగా, సితార్, తబలా, కాష్ట్ తరంగ్ మొదలగు అనేక వాద్యాలలో నిష్ణాతుడు, ప్రసిద్ధ నృత్య కళాకారుడు ఉదయశంకర్ నిర్మించిన 'కల్పన' చిత్రానికి సంగీత దర్శకుడు అయిన విష్ణుదాస్ షిరాలి నిర్వహణలోని వాద్య బృందంలో వైణికుడుగా చేరి గడించిన విశేషానుభవము, ప్రఖ్యాత కర్ణాటక సంగీత విద్వాంసుడు ఎన్.రామనాథన్ గారి సాంగత్యము శ్రీ పాలగుమ్మి వారి సంగీత జ్ఞానానికి మెరుగులు దిద్దాయి. నేడు ఆయన లలిత సంగీతంలో విశిష్ట స్థానాన్ని పొందడాని ఆ విజ్ఞానము, అనుభవము ఎంతగానో దోహదపడినవి. 83 ఏళ్ళ వయస్సు పైబడినా యీ నాటికీ ఆయన శారీరకంగాను, మానసికంగాను కూడా ఎంతో ఉత్సాహంతో లలిత సంగీతరంగంలో చేస్తున్న అవిరళ కృషి నేటి యువతరానికి ఆదర్శవంతమైనది.



1954లో హైదరాబాదు ఆకాశవాణిలో వైణిక విద్వాంసులుగా చేరారు. అప్పుడు లలిత సంగీత గాయకుడుగా ఆకాశవాణి కార్యక్రమాల్లో పాల్గొంటున్న నాకు పాలగుమ్మి వారి పరిచయభాగ్యం కలిగింది. 1955లో తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవాలలో శ్రీ నారాయణరెడ్డిగారు రచించిన 'వెన్నెలవాడ' సంగీత నృత్య రూపకానికి విశ్వనాథంగారు సంగీత దర్శకులు. అందులో నా చేత కూడా పాడించారు. 1956లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో దేవులపల్లి కృష్ణశాస్త్రి, మునిమాణిక్యం, న్యాయపతి రాఘవరావు, కామేశ్వరమ్మ, స్థానం నరసింహారావు మున్నగు వారు వివిధ శాఖలకు ప్రయోక్తలుగా నియమితు లయ్యారు. అదొక స్వర్ణకాలం. ఆకాశవాణి 'భువన విజయ' సభాభవనమే అయింది. పండుగలకు, పబ్బాలకు ఎన్నో

ప్రత్యేక కార్యక్రమాలు ప్రసారమయ్యేవి. వాటిన్నిటికీ విశ్వనాథంగారే స్వరరచన చేసేవారు. కృష్ణశాస్త్రి గారి 'కొత్తకోవెల', 'ఏడాది పాడుగునా', 'శివక్షేత్రయాత్ర', 'రాజఘట్టం' వంటి సంగీత రూపకాల్లోని రసగుళికల వంటి గీతాలకు సుమధురమైన సంగీతాన్ని కూర్చారు పాలగుమ్మివారు. వాటిలో 'శివ శివ శివ అనరాదా', 'నారాయణ నారాయణ అల్లా అల్లా', 'కైలాసగిరి నుండి కాశికై' మొదలైన కలకాలం శ్రోతలు గుర్తుంచుకొనే పాటలు మచ్చుకు కొన్ని. లలిత సంగీతంలో సాధారణంగా ఉపయోగించబడని రాగాల్లో విశ్వనాథంగారు బాణీలు కూర్చేవారు. లలిత సంగీతానికి కల్యాణి, మోహన, హిందోళవంటి కొన్నిరాగాలే అనువుగా వుంటాయనే ఒక అభిప్రాయం ఆ రోజుల్లో సంగీత దర్శకులలో వుండేది. అందువల్ల ఓ పది, పదిహేను రాగాలలోనే బాణీలు కూర్చేవారు లలిత గీతాలకు. కాని విశ్వనాథంగారు షణ్ముఖప్రియ, నాట, శహన, గౌరీ మనోహరి, షడ్విధమార్గిణి, పూర్వి కల్యాణి వంటి ఫక్తు శాస్త్రీయ రాగాలను ఉపయోగించి మనోరంజకమైన బాణీలు కూర్చారు. 1958లో డా॥ సి.నారాయణరెడ్డిగారి 'రామప్ప' రూపకానికి విశ్వనాథంగారు అందించిన సంగీతం ప్రాణం. అందులో బాలమురళీగారు, కమలాచంద్రబాబు నటించి పాడారు. నాట రాగంలో 'ఈ నల్లనిరాలలో', 'సింహేంద్ర మధ్యమంలో 'నాగీ ఆడవే', గౌరీమనోహరిలో 'ఏ నాటిదో మనబంధము' మొ॥ మనోజ్ఞ గేయాలు రూపొందించారు. ఈ రూపకంలో నేను, ఎ.వి. సావిత్రి, వి.వసంత కూడా పాడాము. సుప్రసిద్ధ గాయని వక్కలంక సరళ, నేను పాలగుమ్మి వారి నిర్వహణలో ఎన్నో కార్యక్రమాలు పాడుతూండే వాళ్ళం. మా చెల్లెలు శాంత కూడా ఆయన స్వరపరచిన ఎన్నో పాటలు పాడింది. దాశరథి గారు "తథా గతా ప్రజాహిత', 'రావేమి రా శశి', శశాంక రచించిన 'స్వాతంత్ర్యమె నా జీవితాశయమని' అనేవి ప్రముఖంగా కొన్ని. డా॥ కనకవల్లి, మోహనరాజు, వేదవతి ప్రభాకర్, వెంకట గోపాలన్, ఇందిరా రంగారావు మొ॥ ఎంతో మంది గాయకులు పాలగుమ్మి వారి పాటలు పాడి పేరు తెచ్చుకున్నారు.

నాకు పాలగుమ్మి వారు లలిత సంగీతంలో గురువుగా శిక్షణ నిచ్చి ఎన్నెన్నో మెలకువలను విషయాలను నేర్పుతూ నేను గాయకుడుగాను, స్వరకర్త గాను రాణించడానికి, ఆకాశవాణిలో ఉద్యోగిగా స్థిర పడడానికి వారే కారకులయ్యారు. 'నాద వినోదిని' సంస్థ ద్వారా హేమవతి మొ॥ ఎంతో మంది విద్యార్థులను గాయనీ గాయకులుగా తీర్చి దిద్దుతున్నారు. తెలుగు విశ్వవిద్యాలయంలో నిర్వహించబడుతున్న లలిత సంగీతం డిప్లొమా కోర్సుకు ఆయన గెస్ట్ లెక్చరర్ గాను, లలిత సంగీత శాఖకు ఇన్‌ఛార్జిగాను వ్యవహరిస్తున్నారు.

లలిత సంగీత కళాసరస్వతికి యీ విధంగా అవిశ్రాంత స్వరార్చన గావిస్తున్న శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జూన్ 12, 2002 నాడు "హంస" అవార్డుతో సత్కరించి గౌరవించడం అత్యంత హర్షదాయకం.

## కందుకూరి రామభద్రరావు



విద్యారంగంలో ఉపాధ్యా యుడుగాను, ప్రధానోపా ధ్యాయుడు గాను, వీరేశలింగం ఉన్నత పాఠశాల లోను, పేరూరు, ఆత్రేయపురం, అమలాపురంల లోని పాఠశాలలో సేవ లందించి విశేష ఖ్యాతిని ఆర్జించిన రామభద్రరావు గారు చిన్నతనం నుండే కవితలల్ల సాగారు. లేమొగ్గ, తరంగిణి, వేదన, జయపతాక అనే ఖండకావ్యాలను వ్రాశారు. రవీంద్రుని 'చిత్ర' అను వదించారు. "నివేదనము" అనే శతకాన్ని రచించారు. ప్రధానోపాధ్యాయ పదవీ విరమణ తరువాత ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో సుమారు 10 సంవత్సరాల వరకూ విద్యా కార్యక్రమ ప్రయోక్తగా పనిచేశారు. ఆ సమయంలో ఆయన ఎన్నో భావ గీతాలు, దేశభక్తి గీతాలు, సంగీత రూపకాలు రచించారు. "ఓ వసంత ప్రియా", "జయము జయము తల్లీ జయము కల్పవల్లీ", "ఒపలేనే మనసు ఓ మల్లెపూవా" (పాలగుమ్మి వారి స్వరరచన) మొదలగు కందుకూరి వారి గేయాలు ఆకాశవాణిలో ప్రసారమై జనాదరణ పొందాయి. శ్రీరంగం గోపాలరత్నం, కనకవల్లీ నాగేందర్, వేదవతి ప్రభాకర్ మొదలగు సుప్రసిద్ధ కళాకారులు చాలామంది వీరి పాటలను వివిధ స్వరకర్తల బాణీలతో ఆకాశవాణిలో తరచూ గానం చేసేవారు. కందుకూరి వారు వ్రాసిన యింకా ఎన్నో పాటలను చేర్చి వారి కుమారుడు పుండరీకాక్షుడు గారు "గేయమంజరి" పేరుతో పుస్తక రూపంగా ప్రచురించారు. గంభీర మధురమైన కంఠం కలిగిన కందుకూరి వారు గొప్ప వక్తగా కూడా ప్రసిద్ధిగాంచారు. భవ్యమైన ఆవేశము, శ్రావ్యమైన పద విన్యాసము, జాతీయమైన అభినివేశము ప్రత్యేక లక్షణాలుగా గల రామభద్రరావుగారు సాహితీ లోకంలో ఒక విశిష్టవ్యక్తిగా వెలుగొందారు.



కనకవల్లీ నాగేందర్

### చారుకేశి రాగంలో కొన్ని సినిమా పాటలు

| | | గానం | చిత్రం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఈ నవనాటక సూత్రధారులు ఎవరో-ఎవరో | ఘంటసాల, లీల | పెళ్ళిచేసి చూడు | ఘంటసాల |
| 2. | ఊరేదిపేరేది | ఘంటసాల | రాజమకుటం | మాస్టర్‌వేణు |
| | | హిందీ | | |
| 1. | అకేలే హైఁ చలే ఆవో జహాఁ హో... జరా ఆవాజ్‌దో | | రఫీ | కళ్యాణ్‌జీ, ఆనంద్ జీ |

జులై 14 వర్ధంతి సందర్భంగా



# మదన్‌మోహన్ కమ్మర్షియల్‌గా ఎందుకు సక్సెస్ కాలేదు?

**మదన్‌మోహన్‌ను లలితమైన సంగీతానికి మారుపేరుగా చెప్పుకుంటారు.
దస్తక్ సినిమాకు గాను ఆయనకు జాతీయ పురస్కారం లభించింది.
"లతా ఆయన కోసమే పుట్టింది, నా కోసం కాదు" అని ఓపి నయ్యర్ ప్రకటించాడు.
అయినా మదన్‌మోహన్ సంగీత దర్శకత్వం వహించిన విజయవంతమైన
సినిమాల పేర్లు నాలుగు చెప్పమంటే మనం తడుముకోవలసినదే!
25 సంవత్సరాల కెరియర్‌లో వంద సినిమాలకు సంగీతం సమకూర్చినా ఇదీ పరిస్థితి!**

ఆయన తండ్రి రాజ్‌బహదూర్ చునీలాల్ బాంబే టాకీసు అధినేత. ఫిల్మిస్తాన్ స్టూడియోలో భాగస్వామి. రాజ్‌కపూర్, సురయ్యా బాల్యమిత్రులు. దర్శక నిర్మాత రాజ్‌ఖోస్లా, గేయరచయిత రాజా మెహదీ అలీఖాన్, రచయితలు - దర్శకులు అయిన రామానందసాగర్, దేవేంద్రగోయల్ - వీరంతా తొలిదశల్లో క్లోజ్ ఫ్రెండ్స్ - ఒకరి చొక్కాలు మరొకరు మార్చుకునేటంత! అయినా మదన్‌మోహన్ అగ్రశ్రేణి సంగీత దర్శకుల జాబితాల్లో ఎన్నడూ లేదు.

ఎందువల్ల ఇలా జరిగిందని విశ్లేషిస్తే కొన్ని కారణాలు దొరుకుతాయి. మొదటిగా చెప్పవలసినది - తండ్రికి కళల పట్ల ఉన్న చిన్నచూపు. ఆయన సినిమాలు తీస్తున్నా, దాన్ని ఫక్తు వ్యాపారంగానే భావించాడు. ఆయన బాగ్దాదు (మదన్ అక్కడే 1924 జూన్ 25న పుట్టాడు), రావల్పిండి నుండి (అక్కడే మదన్ బాల్యం గడిచింది), బొంబాయి చేరింది సినిమాలు తీయడానికి మాత్రమే. కొడుకు సంగీతం పట్ల అభిరుచి చూపుతున్నాడని గ్రహించి స్టూడియో గడప కూడా తొక్కవద్దని ఆదేశించాడు. ఇంక ఏం చేయాలో తోచక, తండ్రికి ఎదురాడలేక చివరికి మిలటరీలో చేరిపోయాడు. (ప్రఖ్యాత వార్ ఫిల్మ్ "హకీకత్" (1964 ) సినిమాకు అద్భుతమైన సంగీతం ఇవ్వడానికి ప్రేరణ ఆ అనుభవమేనేమో!)



కానీ అతని అభిరుచి అక్కడ నిలవనివ్వలేదు. ఆర్మీ వదిలిపెట్టి ఆలిండియా రేడియోను చేరమంది. లక్నోలో తేలాడు. అక్కడే అతనికి బడే గులాం అలీఖాన్, బేగం అఖ్తర్, అల్లా రఖా, విలాయత్ ఖాన్, రైస్‌ఖాన్ వంటి దిగ్గంతులైన సంగీతజ్ఞుల పరిచయం ఏర్పడింది, సహచర్యం లభించింది. తండ్రి మొండితనం వల్ల శాస్త్రీయ సంగీతం నేర్చుకోలేకపోయినా ఈ శృతపాండిత్యంతోనే ఆయన సంగీత ప్రపంచంలో తనకంటూ ఓ స్థానాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

ఆ తరువాత బొంబాయి వచ్చి మిత్రులతో కలిసి "ఆంఖే" (1950)సినిమా తీశారు. దానికి

## మదన్ మోహన్ - కొన్ని మంచి ముత్యాలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | రంగ్‌ఔర్ నూర్‌కీ బారాత్ | - | గజల్ | (1964) |
| 2. | తేరీ ఆంఖోంకె సివా | - | చిరాగ్ | (1969) |
| 3. | తూజహాఁజహాఁ చలేగా మేరా సాయా సాథ్‌హోగా | - | మేరాసాయా | (1966) |
| 4. | యే దునియా యే మెహఫిల్ మేరా కామ్‌కీనహీఁ | - | హీర్‌రాంఝా | (1970) |
| 5. | తుమ్హారీ జుల్ఫ్‌కే సాయేమె | - | నౌనిహాల్ | (1967) |
| 6. | మేరీయాద్ మే తుమ్ ఆసూ న బహానా | - | మద్‌హోష్ | (1951) |
| 7. | ముష్కిల్ హై జీనా | - | సాహెబ్ బహద్దర్ | (1977) |
| 8. | ఝుమ్‌కా గిరారే | - | మేరాసాయా | (1966) |

# మదన్‌మోహన్ - లతా



మదన్‌మోహన్ - లతాలకు గల సోదర, సోదరీ సంబంధం గురించి ఇప్పుడందరికీ తెలుసు. కానీ మొదటిసారి సంగీతం సమకూరుస్తూ లతను పాట పాడమని అడిగితే ఆమె తోసి పుచ్చింది. అయినా నొచ్చుకోకుండా ఆమెకు నచ్చచెప్పి పాడించాడు. 1948లో లతాచే రాఖీ కట్టించుకున్నాడు. ఆ బంధం జీవితాంతం కొనసాగింది. మదన్ మరణించిన తర్వాత, లత ఆయన కుటుంబానికి మరింత చేరువయ్యారు. ఆయన భార్య పోయాక ఆ పిల్లల బాగోగులు కూడా ఆమే చూశేది. సంజీవ్ వివాహం సందర్భంగా శుభలేఖలు లతా తన పేరుమీదనే పంపించింది.

మదన్ లతా చేత పాడించని చిత్రాలను వేళ్ల మీద లెక్కించవచ్చు. "నీంద్ హమారీ ఖ్వాబ్ తుమ్హారీ"లో ఆశా చేత నాలుగు పాటలు పాడించాడు. "కోషిష్", "ఏక్ ముఠ్ఠీ ఆస్మాన్"లోనూ లతా చేత పాడించలేదు. "ఏక్ ముఠ్ఠీ...."లో ఏ ఒక్క పాటా హిట్ కాలేదు. లతా పాటలు పాడిన "అన్‌ఫడ్". "ఓ కౌన్‌థీ" "మేరాసాయా" సినిమాలలోవన్నీ హిట్‌సాంగ్సే!

లతాతో 27 సంవత్సరాల పాటు, అంటే చనిపోయే వరకూ, ఏ పేచీ రాకుండా నెగ్గుకొచ్చిన సంగీతదర్శకుడు మదన్‌మోహన్. అతని మరణానంతరం నివాళి నర్పిస్తూ లతా అన్నారు. "తక్కిన సంగీత దర్శకులు నాకు పాటలు ఇచ్చారు. మదన్ భయ్యా నాకు పాడే విద్యనే ఇచ్చాడు".

రచయిత రామానంద సాగర్, దర్శకత్వం దేవేంద్రగోయల్. సంగీతం మదన్‌మోహన్. అక్కడే రాజా మెహిందీ ఆలీఖాన్‌తో పరిచయం. ఆ సినిమాలో ఆయన చేత నాలుగు పాటలు రాయించాడు. తర్వాత "మద్‌హోష్"లో పాటలన్నింటినీ రాజా చేతనే రాయించాడు. తాను చేసిన 700 పాటల్లో మదన్ ఇద్దరితో ఎక్కువగా పని చేశాడు - రాజా మెహిదీ అలీఖాన్, రాజేంద్రకిషన్. తర్వాత చెప్పవలసి వస్తే కైఫీ అజ్మీ. మజ్రూ సుల్తాన్‌పురి, సాహిర్ లుధియాన్వి.

తను ఎవరితో కలిసి పని చేయాలో మదన్‌కు నిర్దిష్టమైన అభిప్రాయాలు ఉండేవి. ఒకసారి ఆశాభోంస్లే అతని సంగీత దర్శకత్వంలో ఒక సినిమాలో రెండు పాటలు పాడి మిగతావి కూడా తనకిమ్మంది. "జబ్ తక్ లతా హై, లతా హీ గాయేగీ" (లత వున్నంత కాలం, లతే ఆ పాటలు పాడుతుంది) అని చెప్పిన నిర్మొగమాటి మదన్. ఇటువంటి నైజం కలవారు సినిమా రంగంలో పైకి రావడం కష్టమని అందరికీ తెలుసు. హిపోక్రసీని, వెన్నుపోట్లను భరించ శక్యం కాక తాగుడుని ఆశ్రయించాడు మదన్‌మోహన్. చివరకు అది సిరోసిస్‌కు దారితీసి, 51 సంవత్సరాలకే మరణించాడు.

వీటన్నిటితో పాటు అతను సంగీతం ఇచ్చిన సినిమాలలో పాటలు బాగున్నా ఎక్కువ శాతం బాక్సాఫీసు వద్ద అపజయం పొందాయి. పెద్ద హీరోలతో పనిచేసిన సినిమాలకీ అదే గతి. దేవ్ ఆనంద్‌తో చేసినవి రెండు. "పాకెట్‌మార్", "షరాబీ". రెండూ ఫెయిలే. రాజ్‌కపూర్‌తో రెండు "ఆషియానా", "ధున్" - ఇవీ అంతే! అమితాబ్ బచ్చన్ విలన్‌గా (నవీన్ నిశ్చల్ హీరో) నటించిన "పర్వానా" కూడా డిటో. మీనాకుమారితో "మేమ్‌సాబ్", నూతన్‌తో "ఆశ్రీదావ్", "దుల్హాన్ ఎక్‌రాత్‌కీ". నర్గీస్‌తో "అదాలత్". ధర్మేంద్రతో "నీలా ఆకాశ్", "అన్‌పఢ్", "అప్ కీ పర్ఛాయియాఁ". వీటిలో పాటలు మనకు గుర్తే కానీ సినిమాలు మాత్రం మళ్లీ కనబడలేదు.

బాల్యమిత్రుడు రాజ్‌కపూర్ "సత్యం శివం, సుందరం" ఆఫర్ చేశారని, కానీ తన తండ్రి అహంభావమే అడ్డుపడిందని మదన్‌కుమారుడు సంజీవ్ కోహ్లీ అంటాడు. "మా నాన్న ఎప్పుడూ జీవితంలో ఆశాభంగం చెందిన వాడిలా నిరాశ నిస్పృహలతో వుండే వాడు. తన ప్రతిభను సినీ పరిశ్రమ గుర్తించలేదనే న్యూనతాభావం మా అమ్మ దగ్గర వ్యక్తపరచేవాడు" అంటాడు అతడు. 1960ల ఉత్తర్థారం నుండి పరిశ్రమలో అతని స్థానం దిగజారసాగింది. అతనిచ్చే క్లాసికల్ టచ్ "అవుట్ ఆఫ్ ట్రెమ్స్" అయిపోయింది.

"లైలా మజ్నూ" చిత్రాన్ని లక్ష్మీకాంత్ ప్యారేలాల్ వదిలేయగా మదన్‌కు ఆ ఛాన్స్ వచ్చింది. చక్కటి సంగీతం ఇచ్చారు కానీ అది ఆయన



| | | | | |
|---|---|---|---|---|
| 9. | జిస్ దిన్‌సే మైతుమ్‌కో దేఖా హై | - | పర్వానా | (1971) |
| 10. | అప్‌కీ నజరోనే సమ్ ఝూ | - | అన్‌పఢ్ | (1962) |
| 11. | బయ్యానాధరో | - | దస్తక్ | (1970) |
| 12. | దిల్‌దిల్‌సే మిలాకర్ దేఖో | - | మేమ్‌సాబ్ | (1956) |
| 13. | నైనా బర్సే | - | ఓ కౌన్‌థీ | (1964) |
| 14. | ఏక్‌హసీఁ శామ్‌కో | - | దుల్హాన్ ఏక్ రాత్ కీ | (1966) |
| 15. | బస్తీబస్తీ పర్‌బత్ పర్‌బత్ | - | రైల్వే ప్లాట్‌ఫామ్ | (1955) |
| 16. | యూ రూఠోనా | - | నీంద్ హమారీ ఖ్వాబ్ తుమ్‌హారీ | (1966) |

లైలా మజ్నూ పాటలు ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. అందరికీ తెలిసినవే. -ఎన్.కె.రామారావు

## సంతోష్ కోహ్లి చెప్పిన మదన్‌మోహన్ అనుభవాలు కొన్ని

*"నైనా బర్‌సే" పాట 1950లలోనే మా నాన్న కంపోజ్ చేశారు. ఆ హాంటింగ్ ట్యూన్ విని రాజ్‌ఖోస్లా దయ్యాల సినిమాకైతే ఆ పాట బాగుంటుందని అన్నారు. తక్కినవాళ్లూ అదే అన్నారు. చివరికి "ఓ కౌన్ థీ" (1964)లో ఆ పాట ఉపయోగపడింది. పాట రికార్డింగ్ సమయానికి లతాజీకి స్వల్ప అనారోగ్యం కలిగింది. అందువల్ల సాధన మీద చిత్రీకరించడానికి గాను మా నాన్నే ఆ పాట పాడారు. తర్వాత లతాజీచే పాడించి రికార్డు విడుదల చేశారు.



కుమారుడు సంజయ్ కోహ్లీతోమదన్‌మోహన్

*"చిరాగ్"లో "చాహే బరఖా బహారే" పాట చాలా క్లిష్టమైన పాట. లతాజీ 15 సార్లు పాడిన తర్వాత ఆఖరిసారి పాడిన వెర్షన్‌ను ఓకే చేశారు నాన్న. అలసిపోయారా? అని అడిగినప్పుడు లతా నీరసంగా నవ్వి అద్భుతంగా హిట్టయిన తన పాటలన్నీ నిజానికి విపరీతంగా అలసిపోయినప్పుడు పాడినవే నంది.

*మా నాన్న చేసిన అద్భుతమైన పాట "ఆప్‌కి నజరోంనే సమ్‌ఝా" (అన్‌పడ్) పల్లవి కేవలం రెండే రెండు నిమిషాల్లో కంపోజ్ చేశారు. గ్రౌండు ఫ్లోర్‌లో లిఫ్టెక్కి అయిదవ ఫ్లోర్‌లో మా పోర్షన్ దగ్గరకొచ్చే సరికి పల్లవి పూర్తయిపోయింది. ఆయన అప్పుడు ఒక రకమైన సమాధి స్థితి (ట్రాన్స్)లో వున్నారనిపించింది. ఆయన తన గదిలోకి పరిగెట్టి హార్మోనియం అందుకున్నారు. మిగతా చరణాలు పూర్తి చేయడానికి.

*నిజానికి ఆయన పాటలు బయట మళ్లీ పాడడం కష్టం. కారులో ఎక్కడయినా దూరప్రాంతాలకు వెళ్లేటప్పుడు ఏదైనా పాట పాడమని అడిగే వారు. మేం అప్పుడు వేరే మ్యూజిక్ డైరెక్టర్ పాట పాడితే బాధగా వెనక్కి తిరిగి మా మొహం కేసి చూస్తూ "యూటూ బ్రూటస్?" అన్న స్టయిల్లో 'మీరూనా?' అనేవారు.

చనిపోయిన తర్వాతనే ఆ సినిమా విడుదలయింది. చేతన్ ఆనంద్ తను తీస్తున్న "సలీం అనార్కలి" అనే సినిమాకు మ్యూజిక్ సిట్టింగుకై మదన్‌ను తన ఇంటికి ఆహ్వానించాడు. ఆ సిట్టింగులోనే కొలాప్స్ అయి 1975 జులై 14న ఆయన కన్ను మూశాడు.

మదన్ మోహన్ పోయిన తర్వాత అతని శవాన్ని అమితాబ్, వినోద్‌ఖన్నా, ధర్మేంద్ర, రాజేష్‌ఖన్నా, రాజేంద్రకుమార్ వంటి అగ్రశ్రేణి తారలు వాళ్ల భుజాల మీద మోశారు. బతికివుండగా మాత్రం ఆ పరిచయాలు ఎందుకూ పనికి రాలేదు!

-ఎస్.కె.రామారావు




జూన్ మొదటి పక్షం "హాసం"లో కైఫీ ఆజ్మీకి నివాళిగా రాసిన రెండు వ్యాసాలూ బావున్నాయి. అయితే కైఫీ ఆజ్మీ జన్మించింది 1915లో కాదు. 1919 జనవరి 19న పుట్టారు. ఉర్దూ భాష పట్ల ఆయనకు అపారమైన మమకారం. ఓసారి ఒకానొక జర్నలిస్టు ఇంటర్వ్యూ కోసం వెళితే నీకు ఉర్దూ వచ్చా అన్నారు. రాదని సదరు జర్నలిస్టు జవాబివ్వగా "ఉర్దూ భాషరాని వాడివి నన్ను నువ్వేం ఇంటర్వ్యూ చేస్తావ్ పో" అన్నారాయన. గురుదత్ 'కాగజ్ కే ఫూల్' పరాజయంతో రచయితగా వెనకబడ్డ కైఫీ మళ్లీ చేతన్ ఆనంద్ 'హీర్ రాంఝా'తో పుంజుకున్నారు. ఢిల్లీ ప్రభుత్వ సహస్రాబ్ది అవార్డు అందుకున్న కైఫీ 1997లో తాను రాసిన కవితల్లో, గజల్స్‌లో కొన్నింటిని ఎంపిక చేసి "కైఫియత్" (మనఃస్థితి)గా తన స్వంత గొంతుకతోనే రికార్డు చేసి క్యాసెట్టుగా విడుదల చేశారు. చివరి రోజుల్లో తాను పుట్టిన కుగ్రామం అభివృద్ధికి కృషి చేసిన నిజమైన ప్రగతివాది కైఫీ. "కర్ చలే హమ్ ఫిదా...." పాటలో ఆయన హృదయం లోని దేశభక్తిని మనం దర్శించవచ్చు. ఆయన భౌతికంగా లేకపోయినా పాటలో చిరంజీవిగా నిలిచే ఉంటారు.

-హెచ్.రమేష్‌బాబు, నాగర్‌కర్నూల్

## తెలుగు పాటలు - తమిళ మాతృకలు

(గత సంచిక తరువాయి)

| వ.నెం. | చిత్రం పేరు | - పాట (తమిళం) | - తెలుగుచిత్రం | పాట |
|---|---|---|---|---|
| 44. | పెరియ ఇడత్తుపెణ్ | - పారప్పాపళనియప్ప | - శభాష్‌సూరి | "చూడుచూడుపట్టయ్యా" |
| 45. | పెరియ ఇడత్తుపెణ్ | -అవళ్‌కెన్నా | - శభాష్‌సూరి | "దేవుడికేం హాయిగా వున్నాడు". |
| 46. | ఎదిర్‌నీచ్చల్ | -తామరైకణ్ణంగళ్ | - సంబరాల రాంబాబు | "కన్నులే కలిసేనూ" |
| 47. | ఆలయమణి | - తూక్కముం కన్నళై | - గుడిగంటలు | "నీ కనుదోయి నిద్దురనై" |
| 48. | ఆలయమణి | -మానాట్టుం | - గుడిగంటలు | "దూరానా నీలిమేఘాలు" |
| 49. | ఆలయమణి | -సట్టిసుట్టలు దడా | - గుడిగంటలు | "జన్మమెత్తితిరా". |
| 50. | నానుం ఒరుపెణ్ | -ఏమారసొన్నతు | - నాదీఆడజన్మే | "నా మాట నమ్మితివేలా" |

(వచ్చే సంచికలో మరి కొన్ని)

-సేకరణ: ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూర్

## అన్‌పఢ్

రచన: రాజా మెహంది అలీ ఖాన్ గానం: లతా

ఆప్‌కీ నజరోం నే సమ్‌ఝా ప్యార్ కే కాబిల్ ముఝే
దిల్ కి ఏ ధడ్‌కన్ ఠహర్ జా మిల్ గయీ మంజిల్ ముఝే ॥ఆప్ కీ॥
జీ హమేఁ మంజూర్ హై ఆప్ కా యే ఫైస్‌లా(2)
కహ్‌రహీ హై హర్ నజర్ బన్దా పరవర్ శుక్రియా
హఁస్ కే అప్‌నీ జిందగీ మేఁ కర్ లియా శామిల్ ముఝే ॥ఆప్ కీ॥
ఆప్‌కీ మంజిల్ హూఁ మైఁ మేరీ మంజిల్ ఆప్ హైఁ
క్యూఁ హై తూఫాఁ సే డరూఁ మేరా సాహిల్ ఆప్ హై
కో ఈ తూఫానోం సే కహ్‌దే మిల్ గయా సాహిల్ ముఝే ॥ఆప్ కీ॥
పడ్‌గఈ దిల్ పర్ మేరే ఆప్ కీ పర్‌ఛాఇయాఁ (2)
హర్ తరఫ్ బజ్‌నే లగీ సైకడోం శహనాఇయాఁ
దో జహాఁ కీ ఆజ్ ఖుశియాఁ హో గఈ హాసిల్ ముఝే ॥ఆప్ కీ॥

## హీ రాంఝా

రచన: కైఫీఆజ్మీ గానం: రఫీ

యే దునియా యే మహఫిల్ మేరే కామ్ కీ నహీఁ
కిస్‌కా సునావూఁ హాల్ దిలే బేకరార్ కా
బుఝ్‌తా హువా చిరాగ్ హూఁ అప్‌నీ మజార్ కా
యే కాష్ భూల్ జావూఁ మగర్ భూల్‌తా నహీఁ
కిస్ ధూమ్‌సే ఉఠా థా జనాజా బహార్ కా ॥యే దునియా॥
అప్‌నా పతా మిలే నా ఖబర్ యార్ కీ మిలే
దుష్మన్ కో భీ నా ఐసీ సజా ప్యార్ కీ మిలే
ఉన్‌కో ఖుదా మిలే హై ఖుదా కీ జిన్‌హేఁ తలాష్
ముఝ్‌కో బస్ ఇక్ ఝలక్ మేరే దిల్‌దార్ కీ మిలే ॥యే దునియా॥
సెహరా మేఁ ఆ కే భీ ముఝ్‌కో ఠికానా న మిలా
గమ్ కో భులానే కా కోయీ బహానా నా మిలా
దిల్ తరసే జిస్‌మేఁ ప్యార్ కో క్యా సమఝూఁ ఉస్ సంసార్‌కో
ఏక్ జీతీ బాజీ హార్ కే మై ఢూంఢూఁ బిఛ్‌డేఁ యార్‌కో ॥యే దునియా॥
దూర్ నిగాహోఁ సే ఆంసూఁ బహాతా హై కోయీ
కైసే నా జావూఁ మైఁ ముఝ్‌కో బులాతా హై కోయీ
యా టూటే దిల్ కో జోడ్ దో యార్ సారే బంధన్ తోడ్‌దో
యే పర్వత్ రస్తా దే ముఝే, యే కాంటో దామన్ ఛోడ్‌దో ॥యే దునియా॥

## మేరా సాయా

రచన: రాజా మెహంది అలీఖాన్ గానం: లతా

తూ జహాఁ- జహాఁ చలేగా మేరా సాయా సాథ్ హోగా
కభీ ముఝ్‌కో యాద్ కర్‌కే జో బహేంగే తేరే ఆంసూ
తో వహాఁ పే రోక్ లేంగే ఉన్‌హే ఆ కే మేరే ఆంసూ
తూ జిధర్ కో రుఖ్ కరేగా మేరా సాయా సాథ్ హోగా
తూ అగర్ ఉదాస్ హోగా తో ఉదాస్ హూంగీ మైఁ భీ
నజర్ ఆవూఁ యా నా ఆవూఁ తేరే పాస్ హూంగీ మైఁ భీ
తూ కహీఁ భీ జా రహేగా మేరా సాయా సాథ్ హోగా
మైఁ అగర్ బిఛ్‌డ్ భీ జావూఁ కభీ మేరాగమ్ న కర్ నా
మేరా ప్యార్ యాద్‌కర్‌కే కభీ ఆంఖ్ నమ్ న కర్‌నా
తూ జో ముడ్ కే దేఖ్ లేగా మేరా సాయా సాథ్ హోగా
మేరా గమ్ రహా హైఁ శామిల్ తేరే దుఖ్ మేఁ తేరే గమ్ మేఁ
మేరే ప్యార్ నే దియా హై తేరా సాథ్ హర్ జనమ్ మేఁ
తూ కోయీ జనమ్ భీ లేగా మేరా సాయా సాథ్ హోగా

## హకీకత్

రచన: కైఫీఆజ్మీ గానం: రఫీ

కర్ చలే హమ్ ఫిదా జానో-తన్ సాథియో
అబ్ తుమ్‌హారే హవాలే వతన్ సాథియో
సాఁస్ థమతీ గయీ నబ్జ్ జమ్‌తీ గయీ
ఫిర్ భీ బఢ్‌తే కదమ్ కో న రుక్‌నే దియా
కట్ గయే సర్ హమారే తో కుఛ్ గమ్ నహీఁ
సర్ హిమాలయ్ కా హమ్‌నే న ఝుక్‌నే దియా
మర్‌తే-మర్‌తే రహా బాంక్‌పన్ సాథియో
జిందా రహ్‌నే కే మౌసమ్ బహుత్ హైఁ మగర్
జాన్ దేనే కీ రుత్ రోజ్ ఆతీ నహీఁ
హుస్న్ ఔర్ ఇష్క్ దోనోం కో రుస్వా కరే
వో జవానీ జో ఖూన్ మేఁ నహాతో నహీఁ
ఆజ్ ధర్తీ బనీ హై దుల్హన్ సాథియో
చాహ్ కుర్బానియో కీ న వీరాన్ హో
తుమ్ సజాతే హీ రహ్నా నయే కాఫిలే
ఫతహ్ కా జష్ణ్ఇస్ జష్ణ్ కె బాద్ హైఁ
జిందగీ మౌత్ సే మిల్ రహీ హై గలే
బాంధ్ లో అప్‌నే సర్ పే కఫన్ సాథియో
ఖీంచ్ దో అప్నే ఖూఁ సే జమీఁ పర్ లకీర్
ఇస్ తరఫ్ ఆనే పాయే న రావణ్ కోయీ
తోడ్ దో హాథ్ అగర్ హాథ్ ఉఠ్‌నే లగేఁ
ఛూనే పాయే న సీతా కా దామన్ కోయీ
రామ్ హో తుమ్ తుమ్హీఁ లక్ష్మణ్ సాథియో

## ఓ కౌన్ థీ

రచన: రాజా మెహంది అలీ ఖాన్ గానం: లతా

నైనా బర్‌సే రిమ్‌ఝిమ్ రిమ్‌ఝిమ్ (2)
పియా తోరే ఆవన్ కీ ఆస్ ॥నైనా॥
వో దిన్ మేరీ నిగాహోం మేఁ వో యాదేఁ మేరీ ఆహోం మేఁ (2)
యే దిల్ మేరీ నిగాహోం మేఁ వో యాదేఁ మేరీ ఆహోం మేఁ
యే దిల్ అబ్ తక్ భట్‌కతా హై, తేరీ ఉల్‌ఫత్ కీ రాహోం మేఁ
సూనీ - సూనీ రాహేఁ సహమీ సహమీ బాహేఁ
ఆంఖోం మేఁ బరసోం కీ ప్యాస్ ॥నైనా॥
నజర్ తుఝ్ బిన్ మచల్‌తీహై ముహబ్బత్ హాథ్ మల్‌తీ హై (2)
చలా ఆ మేరే పర్‌వానే వఫా కీ శమా జల్‌తీ హై
ఓ మేరే హమ్‌రాహీ ఫిర్‌తీ హూఁ ఘబ్‌రాఈ
జహాఁ భీ హై ఆజా మేరే పాస్ ॥నైనా॥
అధూరా హూఁ మైఁ అఫ్‌సానా జో యాద్ ఆవూఁ చలే ఆనా
మేరా జో హాల్ హై తుఝ్ బిన్ వో ఆకర్ దేఖ్‌తే జానా
భీగీ -భీగీ పల్‌కే ఛమ్ -ఛమ్ అంసూఁ ఛల్‌కే
ఖోఈ -ఖోఈ ఆంఖేఁ హైఁ ఉదాస్ ॥నైనా॥
యే లాఖోం గమ్ యే తన్‌హాఈ ముహబ్బత్‌కీ యే రుస్‌వాఈ(2)
కటీ ఐసీ కయీ రాతేఁ న తుమ్ ఆయే న మౌత్ ఆయీ
యే బిందియా కా తారా జైసే హో అంగారా
మెహందీ మేరే హాథోం కీ ఉదాస్ ॥నైనా॥

## గుప్పెడుమనసు

రచన: ఆచార్య ఆత్రేయ సంగీతం: ఎమ్.ఎస్.విశ్వనాథం

మౌనమె నీ భాష ఓ మూగమనసా
తలపులు ఎన్నెన్నో కలలుకంటావు
కల్లలు కాగానె కన్నీరౌతావు ॥మౌనమె॥
చీకటి గుహ నీవు
చింతల చెలి నీవు
నాటక రంగానివే - మనసా
తెగిన పతంగానివే
ఎందుకు వలచేవో
ఎందుకు వగచేవో
ఎందుకు రగిలేవో ఏమై మిగిలేవో
ఎందుకు రగిలేవో ఏమై మిగిలేవో ॥మౌనమె॥
కోర్కెల నెలవీవు
కూరిమి వలవీవు
ఊహల ఉయ్యాలవే - మనసా
మాయల దయ్యానివే
లేనిది కోరేవు
వున్నది వదిలేవు
ఒక పొరబాటుకు యగములు పొగిలేవు
ఒక పొరబాటుకు యగములు పొగిలేవు ॥మౌనమె॥

## భక్తప్రహ్లాద

రచన: దాశరథి సంగీతం: ఎస్.రాజేశ్వరరావు

ఆది అనాదియు నీవే దేవా
నింగియు నేలయు నీవే కావా ॥ఆది॥
అంతట నీవే ఉండెదవు
శాంతివై కాంతివై నిండెదవు
దీనజనావన నారాయణా
మదమోహిత దానవ సంహరణా
మాయని జ్యోతివో, తీయని గీతివో
ఏమని వర్ణింతురా
తరుణ బిందువున, విరళసింధువున
ఎచట చూచినను నీవేకదా
కనులలోన మనసులోన నీ రూపమే ॥ఏ॥
నారద సన్నుత నారాయణా
నరుడవో గురుడవో
శివుడవో లేక శ్రీసతి పతివో
నారద సన్నుత నారాయణా:
దానవ శోషణ మానవ పోషణ
శ్రీ చరణా భవ హరణా
కనకచేల భయశమన శీల
నిజ సుజనపాల హరి సనాతనా
క్షీర జలధిశయనా! అరుణ కమలనయనా
గాన మోహనా! నారాయణా!

## నర్తనశాల

రచన: సముద్రాల గానం: సుసర్ల దక్షిణామూర్తి, బెంగుళూరు లత

బృహన్నల : ఆ... ఆ... ఆ.... సలలితరాగ సుధారససారం
బృ-ఉత్తర : సలలితరాగ సుధారస సారం
బృహన్నల : సర్వకళామయ నాట్య విలాసం
ఇరువురు : సర్వకళామయ నాట్య విలాసం
సలలిత రాగ సుధారససారం
బృహన్నల : మంజుల సౌరభ సుమకుంజములా
ఇరువురు : మంజుల సౌరభ సుమకుంజములా
బృహన్నల : రంజిలు మధుకర మృదు ఝంకారం
ఇరువురు : రంజిలు మధుకర మృదు ఝంకారం
సలలిత రాగ సుధారస సారం
సర్వకళామయ నాట్య విలాసం
బృహన్నల : కల్పనలో ఊహించిన హొయలు
ఇరువురు : కల్పనలో ఊహించిన హొయలు
బృహన్నల : శిల్పమనోహర రూపమునొంది
ఇరువురు : శిల్పమనోహర రూపమునొంది
బృహన్నల : పదకరణములా మృదుభంగిమలా
ఇరువురు : పదకరణములా మృదుభంగిమలా
ముదమార లయమీరు నటనాల సాగే
సలలిత రాగ సుధారస సారం
బృహన్నల : ఝణన ఝణన ఝణ నూపుర నాదం
ఇరువురు : ఝణన ఝణన ఝణ నూపుర నాదం
బృహన్నల : భువిలో దివిలో రవళింపగా
ఇరువురు : భువిలో దివిలో రవళింపగా
బృహన్నల : నాట్యము సలిపే నటరాయని
ఇరువురు : నాట్యము సలిపే నటరాయని
ఆనంద లీలా వినోదమే
సలలితరాగ సుధారససారం
సర్వకళామయ నాట్య విలాసం
బృహన్నల : సలలితరాగ సుధారససారం

## ఉయ్యాల జంపాల

రచన: ఆరుద్ర సంగీతం : పెండ్యాల

ఏటిలోని కెరటాలు ఏరు విడిచిపోవు
ఎదలోపలి మమకారం ఎక్కడికీ పోదు
ఊరు విడిచి వాడ విడిచి ఎంత దూరమేగినా
సొంత ఊరు అయినవారు అంతరాన వుందురోయి
తెంచుకొన్న కొలది పెరుగు తీయని బంధము
గాయపడిన హృదయాలను జ్ఞాపకాలె అతుకునోయి
కనుల నీరు చిందితే మనసు తేలికౌనులే
తనకూ తనవారికి ఎడబాటే లేదులే

(33వ పేజీ తరువాయి)

## పెళ్లిసందడి

రచన: వేటూరి సుందర్రామ్మూర్తి గానం: చిత్ర, బాలు, బృందం

కాబోయె శ్రీవారికి.... ప్రేమతో
రాసిపంపుతున్న... ప్రియరాగాల ఈ లేఖ
పల్లవి: మా పెరటి జాంచెట్టు పళ్లన్ని కుశలం అడిగె
మాతోట చిలకమ్మ నీకోసం ఎదురే చూసె
నిను చూసినాక నిద్దరైన రాక మనసే పెళ్లిమంత్రాలు కోరిందని
బిగి కౌగిట హాయిగ కరిగేది ఏనాడని అంటూ ॥మా॥
అ: యస్... యూ ఆర్ మై డ్రీమ్‌గర్ల్
నా కలల రాణి నా కళ్లముందుంది
అద్భుతం అవును అద్భుతం
మన కలయిక అద్భుతం
ఈ కలయిక ఇలాగే ఉండాలి ప్రామిస్
ఆ: ప్రామిస్
చ: నిన్ను చూడందె పదే పదే పడే యాతన
తోట పూలన్నీ కనీవినీ పడేను వేదన
నువ్వు రాకుంటే మహాశయా మదే ఆగునా
పూల తీగల్లో పడే ఉరే నాకింక దీవెనా
చూసే కన్నుల ఆరాటం వ్రాసే చేతికి మోమాటం
తలచి వలచి పిలచి అలసి
నీ రాక కోసం వేచి ఉన్న
ఈ మనసుని అలుసుగ చూడకని అంటూ ॥మా॥
చ: పెళ్లి చూపుల్లో నిలేసినా కథే(వి)టోమరి
జ్ఞాపకాలలో చలేసిన జవాబు నువ్వని
సందె పొద్దుల్లో ప్రతీక్షణం యుగాలయ్యినా
నీటి కన్నుల్లా నిరీక్షణం నిరాశ కాదని
తప్పులు వ్రాస్తే మన్నించు తప్పక దర్శనమిప్పించు
ఎదటో నుదుటో ఎచటో మజిలీ
నీమీద ప్రాణం నిలుపుకున్న మా మనవిని విని
దయచేయమని అంటూ ॥మా॥

## క్షణక్షణం

రచన: సీతారామశాస్త్రి గానం: ఎస్.పి. బాలు, చిత్ర

పల్లవి: జాము రాతిరి జాబిలమ్మ జోలపాడనా ఇలా
జోరుగాలిలో జాజికొమ్మా జారనీయకే కలా
వయ్యారి వాలుకళ్లలోన వరాల వెండి పూల వాన
స్వరాల ఊయలూగు వేళ ॥జాము॥
చ: కుహుకుహు సరాగాలే శృతులుగా
కుశలమా అనే స్నేహం పిలువగా
కిలకిలా సమీపించే సడులతో
ప్రతిపాద పదాలేవో పలుకగా
కునుకురాక బుట్టబొమ్మ గుబులుగుందని
వనములేచి వద్దకొచ్చి నిద్రపుచ్చనీ ॥జాము॥
చ: మనసులో భయాలన్నీ మరచిపో
మగతలో మరోలోకం తెరుచుకో
కలలతో ఉషాతీరం వెతుకుతూ
నిదరతో నిషారాణి నడచిపో
చిటికలోన చిక్కబడ్డ కటికచీకటి
కరిగిపోక తప్పదమ్మ ఉదయకాంతికి ॥జాము॥

## స్టూడెంట్ నెం:1

రచన: చంద్రబోస్ గానం: కీరవాణి, బృందం

ప: ఓ... మై డియర్ గర్ల్స్, డియర్ బోయ్స్, డియర్ మేడమ్స్
గురుబ్రహ్మలారా
ఎక్కడోపుట్టి ఎక్కడో పెరిగి యిక్కడే కలిశాము
చదువులమ్మ చెట్టునీడలో
వీడలేమంటు వీడుకోలంటు వెళ్లిపోతున్నాము
చిలిపితనపు చివరిమలుపులో
వి మిస్ ఆల్ ద ఫన్, వి మిస్ ఆల్ ద జోయ్
చ: నోటుబుక్కులోన రాణికి పంపిన ప్రేమలేఖలు
సైన్సులాబ్‌లోన షీలాపై చల్లిన యింకు చుక్కలు
ఫస్ట్‌బెంచ్‌లోన మున్నీపై వేసిన పేపర్ ప్లైట్‌లు
రాధజళ్లోనుంచి రాబర్ట్‌లాగిన రబ్బరు బాండ్‌లు
రాజేష్ యిచ్చిన రోజాపువ్వులు
శ్రీవాణి పెట్టిన చెవిలో పువ్వులు
కైలాష్ కూసిన కాకికూతలు
కళ్యాణి పేల్చిన లెంపకాయలు
మరపురాని తిరిగిరాని గురుతులండి
మీ మనసు నొచ్చుకునివుంటే మన్నించండి
గర్ల్స్: అంతపెద్ద మాటలొద్దు పూరుకోండి
ఆ అల్లరంటె మాక్కూడా సరదా లెండి
వి మిస్ ఆల్ ద ఫన్ వి మిస్ ఆల్ ద జోయ్
వి మిస్ యు ॥ఎక్కడో॥
చ: బోటనీ మాస్టారి బోడిగుండుపైన బోలెడు జోకులు
రాగిణి మేడమ్ రూపురేఖపైన గ్రూపు సాంగులు
సుబ్బయ్య మాస్టారి స్కూటీకి గుచ్చిన గుండు పిన్నులు
టైపిస్టు కస్తూరి ఖాతాలో తాగిన కోకు టిన్నులు
బ్లాక్ బోర్డుపైన గ్రీకుబొమ్మలు
సెల్లుఫోనుల్లోన సిల్లీన్యూసులు
బాత్‌రూముల్లోన భావకవితలు
క్లాసు రూముల్లోన కుప్పిగంతులు
మరుపురాని తిరిగిరాని గురుతులండి
మీ మనసు నొచ్చుకుని వుంటే మన్నించండి
లెక్చరర్స్: మనకు మనకు క్షమాపణలు ఎందుకండి
మీ వయసులోన మేంకూడా యింతేనండి
వి మిస్ ఆల్ ద ఫన్
వి మిస్ ఆల్ ద జోయ్ వి మిస్ యు

## అన్నమయ్య

అన్నమయ్య కీర్తన గానం: బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

ప/అ:మూసిన ముత్యాలకేలే మొరగులు
ఆశల చిత్తానికేలే అలపోకలు (2) ఆ: ॥మూసిన॥
పల్లవి: కందులేని మోమునకేలే ఆ: కస్తూరి
అ: చిందునేయి కొప్పునకేలే ఆ: చేమంతులు
అ: మందయానమునకేలే మట్టెల మోతలు (2)
గంధమేలే పై కమ్మని నీ మేనికి ఆ: ॥మూసిన॥
పల్లవి: ముద్దు ముద్దు మాటలకేలే అ: ముదములు
ఆ: నీ అద్దపు చెక్కిలి పేరే అ: అరవిరి
అ: ఒద్దిక కూటమికేలే ఎలే ఎలే ఎలేలే
ఒద్దిక కూటమికేలే నీకు అద్దమేలే తిరువేంకటాద్రీసుగూడి
॥మూసిన॥

(45వ పేజీ తరువాయి)

### చూడాలని ఉంది

రచన: వేటూరి గానం: హరిహరన్

సరిమామగరి సస సనిదపస (2)
రిమదనిదపసాసనిదప మదపమరి
ప: యమహానగరి కలకత్తా పురి (2)
నమహోహుబిలి హౌరా వారధి ॥యమ॥
చ: నేతాజీ పుట్టిన చోట గీతాంజలి పూసినచోట
పాడనా తెలుగులో
ఆ హంస పాడిన పాటే ఆ నందుడు చూపిన బాట సాగనా
పరుగులో పరుగు తీసింది పట్నం బ్రతుకుతో వెయ్యి బంధం
కడకు చేరాలి గమ్యం కదలిపోరా
ఒకరితో ఒకరికి ముఖపరిచయములు
దొరకని క్షణమున బిజి బిజి బ్రతుకుల
గజి బిజి ఉరుకుల పరుగులలో ॥యమ॥
చ: బెంగాలీ కోకిల బాల తెలుగింటి కోడలు పిల్ల
మానిని సరోజిని
రోజంతా సూర్యుడిక్రింద రాత్రంతా రజనీగంధా సాగనీ
పదుగురు ప్రేమలే లేని లోకం దేవదామార్కు మైకం
శరన్న వలాభి షేఖం తెలుసుకోరా
కలలకు నెలవట కళలకు కొలువట
తిదులకు సెలవట అతిథుల గొడవట
కలకట నగరపు నగరపు కిటకిటలో ॥యమ॥
చ: వందేమాతరమ్ అన్నా వంగా భూతలమే మిన్న జాతికే గీతిరా
మాతంగి కాళీ నిలయ చోరంగి రంగుల దునియా నీదిరా
వినుగురు సత్యజిత్‌రే సితారా ఎస్‌డి బర్మన్‌కి ధారా
థెరీసాకీ కుమారా కదలి రారా
జనగణమనమున స్వరపదరవనమున
హృదయపులయలను శ్రుతిపరిచినప్రియ
శుకపిక ముకసుక రవములతో ॥యమ॥

### చూడాలని వుంది

రచన: వేటూరి సుందర్రామ్మూర్తి గానం: బాలు, సుజాత

ఆ: అబ్బబ్బా ఇద్దూ అదిరేలా ముద్దు
అ: అమ్మమ్మా దిద్దు మధురాలా మరోముద్దు ॥అబబ్బా॥
ఆ: చలిపులి పంజా విసిరితె సలసలకాగే వయసులో
అ: గిలగిలలాడే సొగసుకే జో లాలీ... ॥అబబ్బా॥
ఆ: వాటేసుకో వదలకు వలపుల వల విసిరి
వాయించునీ మురళిని వయసుగాలి పోసి
అ: దోచెయ్యనా దొరికితే దొరకని కోకసిరి
రాసేయ్యనా పాటలే పైటచాటు చూసి
ఆ: ఎవరికి తెలియవు ఎదరస నసలు
అ: పరువాలాటకు పానుపు పిలిచాకా
ఆ: తనువు తాకినా తనివితీరని వేళా ॥అబబ్బా॥
అ: జాబిల్లితో జతకలు జగడపు రగడలతో
పొంకాలతో నిలునిలు పొగడ మాల వేసి
ఆ: ఆకాశమే కులుకులు తొడిమెడు నడుమిదిగో
సూరీడునే పిలుపిలు చుక్కమంచు సోకి
అ: అలకల చిలకలు చెలి రుసరుసలు
ఆ: ఇక జాగెందుకు ఇరుకున పడిపోగా
అ: మనసుతీరినా వయసులారని వేళా ॥అబబ్బా॥

### గణేష్

రచన: సిరివెన్నెల గానం: ఎస్.పి.బాలు

ఆ...... ...... .....
ప: సిరిసిరి మువ్వలు ఆ విరిసిన పువ్వులు
చిరుచిరు ఆశలు ఈ గలగల ఊసులు
కలబోసి చేసినవి కిలకిల నవ్వులు
వెలబోసి ఈ సిరులు కొనలేరెవ్వరు
దేవుడే ఆ దివినుండి పంపిన దీవెనలు
ఎప్పుడూ ఈ కోవెలలో వెలిగే దీపాలు ॥సిరిసిరి॥
చ: అల్లరంత సిరిమువ్వలై ఘల్లుఘల్లు మంటే హోయ్
నిలువలేక నిశ్శబ్దమే విసుగుపుట్టి పోదా
సంతోషం కూడా తనకి చిరునామా అవ్వాలని
కన్నీరు చేరుకుంది తెగ నవ్వే మనకళ్ళని
ఈ మణికాంతి వెలుగుతువుంటే (2)
చీకటి రాదే కన్నులకెదురుగ ॥సిరిసిరి॥

### బావగారూ బాగున్నారా

రచన: చంద్రబోస్ గానం: ఎస్.పి. బాలు, చిత్ర

అ: ఆంటీ కూతురా అమ్మో అప్సర ముస్తాబదిరింది (2)
ముహూర్తం ముందరున్నది
తథాస్తని పందిరన్నది
ఆ: అంకుల్ పుత్రుడా హల్లో అల్లుడా వరసేకుదిరింది
వడ్డాణం తొందరన్నది
వెడ్డింకే సిద్ధమైనది
అ: పెళ్ళిదాక చేరుకున్నా అందాల పిల్లగారు బావున్నారు
ఆ: భర్తలా మారనున్న బంగారు బావగారు బావున్నారు
అ: బుగ్గ చుక్క వారెవా,
ముక్కుపుడక వారెవా
ఆ: గళ్ళచొక్కా వారెవా కళ్ళజోడు వారేవ్వా ॥ఆంటీ॥
అ: ఆదివారమర్ధరాత్రి వేళలో
ఆ అల్లరంతా మరిచేదెట్టా
ఆ: సోమవారమాడుకున్న ఆటలో
ఆ హోయికింక సరిలేదంటా
అ: వంటయింటి మధ్యలో గంటకెన్ని ముద్దులో
ఆ: వేపచెట్టు నీడలో చెంపకెన్ని చుంబలో
అ: ఎట్టాలెక్కెట్టినా పిట్ట నీ ఒంటిలో పుట్టుమచ్చలువ్వని ఏడు
ఆ: ఇంకా చెప్పేయవద్దు ఆనవాళ్ళు ఇటువైపే చూడసాగె వెయ్యికళ్ళు
అ: ముద్దుమురిపాలు అంటే గిట్టనోళ్ళు
మునుముందు జన్మలోన కీటకాలు ॥ఆంటీ॥
అ: ఇంచుమించు ఇరవైఆరు నడుముతో
నువ్వు కదిలే సాగదు కాలం
ఆ: నిబ్బరంగా డెబ్బైఆరు బరువుతో నువ్వు నడిస్తే నిలవదు ప్రాణం
అ: గోల్డ్ ఛెయిన్ సాక్షిగా ఎన్నిగోటి ముద్రలో
ఆ: హెయిర్ పిన్ సాక్షిగా ఎన్ని హాట్ గుర్తులో
అ: కైపే పుట్టించినా చిట్కా ఓటుందిగా
కొండవీటి చాంతాడంత
ఆ: పెళ్ళేకాలేదుకాని లక్షణంగా పెళ్ళానికంటే నేను ఎక్కువేగా
అ: ముళ్ళే పడలేదుకాని సుబ్బరంగా
థ్రిల్లేదో నాకు తెలిసే రంగరంగ ॥ఆంటీ॥

జులై 11
మణిశర్మ
పుట్టినరోజు
సందర్భంగా



ఎ. మాధవరెడ్డి, నారా చంద్రబాబు నాయుడులతో...



పండిట్ రవిశంకర్‌తో...





సంగీత దర్శకులు సత్యం,
యస్. వాసూరావులతో...

సంగీత
ప్రియులందరి
తరపున
శుభాకాంక్షలతో...

హాసం

RNI Regd. No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No. H-HD-997.



